# వేదాంతసారః

## సదానన్దయోగీన్ద్రవిరచితః

ఆంధ్రభాషానువాదః

**డా॥ పి.శశిరేఖ**

ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2015**

# VEDANTASARAH

*By*
**Sadananda Yogeendra**

*Translated in to Telugu by*
**Dr.P. Sasi Rekha**

T.T.D. Religious Publications Series No. 1149


*First Edition:- 2015*

Copies:

*Published by*
**Dr. D. SAMBASIVA RAO**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Office of the Editor-in-Chief
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

## ముందుమాట

సదానందయోగీంద్రులు రచించిన వేదాంతసారం అనే ఈ గ్రంథంలో ప్రధానమైన వేదాంత సిద్ధాంతాలు వివరింపబడి ఉన్నాయి. షడ్దర్శనాలలో వేదాంత దర్శనం (ఉత్తర మీమాంస) ఒకటి. ఇందులోని ప్రధానాంశం జగత్కారణమైన తత్త్వనిరూపణం. ఈ తత్త్వనిరూపణలోని అంశాలు ఆధారంగా అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సంప్రదాయాలు ఏర్పడినాయి. ఆది శంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతాన్ని వివరించడానికి బ్రహ్మసూత్రాలకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యాలు రచించారు. **'విషయో జీవబ్రహ్మైక్యం శుద్ధచైతన్యం ప్రమేయం; తత్రైవ వేదాంతానాం తాత్పర్యాత్'** అనేది వేదాంతసారంలో ప్రతిపాదింపబడిన అంశం. జీవబ్రహ్మల ఏకత్వం, శుద్ధచైతన్య స్వరూపం మొదలైన విషయాలను తెలియజేసేదే వేదాంతం.

ఆదిశంకరుల భాష్యాలలోని అద్వైత విషయాలు పండితులకు తప్ప సామాన్యులకు అర్థంకావు. శాంకరభాష్యంలో ప్రతిపాదితమైన విషయాలను అందరికీ అర్థమయ్యే పద్ధతిలో కొందరు ఆచార్యులు వివరించారు. అలాంటివారిలో సదానందయోగీంద్రులు ఒకరు. అద్వైత వేదాంతంలో **'తత్త్వమసి'**ని మహావాక్యమంటారు. భిన్నార్థకాలైన తత్, త్వం అనే పదాలు బోధించే వాటికి ఐక్యం చెప్పి ఒక అఖండార్థాన్ని బోధించే వాక్యమిది. ఈ వాక్య వివరణ ద్వారా ముముక్షువులకు జీవబ్రహ్మల ఐక్యం బోధపడుతుంది. లోకవ్యవహారానికి కారణమైన అజ్ఞానం తొలగిపోయి సత్ చిత్ ఆనందమయమైన పరబ్రహ్మను తెలుసుకోవడమే మోక్షం. ఈ విషయాన్ని వివరించడానికి సదానందయోగి చార్వాకులు, బౌద్ధులు మొదలైనవారు చెప్పే విషయాలను నిరసిస్తూ అద్వైత వేదాంతంలోని ప్రధానాంశాలను అనేక ఉపపత్తులతో నిరూపించే ప్రయత్నం చేశారు.

అద్వైత సిద్ధాంత విషయకంగా ఎంతో విలువైన 'వేదాంతసారం' అనే ఈ సంస్కృత గ్రంథాన్ని డా॥ పి.శశిరేఖ తెలుగులో అనువదించారు. అనువాదంతో పాటు విషయవివరణలను కూడా చేర్చారు. వీరి అనువాదం సరళంగాను, స్పష్టంగాను ఉంది. వీరికి తి.తి.దే పక్షాన కృతజ్ఞతలు. అద్వైత వేదాంత విషయాలు తెలుసుకోగోరే వారికి, సాధకులకు ఈ గ్రంథం ఎంతో ఉపయోగకారిగా ఉంటుందని భావిస్తున్నాను.

*సదా శ్రీవారి సేవలో....*

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# ప్రస్తావన

సంస్కృతవాఙ్మయంలో వేదాంతానికి మహత్తరమైన స్థానం ఇవ్వబడింది. నిత్య, నైమిత్తికకర్మలు ఆచరించి, ఐహికజీవనం అర్థవంతంగా గడుపుతున్న మానవునికి ఈ ఐహికబంధాలనుండి విముక్తి కావాలనే కోరిక కలుగుతుంది. శరీరపతనానంతరం కలిగే ముక్తిని గురించిన ఆలోచన కాదు ఇది. ఈ ప్రపంచంలో ఉంటూనే శాంతి కావాలని అభిలాష. ఎందరో మహర్షులు తమ తపఃఫలంగా కనుగొన్న మోక్షసాధనోపాయం 'తత్త్వదర్శనం'. ఒక వస్తువును దాని రూపంలోనే చూడటం తత్త్వం. అసలు యీ జగత్తుయొక్క స్వరూపం ఏమిటి? ఈ సృష్టి, స్థితి, లయలు ఏమిటి అని మానవుని మస్తిష్కంలో చెలరేగే ప్రశ్నలకు సమాధానమే దర్శనశాస్త్రం. తత్త్వదర్శనమే నిశ్రేయససిద్ధికి మూలం గనుక భిన్నభిన్నకాలాల్లో భిన్నభిన్న దృక్కోణాలననుసరించి వివిధదర్శనశాస్త్రాలు అవతరించాయి. వాటిలో వేదప్రామాణ్యాన్ని అంగీకరించిన వాటిని ఆస్తికదర్శనాలు అనీ, వేదప్రామాణ్యాన్ని అంగీకరించని వాటిని నాస్తికదర్శనాలు అనీ విభజించడం జరిగింది.

సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస (వేదాంతము)– అని ఆరు ఆస్తికదర్శనాలు. వీటిలో చివరిది ఐన వేదాంత దర్శనము శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. జగత్కారణమైన ఒకానొక తత్త్వం యొక్క స్వరూపనిరూపణమే వేదాంతదర్శనంలోని ప్రధానాంశం. దీనికై ఉపనిషద్వాక్యాలను ప్రమాణాలుగా చూపడం జరిగింది. ఈ తత్త్వనిరూపణంలో జీవబ్రహ్మల ఐక్యమూ, భిన్నత్వము అనే అంశాల ఆధారంగా అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతాలు ఏర్పడినాయి. జీవబ్రహ్మల ఐక్యాన్ని ప్రతిపాదించేది అద్వైతవేదాంతం. 'అంతా బ్రహ్మమయమే' అని అద్వైతసిద్ధాంతం. కంటికి కనిపించే యీ ప్రపంచమూ, దానిలోని భేదాలూ అన్నీ మిథ్యాకల్పితాలే. సచ్చిదానందమైన, అద్వయమైన బ్రహ్మ ఒక్కటే నిత్యం. ఈ విషయం అర్థం చేసుకొంటే యీ ప్రపంచంలో రాగద్వేషాలు, ఈర్ష్యాసూయాదులు ఉండవు.

శ్రీశంకరభగవత్పాదులు బ్రహ్మసూత్రాలకూ, ఉపనిషత్తులకూ, శ్రీమద్భగవద్గీతకూ భాష్యం వ్రాసి ఈ విషయాన్ని చక్కగా వివరించారు. అయినప్పటికీ ఆ గ్రంథాలు విద్వాంసులకు తప్ప సామాన్యులకు అందజాలవు కాబట్టి ఎందరో ఆచార్యులు శాంకరభాష్యాన్ని కూడా అర్థమయ్యేటట్లుగా వివరించారు. ఒక్క శాస్త్రగ్రంథంలోని ముఖ్యమైన అంశాన్ని మాత్రమే ఎన్నుకొని దానిని వివరించే గ్రంథాలను ప్రకరణగ్రంథాలు అంటారు. అలా యీ 'అద్వైతవేదాంతాన్ని' గూర్చి ఎన్నో ప్రకరణగ్రంథాలు రచించబడినాయి. వాటిలో 'శ్రీసదానందయోగీంద్రుడు' రచించిన 'వేదాంతసారం' బహుళప్రాచుర్యాన్ని పొందింది. సంక్షిప్తంగా సారరూపంలో సులభంగా అర్థం అయ్యేటట్లుగా రచించబడినది యీ గ్రంథం.

ఈ గ్రంథకర్త సదానందయోగీంద్రుడు క్రీ.శ.16వ శతాబ్దికి చెందినట్లు తెలుస్తూంది. ప్రధానమైన వేదాంతసిద్ధాంతాల్ని సమీకరించి వ్రాయబడిన యీ గ్రంథానికి నృసింహసరస్వతి "సుబోధినీ" వ్యాఖ్యను, ఆపదేవుడు 'బాలబోధినీ' వ్యాఖ్యనూ, స్వామిరామతీర్థయతి 'విద్వన్మనోరంజని' వ్యాఖ్యను రచించారు.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు యీ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించే కార్యాన్ని నాకు అప్పగించటం ఆ తిరుమలేశుని అనుగ్రహమే అని నేను భావిస్తాను. ఈ అనువాదంలో 'విద్వన్మనోరంజని' వ్యాఖ్యానాన్ని అనుసరించడం జరిగింది. ఆ వ్యాఖ్యానానికి సుప్రసిద్ధసంస్కృతవిద్వాంసులు 'శ్రీ బదరీనాథశుక్లా'గారు కూర్చిన హిందీ అనువాదం నా కార్యాన్ని సులభతరం చేసింది. నాకీ సదవకాశం ఇచ్చిన తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణల యాజమాన్యం వారికి నా హార్దిక కృతజ్ఞతలు. గుణదోషజ్ఞులైన విద్వాంసులు ఈ అనువాదాన్ని సహృదయంతో గ్రహిస్తారని ఆశిస్తున్నాను. ఈ అపూర్వ అవకాశాన్ని కల్పించిన శ్రీనివాసుని చరణారవిందాలకు ప్రణతులు తి.తి.దే పబ్లికేషన్స్ వారికి కృతజ్ఞతలు.

**డా॥పి.శశిరేఖ**

శ్రీః

# వేదాన్తసారః

**మూ॥ అఖణ్డం సచ్చిదానన్దమవాఙ్మానసగోచరమ్,**
**ఆత్మానమఖిలాధారమాశ్రయేఽభీష్టసిద్ధయే. 1**

ప్రారంభించబోవు గ్రంథరచనరూపకార్యముయొక్క నిర్విఘ్నసమాప్తికై గ్రంథకర్త మంగళాచరణశ్లోకంలో ఇలా ప్రార్థిస్తున్నాడు.

అను.వా॥ "అఖండమూ, సచ్చిదానందస్వరూపమూ, మాటలకూ, మనస్సుకూ అందనిదీ, అన్నింటికీ (సకల జగత్తుకూ) ఆధారమూ అయిన ఆత్మను నా అభీష్టసిద్ధికై ఆశ్రయిస్తున్నాను."

వి॥ సాధారణంగా గ్రంథారంభంలో విఘ్నేశ్వరుణ్ణో, సరస్వతీదేవినో లేదా తమ ఇష్టదేవతనో స్తుతిస్తారు. సదానందుడుమాత్రం ఇక్కడ ఆత్మను స్తుతిస్తున్నాడు. "ఏష ఉ హ్యేవ సర్వే దేవా" అనే శ్రుతివాక్యాన్ననుసరించి "ఆత్మయే సర్వదేవతాత్మకము". ఆత్మపరమాత్మలు ఒక్కటే అని తెలిసినవాడవటంచేత "ఆత్మను ఆశ్రయిస్తున్నాను" అని చెప్పాడు. అందుచేతనే 'అఖండ' ఇత్యాది విశేషణాలను చేర్చి జగత్తుకు మూలాధారమైన తత్త్వాన్ని స్తుతించాడు. ఈ విధంగా శాస్త్రంలో ప్రతిపాదించబోయే ఆత్మతత్త్వాన్ని స్తుతించి, ఆ తరువాత గురువందనం చేస్తున్నాడు.

**మూ॥ అర్థతోఽప్యద్వయానన్దానతీతద్వైతభానతః**
**గురూనారాధ్య వేదాన్తసారం వక్ష్యే యథామతి. 2**

అను.వా॥ అర్థంచేత కూడ (కేవలం నామమాత్రానికే కాక) అద్వైతరూపంగా భాసించే అద్వయానందాచార్యులను స్మరించి నాకు తెలిసినంతవరకు వేదాన్తము యొక్క సారాన్ని చెప్పబోతున్నాను.

**మూ॥ వేదాన్తో నామోపనిషత్ప్రమాణం తదుపకారీణి శారీరకసూత్రాదీని చ.**

అను.వా॥ వేదాంతమనగా ఉపనిషద్రూపమైన ప్రమాణం. ఆ ఉపనిషత్తులకు ఉపకారకంగా ఉండే శారీరకసూత్రాలు (బ్రహ్మసూత్రాలు) మొదలైనవి కూడా వేదాంతమే.

వి॥ వేదాంతమనగా వేదాల చివరిభాగం. సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు అని వేదం క్రమంగా నాల్గుభాగాలు కల్గి ఉంటుంది. మంత్రరూపమైనది సంహిత. సంహితలోని కొన్నిపదాల అర్థం వివరిస్తూ ఆయా కర్మలను విధించేది బ్రాహ్మణము. ఆరణ్యంలో నివసించే వానప్రస్థులు పఠింపదగినవి ఆరణ్యకాలు. వేదవాక్యాల్లోని బ్రహ్మతత్త్వాన్ని తెలిపేవి ఉపనిషత్తులు. ఈ విధంగా వేదాల చివరి అంశం కాబట్టి ఉపనిషత్తులకి వేదాంతం అనే పేరు వచ్చింది. అవి గాకుండా బాదరాయణుడు రచించిన బ్రహ్మసూత్రాలు (వీటినే శారీరక సూత్రాలు అని కూడా అంటారు) మొదలైనవి కూడా వేదాంతంగా పరిగణింపబడ్డాయి. 'శారీరకసూత్రాదీని' అని చెప్పడంలో ఉద్దేశ్యం సూత్రాలు, వాటి భాష్యాలూ అని అర్థం.

ఉపనిషత్తు యొక్క వ్యుత్పత్త్యర్థం రెండు విధాలుగా చెప్పవచ్చును. ఉపనిషద్ – ఉప, ని, షద్.

ఉప, ని, అను ఉపసర్గలతో కూడిన షద్ల్ 'షద్' ధాతువునుండి నిష్పన్నమైనది. 'ఉపనిషద్' అను పదము. ఇందులో 'ఉప' శబ్దము సామీప్యాన్ని చెప్తుంది. 'ని' అనునది నిశ్చయంగా అని తెలియజేస్తుంది. 'షద్ల్' ధాతువునకు మూడు అర్థాలు చెప్పవచ్చును. అవి–

1. విశరణ – శిథిలంచేయటం
2. గతి – పొందింపచేయటం, చేర్చటం
3. అవసాదన – నిర్మూలించటం

ఉప – బ్రహ్మణః సామీప్యం జీవం నిస్సంశయం సాదయతి గమయతి – నిస్సంశయంగా జీవుణ్ణి బ్రహ్మవద్దకు చేరుస్తుంది. జీవబ్రహ్మైక్యాన్ని



సాధిస్తుంది. కాబట్టి 'ఉపనిషద్', లేదా ఉప – ఉపజాతం అనాదికాలాత్ ప్రవృత్తం ఆత్మ – సంసారసంబంధం నితరాం సాదయతి – అవసాదయతి.

"అనాదికాలంగా వస్తూన్న సంసారబంధాన్ని నశింపజేస్తుంది. కావున 'ఉపనిషద్'. ఆత్మకు శరీరంతో బంధాన్ని ఏర్పరచటం అజ్ఞానమూలకం. అజ్ఞానాన్ని తొలగించి ఆత్మకు సంసారబంధం లేదు అని తెలియజేస్తుంది ఉపనిషద్.

శారీరకసూత్రం అనగా– 'శరీరమేవ శరీరకం', తత్ర భవో జీవః శారీరకః, స సూత్ర్యతే యాథాతథ్యేన నిరూప్యతే యైః తాని శారీరకసూత్రాణి.

శరీరం అన్నా శరీరకం అన్నా ఒకే అర్థం. శరీరంలో ఉన్న జీవుడు శారీరకుడు. ఆ శారీరకుణ్ణి అనగా జీవుణ్ణి గూర్చి తెలిపే సూత్రాలు శారీరక సూత్రాలు.

ఈ విధంగా ఆత్మ పరమాత్మలకు తత్త్వాన్ని నిరూపించేది వేదాంతం.

**మూ॥ అస్య వేదాన్తప్రకరణత్వాత్తదీయైరేవానుబన్ధైస్తద్వత్తాసిద్ధే ర్నతే పృథగాలోచనీయాః**

అను.వా॥ఈ 'వేదాన్తసారము' వేదాంతశాస్త్రప్రకరణగ్రంథం అవటంచేత ఆ వేదాంతశాస్త్రంయొక్క అనుబంధచతుష్టయమే దీనికీ వర్తిస్తుంది. కావున ఈ గ్రంథానికై వేరుగా మరో అనుబంధచతుష్టయాన్ని గూర్చి ఆలోచించాల్సిన అవసరం లేదు.

వి॥ ఒక్క శాస్త్రంలోని ఒక అంశాన్ని తీసుకొని చర్చించే గ్రంథాన్ని ప్రకరణగ్రంథం అంటారు. శాస్త్రంలో ఆ విషయాన్ని గూర్చి ఏం చెప్పారో ఈ ప్రకరణగ్రంథం వివరిస్తుంది. అందుచేత ప్రధానశాస్త్రం యొక్క విషయమూ, ప్రయోజనమూ మొదలైనవి ప్రకరణగ్రంథంలోనూ ఉంటాయి.

**శాస్త్రైకదేశసంబద్ధం శాస్త్రకార్యాన్తరే స్థితమ్.**
**ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదం విపశ్చితః**

అని ప్రకరణగ్రంథస్వరూపాన్ని గూర్చి చెప్పారు. ఇప్పుడు అనుబంధ చతుష్టయాన్ని గూర్చి వివరిస్తున్నాడు.

**మూ॥ తత్రానుబన్ధో నామాధికారివిషయసమ్బన్ధప్రయోజనాని. 3**

అను.వా॥ అధికారి, విషయము, సంబంధము, ప్రయోజనము అని నాలుగు అనుబంధాలు

వి॥ అనుబంధం అనగా అధ్యేతను (చదువరిని) గ్రంథం వైపు ప్రవర్తించేటట్టు చేసేది. అధికారి అనగా శాస్త్రాధ్యయానికి యోగ్యత కల్గినవాడు. విషయము అనగా గ్రంథంలో ప్రతిపాదించబడే విషయము. సంబంధము అనగా విషయాలకు శాస్త్రంతో గల సంబంధం. విషయప్రతిపాదనమే ప్రస్తుతం శాస్త్రానికీ గ్రంథానికీ గల సంబంధం. ప్రయోజనం గ్రంథాధ్యయనం యొక్క ప్రయోజనం.

ఈ నాల్గూ ప్రతిశాస్త్రగ్రంథానికీ వర్తిస్తాయి. అంతేగాక ప్రతిగ్రంథానికీ వర్తిస్తాయి అని చెప్పవచ్చు.

**మూ॥ అధికారీ తు విధివదధీతవేదవేదాఙ్గత్వేనాపాతతోఽధిగతాఖిల వేదార్థోఽస్మిన్ జన్మని జన్మాన్తరే వా కామ్యనిషిద్ధవర్జనపురఃసరం నిత్యనైమిత్తికప్రాయశ్చిత్తోపాసనానుష్ఠానేన నిర్గతనిఖిలకల్మషతయా నితాన్తనిర్మలస్వాన్తః సాధనచతుష్టయసమ్పన్నః ప్రమాతా.**

అను.వా॥ నియమానుసారము వేదవేదాంగములనభ్యసించి వేదార్థాన్ని స్థూలంగా తెలుసుకొన్నట్టి ఈ జన్మయందుగాని, పూర్వజన్మయందుగాని, కామ్యకర్మలను, నిషిద్ధకర్మలను త్యజించి, నిత్యకర్మలను, నైమిత్తికకర్మలను, ప్రాయశ్చిత్తాలను, ఉపాసనావిధులను ఆచరించటంద్వారా సమస్తకల్మషాలనూ పోగొట్టుకొని నిర్మలస్వాంతుడైనట్టి, శమదమాదిసాధనచతుష్టయాన్ని స్వాధీనం చేసుకొన్నట్టి, యథార్థజ్ఞానసంపన్నుడు వేదాంతసారమనే ఈ వేదాంత శాస్త్ర గ్రంథాన్ని అధ్యయనం చేయటానికి 'అధికారి' అనగా 'అర్హుడు'.



**మూ॥ కామ్యాని స్వర్గాదీష్టసాధనాని జ్యోతిష్టోమాదీని. నిషిద్ధాని నరకాద్యనిష్టసాధనాని బ్రాహ్మణహననాదీని, నిత్యాన్యకరణే ప్రత్యవాయసాధనాని సన్ధ్యావన్దనాదీని, నైమిత్తికాని పుత్రజన్మాద్యనుబన్ధీని జాతేష్ట్యాదీని, ప్రాయశ్చిత్తాని పాపక్షయసాధనాని చాన్ద్రాయణాదీని. ఉపాసనాని సగుణబ్రహ్మ విషయమానసవ్యాపారరూపాణి శాణ్డిల్యవిద్యాదీని.**

ఇప్పుడు క్రమంగా కామ్యాదికర్మలు అనగా ఏమిటో వివరిస్తున్నాడు

అను.వా॥ స్వర్గం మొదలైనవి లభించాలని చేసే జ్యోతిష్టోమయాగము మొదలైనవి కామ్యకర్మలు. నరకానికి దారితీసే బ్రాహ్మణహత్య మొదలైనవి నిషిద్ధకర్మలు. విధిగా ఆచరించకపోవటంవల్ల అనర్థాన్ని కల్గించే సంధ్యావందనాదులు నిత్యకర్మలు. పుత్రుడు కల్గినపుడు చేసే జాతకర్మ మొదలైనవి నైమిత్తికకర్మలు. పాపాలను హరించివేసే చాంద్రాయణవ్రతము మొదలైనవి ప్రాయశ్చిత్తకర్మలు. సగుణబ్రహ్మను మనసులో నిలుపుకొనిచేసే శాండిల్యవిద్యమొదలైనవాటిలో ఉన్న ఉపాసనాకర్మలు.

చాంద్రాయణ వ్రతము: కృష్ణపక్షంలో ఒక్కొక్క కబళం ఆహారాన్ని తగ్గిస్తూ, శుక్లపక్షంలో క్రమంగా ఒక్కొక్క కబళం అధికం చేస్తూ ఆహారాన్ని తీసుకునే వ్రతం. దీన్ని గూర్చి మనుస్మృతిలో ఇలా చెప్పబడింది.

**ఏకైకం హ్రాసయేత్ పిణ్డం కృష్ణే శుక్లే చ వర్ధయేత్,**
**ఉపస్పృశన్ త్రిషవణమేతచ్చాన్ద్రాయణం స్మృతమ్.**

**– మనుస్మృతి 11–216**

'ప్రతిరోజూ ఉదయ, మధ్యాహ్న, సాయంసమయాలందు స్నానం చేసి, పూర్ణిమరోజు పదిహేనుముద్దలు ఆహారం తీసుకొని క్రమంగా రోజుకో ముద్దచొప్పున తగ్గిస్తూ అమావాస్యనాడు ఉపవాసం ఉండి మళ్లీ శుక్లపక్షంలో ఒక్కొక్కముద్దే ఎక్కువగా భుజించటం చాంద్రాయణవ్రతం.'

శాండిల్య విద్య: 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత. అథ ఖలు క్రతుమయః పురుషో యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి స క్రతుం కుర్వీత' అని ఛాందోగ్యోపనిషత్తులో శాండిల్య విద్యను గూర్చి చెప్పబడింది.

ఈ జగత్తంతయూ బ్రహ్మస్వరూపము. తజ్జము (బ్రహ్మనుండి పుడుతుంది), తల్ల (దానిలోనే లీనమౌతుంది), తదన (ఉత్పత్తిలయలకు మధ్యకాంలో బ్రహ్మవల్లనే నిలిచి ఉంటుంది. మూడు కాలాల్లోనూ ఉత్పత్తికి పూర్వం, మధ్యన వర్తమానకాలంలో, చివర లయస్థితిలో ఈ జగత్తు బ్రహ్మనుండి భిన్నం కాదు.' ఈ విషయాన్ని మనసులో నిలుపుకొని రాగద్వేషాలకు అతీతుడై శాంతచిత్తుడై ఉపాసనచేయటం శాండిల్యవిద్యోపాసన.

**మూ॥ ఏతేషాం నిత్యాదీనాం బుద్ధి శుద్ధిః పరంప్రయోజనముపాసనానాం తు చిత్తైకాగ్ర్యం "తమేతమాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన" – ఇత్యాదిశ్రుతేః, "తపసా కల్మషం హన్తి" ఇత్యాది స్మృతేశ్చ.**

అను.వా॥ నిత్యకర్మల అనుష్ఠానంవలన బుద్ధి (మనస్సు) నిర్మలమౌతుంది. ఉపాసనవలన చిత్తానికి ఏకాగ్రత కుదురుతుంది. ఈ విషయాన్ని

"తమేతమాత్మానం......." అన్న శ్రుతివాక్యమూ, "తపసా......." అనే స్మృతివాక్యమూ తెలియజేస్తున్నాయి.

పైన చెప్పబడిన శ్రుతివాక్యానికీ అర్థం – "బ్రాహ్మణులు (వేదాధ్యయన సంపన్నులు శ్రుతివాక్యాలద్వారా, యజ్ఞానుష్ఠానంద్వారా యీ 'ఆత్మను' తెలుసుకొనగోరుతారు. స్మృతివాక్యానికి అర్థం – "తపస్సుచేత కల్మషాన్ని పోగొడుతున్నాడు."

**మూ॥ నిత్యనైమితికప్రాయశ్చిత్తోపాసనానాం త్వవాన్తరఫలం పితృలోకసత్యలోక ప్రాప్తిః. "కర్మణా పితృలోకో విద్యయా దేవలోక" ఇత్యాది శ్రుతేః.**

అను.వా॥నిత్యనైమిత్తికప్రాయశ్చిత్త ఉపసనాకర్మలవలన వాటికి చెందిన ప్రధానప్రయోజనాలే గాక అవాంతరఫలాలు గూడా సిద్ధిస్తాయి. "కర్మణా



పితృలోకో విద్యయా దేవలోకః" అనే శ్రుతివాక్యం వల్ల ఈ విషయం స్పష్టమౌతుంది. నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్తకర్మల వలన పితృలోకమూ, ఉపాసనాకర్మ (విద్య) వలన దేవలోకమూ పొందగల్గుతారు.

వి॥ నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్తకర్మల వలన 'బుద్ధి శుద్ధి' అనేది సిద్ధిస్తుంది. అది ప్రధానఫలము కాగా ఆనుషంగికంగా (దాంతోబాటుగ) కలిగే ఫలం పితృలోకప్రాప్తి. అదే విధంగా ఉపాసనాకర్మయొక్క ప్రధానఫలం మనస్సుకు ఏకాగ్రత చేకూరడం. ఆనుషంగికఫలం దేవలోకప్రాప్తి.

నిత్యనైమిత్తికాదులను గూర్చి వివరించిన తరువాత మోక్షసాధనాలను గూర్తి వివరిస్తున్నాడు.

**మూ॥ సాధనాని నిత్యానిత్యవస్తువివేకేహాముత్రార్థఫలభోగవిరాగశమాది షట్కసమ్పత్తిముముక్షుత్వాని. నిత్యానిత్యవస్తువివేకస్తావద్ బ్రహ్మైవ నిత్యం వస్తు తతోఽన్యదఖిలమనిత్యమితి వివేచనమ్. ఐహికానాం స్రక్చన్దనవనితాదివిషయభోగానాం కర్మజన్యతయా అనిత్యత్వ–వదాముష్మికాణామప్యమృతాదివిషయభోగానామనిత్యతయా తేభ్యో నితరాం విరతిరిహాముత్రార్థఫలభోగవిరాగః, శమాదయస్తు శమదమోపరతితితిక్షాసమాధానశ్రద్ధాఖ్యాః శమస్తావచ్ఛ్రవణాది–వ్యతిరిక్తవిషయేభ్యో మనసో నిగ్రహః. దమో బాహ్యేన్ద్రియాణాం తద్వ్యతిరిక్తవిషయేభ్యో నివర్తనమ్. నివర్తితానామేతేషాం తద్వ్యతిరిక్త విషయేభ్య ఉపరమణముపరతిరథవా విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః తితిక్షా శీతోష్ణాదిద్వన్ద్వసహిష్ణుతా. నిగృహీతస్య మనసః శ్రవణాదేః తదనుగుణవిషయే చ సమాధిః సమాధానమ్. గురూపదిష్టవేదాన్తవాక్యేషు విశ్వాసః శ్రద్ధా. ముముక్షుత్వం మోక్షేచ్ఛా.**

అను.వా॥ నిత్యానిత్యవస్తువివేకము, ఇహలోకానికీ పరలోకానికీ చెందిన ఫలాల్ని అనుభవించాలనే కోరిక లేకపోవటం, శమం మొదలైన ఆరింటిని సంపాదించటం, మోక్షం కావాలనే కోరిక ఉండటం – ఇవి మోక్షాన్ని

సాధించే సాధనాలు. తక్కినదంతా అనిత్యము అనే వివేచనము. ఏ విధంగానైతే కర్మజన్యమైన ఐహికసుఖాలు పూలమాలలు, చందనలేపాదులు, వనితాదులు మొదలైన భోగములు (సుఖాలు) అనిత్యములో అదే విధంగా పరలోకసుఖాలైన అమృతసేవనము మొదలైనవి కూడా అని తెలిసికొని ఐహికాముష్మికఫలాలపట్ల రాగం (ఆసక్తి) లేకపోవటం విరతి. అనగా విరాగము. శమాదులు అనగా శమ, దమ, ఉపరతి, తితిక్ష సమాధానము, శ్రద్ధ అనునవి. వీటిలో 'శమము' అనగా శ్రవణ, మనన, నిదిధ్యాసలుతప్ప మిగిలిన బాహ్యమైన విషయములవైపు వెళ్లకుండా మనసును నిగ్రహించటం. 'దమము' అనగా ఇంద్రియములను ఇంద్రియార్థములవైపు వెళ్లకుండా ఆపివేయటం. 'ఉపరతి' అనగా పైవిధంగా నిగ్రహించబడిన ఇంద్రియాల గమనాన్ని నిరోధించటం లేదా శాస్త్రములయందు చెప్పబడిన కర్మలను విధిపూర్వకంగా పరిత్యజించటం, అనగా సన్న్యసించటం. 'తితిక్ష' అనగా శీతోష్ణ, సుఖదుఃఖాదిద్వంద్వాలను సహించటం. సమాధానం అనగా నిగ్రహించబడిన మనస్సును శ్రవణాదులయందు ఆ శ్రవణాదులద్వారా గ్రహించే ఆచార్య బోధనాదివిషయములందు సరిగా నిలపడం. దీన్నే సమాధి అని అంటారు. 'శ్రద్ధ' అనగా ఆచార్యుడు బోధించిన వేదాంతవాక్యములందు విశ్వాసం, 'ముముక్షుత్వం' అనగా మోక్షం కావాలనే కోరిక.

**మూ॥ ఏవమ్భూతః ప్రమాతాధికారీ, 'శాన్తోదాన' ఇత్యాదిశ్రుతేః. ఉక్తం చ–**
**ప్రశాన్తచిత్తాయ జితేన్ద్రియాయ చ,**
**ప్రహీణదోషాయ యథోక్తకారిణే,**
**గుణాన్వితాయానుగతాయ సర్వదా**
**ప్రదేయమేతత్సతతం ముముక్షవే.** ఇతి

అను.వా॥ పైన చెప్పబడిన గుణాలను కలిగి ఉన్న ప్రమాత (తెలుసుకొనువాడు) వేదాంతశాస్త్రాన్ని అధ్యయనం చేయటానికి అధికారి (అర్హుడు). ఈ



విషయాన్నే "శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః సమాహితో భూత్వాఽఽ త్మన్యేవాత్మానం పశ్యతి" అనే వేదవాక్యం తెలియజేస్తుంది. అదీగాక, "ప్రశాంతచిత్తుడూ, జితేంద్రియుడూ, దోషాన్ని పోగొట్టుకున్నవాడు, గురువు మరియు శాస్త్రం చెప్పినట్లుగా ఆచరించేవాడూ, ఆత్మజ్ఞానాన్ని పొందడానికి అవసరమైన గుణాలు ఉన్నవాడూ, సదా ఆచార్యుని వెంటనంటి ఉండేవాడు, మోక్షాన్ని కోరేవాడూ అయినవానికి ఈ వేదాంతశాస్త్రాన్ని అందించాలి.

అధికారిలక్షణాలను చెప్పిన తరువాత ప్రతిపాద్యవిషయాన్ని గూర్చి యిలా చెపుతున్నాడు.

**మూ॥ విషయో జీవబ్రహ్మైక్యం శుద్ధచైతన్యం ప్రమేయం; తత్రైవ వేదాన్తానాం తాత్పర్యాత్.**

అను.వా॥ ఈ గ్రంథంలో ప్రతిపాదించబోయే విషయము జీవబ్రహ్మల ఏకత్వమూ, శుద్ధచైతన్యస్వరూపమూ తెలుసుకోవడం. ఈ జీవబ్రహ్మైక్యాన్నీ, (బ్రహ్మస్వరూపమైన) శుద్ధచైతన్యాన్నీ తెలియజేయడమే వేదాంత గ్రంథాల తాత్పర్యము.

**మూ॥ సమ్బన్ధస్తు తదైక్యప్రమేయస్య తత్ప్రతిపాదకోపనిషత్ప్రమాణస్య చ బోధ్యభోధకభావః.**

అను.వా॥ ప్రమేయమైన (తెలుసుకోవాల్సిన) జీవబ్రహ్మల ఏకత్వానికీ, తెలియజేసే ఉపనిషద్రూపప్రమాణానికే బోధ్యబోధక భావసంబంధం.

విషయము జీవబ్రహ్మల ఏకత్వంకాగా దాన్ని ప్రతిపాదించడానికి ఉపనిషత్తులు ప్రమాణంగా చూపబడుతున్నాయి. కాబట్టి యీ రెండింటికీ సంబంధం ఉంది.

వి॥ అనుబంధచతుష్టయంలో మూడవదైన 'సంబంధాన్ని' గూర్చి చెపుతున్నాడు. తాను రచించదలచిన 'వేదాంతసార' మనే గ్రంథానికీ, దానిలో

ప్రతిపాదించబోయే విషయానికీ గల సంబంధం బోధ్యబోధకభావసంబంధము. శాస్త్రము (గ్రంథము) బోధించేదీ విషయము బోధించబడేది. ఈ గ్రంథంలో జీవాత్మపరబ్రహ్మల 'ఏకత్వనిరూపణం విషయం. ఉపనిషద్వాక్యాలద్వారా ఈ జీవబ్రహ్మైక్యం ప్రతిపాదించబడుతుంది. కాబట్టి ఉపనిషత్తుల విషయబోధనలో ప్రమాణాలు.

**మూ॥ ప్రయోజనం తు తదైక్యప్రమేయగతా జ్ఞాననివృత్తిః స్వస్వరూపానన్దావాప్తిశ్చ "తరతి శోకమాత్మవిత్" ఇత్యాదిశ్రుతేః. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" ఇత్యాదిశ్రుతేశ్చ.**

అను.వా॥ జీవబ్రహ్మల ఏకత్వవిషయంలో గల అజ్ఞానం తొలగిపోవటం, 'స్వస్వరూపమైన ఆనందప్రాప్తి' ఇదే ప్రయోజనము. 'ఆత్మను తెలుసుకున్నవాడు శోకమును తరించగలడు' అనే శ్రుతివాక్యమూ, 'బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మయే అవుతాడు' అనే శ్రుతివాక్యమూ ఈ విషయాన్నే తెలియజేస్తున్నాయి.

వి॥ 'యమర్థమధికృత్య ప్రవర్తతే తత్ప్రయోజనమ్' – ఏదైతే ఒక వస్తువును లక్ష్యంగా చేసికొని దాన్ని పొందటానికై ప్రవర్తిస్తుందో అదే ' ప్రయోజనము' ఈ శాస్త్రంలో ప్రతిపాదించబడేది జీవబ్రహ్మల ఐక్యము. దానికొరకై మొదట 'జీవబ్రహ్మల ఐక్యవిషయం'లోగల అజ్ఞానం తొలగిపోవాలి. తరువాత ఆనంద స్వరూపమైన ఆత్మను తెలుసుకోవటం జరుగుతుంది.

ఆత్మస్వరూపాన్ని తెలుసుకున్నవాడు 'భూమ' (దీన్ని గూర్చి ముందు ముందు చెప్పబడుతుంది) అనబడే బ్రహ్మయే ఆత్మస్వరూపం అని తెలుసుకుంటాడు. అలా తెలిసినవెంటనే శోకమయమైన సంసారమును గూర్చిన అజ్ఞానం తొలగిపోయి శోకాన్ని తరించగలుగుతాడు. బ్రహ్మయొక్క తత్త్వాన్ని తెలుసుకున్నవాడు బ్రహ్మయే అవుతాడు.

**మూ॥ అయమధికారీ జననమరణాదిసంసారానలసన్తప్తో ప్రదీప్తశిరాజలరాశిమివోపహారపాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం**



**గురుముపసృత్య తమనుసరతి "సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" ఇత్యాదిశ్రుతేః స పరమకృపయాధ్యారోపాపవాదన్యాయేనైనముపదిశతి తస్మై స విద్వానుపపన్నాయ ప్రాహ" ఇత్యాదిశ్రుతేః.**

అను.వా॥ ఇంతకు మునుపు చెప్పిన లక్షణాలు కలిగి అధికారి సంసారమనే అగ్నిచేత దహించబడినవాడై, తలపైన అగ్నిజ్వాలలు రేగినవాడు జలరాశివద్దకు పరుగెత్తినట్లుగా, ఉపహారము (గురువువద్దకు రిక్తహస్తాలతో వెళ్ళరాదు కనుక ఏదో ఒక పత్రమో, పుష్పమో కానుకగా) చేతబూని వేదవేత్త, బ్రహ్మయందే మనసును నిలిపిన గురువుసన్నిధిని చేరి అతని ఆజ్ఞానువర్తియై ప్రవర్తిస్తాడు. "సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" మొదలైన శ్రుతివాక్యాలు ఈ విషయాన్నే చెపుతున్నాయి. అలా తనవద్దకు వచ్చిన శిష్యునికి గురువు అత్యంత కృపతో అధ్యారోప, అపవాదపద్ధతిని అనుసరించి బ్రహ్మతత్త్వాన్ని బోధిస్తాడు. "తస్మై స విద్వానుపపన్నాయ ప్రాహ" (తనవద్దకు చేరిన అతనికి ఆ విద్వాంసుడు (ఆచార్యుడు) చెప్పాడు) అనే శ్రుతివాక్యం ఈ విషయాన్నే చెపుతూన్నది.

వి॥ జనన, మరణాదిక్లేశాలచేత యీ సంసారమనెడి అగ్నిలో దహించుకుపోతూ, దానినుండి ముక్తికావాలని కోరేవాడు వేదాంతశాస్త్రమును అధ్యయనం చేయటానికి వేదవేత్త, బ్రహ్మజ్ఞాని అయిన గురువు వద్దకు వెళతాడు ఆచార్యుని వద్దకు వట్టి చేతులతో వెళ్ళరాదని శాస్త్రం చెప్తూంది.[1] అందుచేత ఏదో ఒక కానుకను తీసుకొని గురువును సమీపించి మోక్షమార్గముపదేశించమని శిష్యుడుకోరతాడు. సంసారాగ్నిలో దహించుకు పోతూన్న శిష్యునిపట్ల దయతో[2] ఆచార్యుడు బ్రహ్మతత్త్వాన్ని తెలియజేస్తాడు. దానికి గాను అతడు మొదట అధ్యారోప, అపవాదపద్ధతిని అవలంబిస్తాడు. అవి ఏమిటో క్రింద వివరిస్తున్నాడు.

---

1. రిక్తపాణిర్న సేవేత రాజానం దేవతాం గురుమ్.
2. "ఏతదేవ హి దయాళులక్షణం యద్వినేయజనబుద్ధివర్ధనమ్". శిష్యుని బుద్ధిని వికసింపజేయటమే కృపాళువైన ఆచార్యుని లక్షణము. ('సంక్షేపశరీరిక–4–3–6).

**మూ॥ అసర్పభూతాయాం రజ్జౌ సర్పారోపవద్వస్తున్యవస్త్వారోపోఽధ్యారోపః, వస్తుసచ్చిదానన్దానన్తాద్వయం బ్రహ్మ. అజ్ఞానాది సకలజడసమూహోఽవస్తు. అజ్ఞానం తు సదసద్భ్యామనిర్వచనీయం త్రిగుణాత్మకం జ్ఞానవిరోధిభావరూపం యత్కిఞ్చిదితి వదన్త్యహమజ్ఞ ఇత్యాద్యనుభవాత్ "దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్" ఇత్యాది శ్రుతేశ్చ.**

అను.వా॥ సర్పముకాని రజ్జువు (త్రాడు) నందు దానిని ఆరోపించినట్లు, ఒక వస్తువునందు మరొకవస్తువు (నిజానికి వస్తువుకానిది)ను ఆరోపించటం, 'అధ్యారోపము'. వస్తువు సచ్చిదానందమూ, అనంతమూ, అద్వయమూ అయిన బ్రహ్మ. దానియందు ఆరోపించబడే అ వస్తువు (బ్రహ్మభిన్నమైనది) అజ్ఞానము మొదలైన సమస్తజడసమూహము. అజ్ఞానాన్ని గూర్చి అది సత్ అని గాని అసత్ అనిగాని చెప్పలేని అనిర్వచనీయమైనదీ, సత్త్వ, రజస్, తమస్సులనెడి మూడు గుణములతో కూడుకొనినదీ, జ్ఞానమునకు విరోధి అయిన ఏదో ఒక భావరూపము అని (విద్వాంసులు) చెప్పారు. 'అహం అజ్ఞః' (నేను అజ్ఞానిని) అనే అనుభవమూ, "దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్" అనే శ్రుతివాక్యమూ యీ విషయాన్నే తెలియజేసున్నాయి.

వి॥ 'వస్తువు' అనగా యథార్థంగా ఉన్నది. ఉదాహరణకు 'త్రాడు' వస్తువు. దానిపై కనబడిన పాము ఆ వస్తువు. ఇలా ఒక వస్తువునందు ఆ వస్తువును (అది కానిదాన్ని) అరోపించటం అధ్యారోపం. త్రాడును చూసి పాము అని భ్రాంతి చెందినపుడు త్రాడుపై పామును అరోపించినట్లు సచ్చిదానందరూపమైన, అనంతమైన, ఏకరూపమైన బ్రహ్మయందు అజ్ఞానంతో సహా సమస్త జ్ఞానసమూహాన్ని ఆరోపించటం ఆధ్యారోపం.

సత్, చిత్, ఆనందము బ్రహ్మయొక్క స్వరూపం.

బ్రహ్మసత్= బ్రహ్మ ఉంది, (అది) చిత్= చైతన్యరూపం, ఆనందం= ఆనందరూపం, అనంతం= అంతములేనిది, అద్వయము= రెండవది లేనిది.



సత్త్వరజస్తమోగుణాత్మకమైనది అజ్ఞానం. అజ్ఞానమనెడి యీ పదార్థం జ్ఞానానికి విరుద్ధం. ఇటాంటిది బ్రహ్మయందు ఆరోపించబడుతున్నది. అజ్ఞానం 'సత్' (ఉంది) అనిగాని, అసత్ (లేదు) అనిగాని చెప్పలేని అనిర్వచనీయమైనది.

రజ్జువునందు సర్పారోపం విషయంలో కంటికి కన్పించే సర్పం కూడా పోతుంది. కాబట్టి అలా అని పూర్తిగా అది 'అసత్తు' (లేనే లేదు) అనడానికీ వీలులేదు. ఎందుచేతనంటే 'సర్పభ్రాంత' భయ, కంపాలకు కారణమౌతుంది. భ్రాంతికాలంలో అది అక్కడ ఉన్నట్లే. ఇదే విధంగా ఈ జగత్తుకూడా భ్రాంతికాలంలో బ్రహ్మజ్ఞానానికి ముందు ఎలా సత్యమో, తరువాతి కాలంలో ఎలా మిథ్యయో అద్వైతవేదాంతం చక్కగా తెలియజేస్తుంది. ఇలా సత్యంగా కన్పించే 'రజ్జుసర్పత్వం' ప్రాతిభాసికసత్తకూ, 'రజ్జు' యొక్క యథార్థతత్త్వం వ్యావహారికసత్తకూ ఉదాహరణాలు.

ఈ విధంగా వస్తువునందు (త్రాటియందు) అదికాని అవస్తువైన సర్పాన్ని చూడటం అధ్యారోపం అనబడుతుంది. ఈ విధంగా వస్తువును తద్భిన్నమైన రూపంలో చూడటమే భ్రమ లేదా విపర్యయం లేదా అధ్యాస అనబడుతుంది. ఈ సందర్భంలో రజ్జువునందు కన్పించే సర్పత్వం అన్విరచనీయమని వేదాంత శాస్త్రం చెపుతూంది. ఎందుచేత నంటే రజ్జువునందు సర్పం లేదు. అంటే ఉన్నట్లు కనపడుతూంది. కాబట్టి కన్పిస్తూన్నంతసేపూ 'సర్పం' సత్. అయితే భ్రాంతి తొలగిన వెంటనే అక్కడ సర్పం లేదని తెలుస్తూంది. కాబట్టి అది అసత్తు. ఇలా ఉందనీగానీ, లేదనిగానీ చెప్పలేని స్థితియే అనిర్వచనీయత. ఈ ఉదాహరణ ఆధారంగానే యీ ప్రపంచం యొక్క మిథ్యాత్వం, బ్రహ్మయొక్క 'సత్యత్వం' ప్రతిపాదించింది వేదాంతశాస్త్రం.

వేదాంతుల మతానుసారం 'అజ్ఞానం' ఒక భావరూపమైన పదార్థము. అది ఉంది అనిగానీ, లేదు అని గానీ చెప్పడం కుదరదు. అది సత్త్వరజస్తమో గుణాలతో కూడుకొనినది. జ్ఞానానికి విరోధి. జ్ఞానం కలుగగానే అజ్ఞానం తొలగిపోతుంది. అజ్ఞానం 'ఎలా ఉంటుంది?' అంటే 'ఇలా ఉంటుంది' అని

చెప్పడం కుదరదు. అయితే 'అజ్ఞానం' అనేది ఒకటుందని 'అహం అజ్ఞః' 'నేను అజ్ఞానిని' అనే అనుభవం వల్ల తెలుస్తూంది.

అజ్ఞానాన్ని 'సత్తు' అని చెప్పటం కుదరదు. భూత, వర్తమానభవిష్యత్ కాలాలు మూడింటిలోనూ, దేశకాలాదులపరిమితిలోను గాకుండా (అపరిచ్ఛిన్నంగా) ఉండేది మాత్రమే 'సత్తు'. అజ్ఞానం అలా కాదు.

పోనీ 'అజ్ఞానాన్ని' 'అసత్తు' అనవచ్చునా అంటే అదీ కుదరదు. ఏ కాలంలోనూ, ఏ దేశంలోనూ లేనిదాన్ని మాత్రమే 'అసత్తు' అంటారు. ఉదాహరణకు కుందేటికొమ్ము, గగనకుసుమం ఇత్యాదులు. 'అజ్ఞానం' దేశ, కాలాలతో సంబంధం కలిగి ఉంటుంది. ఒక వ్యక్తిలో వస్తువుయొక్క యథార్థజ్ఞానం కలిగేవరకూ అది ఉండనే ఉంటుంది. భ్రమకు కారణం కూడా అవుతుంది. అందుచేత 'అసత్తు' అని చెప్పటానికి వీలులేదు. కాబట్టి అది అనిర్వచనీయమైనది.

ఈ అజ్ఞానం సత్త్వరజస్తమోగుణాలతో కూడుకొని ప్రపంచంలోని ఒకవ్యక్తి సుఖానికీ, క్రియాశీలత్వానికీ, మోహానికీ కారణమౌతుంది. వస్తువుయొక్క యథార్థజ్ఞానానికి ఆటంకంగా నిలుస్తుంది. కాబట్టి 'అజ్ఞానం' జ్ఞానవిరోధి అని చెప్పబడింది.

ఇలా లోకవ్యవహారానికి కారణమైన అజ్ఞానం తొలగిపోయి సత్, చిత్, ఆనందమైన పరబ్రహ్మను తెలుసుకోవటమే మోక్షం. అతిగహనమైన యీ తత్త్వాన్ని శిష్యునికి సులభంగా అర్థం అయ్యేట్లు చెప్పటానికి ఆచార్యుడు 'రజ్జుసర్పభ్రాంతి', 'శుక్తిరజతం' లాంటి ఉదాహరణలను చూపించి వివరిస్తాడు.

**మూ॥ ఇదమజ్ఞానం సమష్టివ్యష్ట్యభిప్రాయేణైకమనేకమితి చ వ్యవహ్రియతే. తథాహి యథా వృక్షాణాం సమష్ట్యభిప్రాయేణ వనమిత్యేకత్వవ్యపదేశో యథా వా జలానాం సమష్ట్యభిప్రాయేణ జలాశయ ఇతి తథా నానాత్వేన ప్రతిభాసమానానాం జీవగతాజ్ఞానానాం సమష్ట్యభిప్రాయేణ తదేకత్వవ్యపదేశః "అజామేకామ్" ఇత్యాది శ్రుతేః.**



అను.వా॥ఈ అజ్ఞానాన్ని ఒక్కటిగా గ్రహించినప్పుడు 'సమష్టి' అని, అనేక రూపాలలో గ్రహించినప్పుడు వ్యష్టి అని చెప్పబడుతూంది. వృక్షాలన్నింటి సమూదాయాన్ని చెప్పాల్సివచ్చినప్పుడు 'వనం' అంటారు. అలాగే ఎన్నో జలాల ఏకరూపమే జలాశయం. అదే విధంగా అనేకంగా కనబడే జీవుల అజ్ఞానాలన్నింటినీ ఒక సముదాయంగా గ్రహిస్తే అది ఒకే అజ్ఞానంగా చెప్పబడుతూంది. దీనికి ప్రమాణం "అజామేకాం లోహితకృష్ణశుక్లామ్" అనే శ్రుతివాక్యం. 'ఎఱుపు నలుపు తెలుపులతో కూడిన ఒకానొక పదార్థం', అది పుట్టుక లేనిది అని దీని అర్థం. ఇందులో చెప్పబడిన ఎరుపు ఇత్యాదులే సత్త్వరజస్తమోగుణాలకు సంకేతాలు. తెలుపు సత్త్వగుణానికి, ఎరుపు రజోగుణానికి, నలుపు తమోగుణానికి సంకేతం.

వి॥ వృక్షాలు అనేకంగా కనబడినా అవన్నీ వనంలోని అంతర్భాగాలే. అదే విధంగా జలాలన్నీ ఒకచోట కలిసి జలాశయంగా వ్యవహరించబడతాయి. అలాగే వేరువేరుగా కనబడే జీవులలో ఉన్న అజ్ఞానాలన్నీ కలసి గ్రహించినపుడు అది ఒక్కటి అవుతుంది. కాబట్టి 'సచ్చిదానంద బ్రహ్మ'ను తెలుసుకోవటానికి వీలులేకుండా ఆటంకంగా నిలిచే అజ్ఞానం ఒక్కటే అయినా అది తనకు ఆశ్రయంగా ఉన్న 'జీవులను' బట్టి అనేకంగా చెప్పబడుతూంది.

ఇప్పుడు యీ సమష్టి, వ్యష్టి అజ్ఞానస్వరూపాలను వివరిస్తున్నాడు.

**మూ॥ ఇయం సమష్టిరుత్కృష్టోపాధితయా విశుద్ధసత్త్వప్రధానా ఏ తదుపహితం చైతన్యం సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వనియంతృత్వాది గుణకమవ్యక్తమన్తర్యామీ జగత్కారణమీశ్వర ఇతి చ వ్యపదిశ్యతే సకలాజ్ఞానావభాసకత్వాత్. "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇతి శ్రుతేః.**

అను.వా॥ఈ సమష్టి అజ్ఞానం 'చైతన్యాన్ని' కప్పివేసే ఉత్కృష్టమైన ఉపాధి. తీది సత్త్వ ప్రధానమైనది (రజస్తమోగుణాలు నామమాత్రానికి ఉంటాయి).

ఈ ఉత్కృష్ట ఉపాధిచేత ఉపహితమైన (సంబంధించిన) చైతన్యమే సర్వజ్ఞత్వాన్ని, సర్వేశ్వరత్వాన్ని, సర్వనియామకత్వాన్ని కలిగిఉండి అవ్యక్తమనీ, అంతర్యామియనీ, జగత్కారణుడనీ, ఈశ్వరుడనీ చెప్పబడుతుంది. ఇది సకలమైన అజ్ఞానాన్నీ భాసింపజేస్తుంది. “ఎవరు సర్వజ్ఞుడో, ఎవరు సర్వవేత్తయో” అని శ్రుతివాక్యం. ఈ సమష్టి అజ్ఞానంచేత ఉపహితమైన చైతన్యాన్ని గూర్చే చెపుతూంది.

వి॥ సర్వజ్ఞమూ, సర్వశక్తమూ, జగత్కారణమూ అయిన చైతన్య స్వరూపాన్ని ఆవరించి ఉన్నది అజ్ఞానమే. అయితే ‘సర్వజ్ఞ’ చైతన్యంతో సంబంధించినది కనుక ఇది ఉత్కృష్టత్వాన్ని (జీవగత అజ్ఞానం కంటే ఉత్తమ స్థాయిని) పొందింది. వేదాంతుల మతంప్రకారం కారణరూపుడైన ఈశ్వరుడూ, కార్యమైన జగత్తూ అన్నీ వ్యావహారికసత్యాలే. పారమార్థికసత్యం (అసలైన సత్పదార్థం) శుద్ధమైన సచ్చిదానందబ్రహ్మ ఒక్కటే. అనగా నిర్గుణబ్రహ్మయే పరమార్థ సత్యం.

ఇపుడు యీ సమష్టియొక్క స్వరూపాన్ని వివరిస్తున్నాడు.

**మూ॥ ఈశ్వరస్యేయం సమష్టిరఖిలకారణత్వాత్కారణశరీరమానన్ద ప్రచురత్వాత్కోశవదాచ్ఛాదకత్వాచ్చానన్దమయఃకోశః సర్వోపరమత్వాత్సుషుప్తిరత ఏవ స్థూలసూక్ష్మప్రపఞ్చలయస్థానమితి చోచ్యతే.**

అను.వా॥ ఈశ్వరుని ఉపాధిరూపమైన ఈ సమష్టిఅజ్ఞానం అన్నింటికీ కారణమవటంచేత కారణశరీరం అనబడుతుంది. ఇది ఆనందాతిశయంతో కూడినదీ, కోశమువలె ఆచ్ఛాదించేది (బ్రహ్మస్వరూపాన్ని) అవటంచేత ‘ఆనందమయకోశమ’నీ, అన్నింటికీ విశ్రాంతిస్థానం అవటంచేత ‘సుషుప్తి’ అనీ చెప్పబడుతుంది. అందుచేతనే ఈ ఉపాధి స్థూలప్రపంచానికీ, సూక్ష్మప్రపంచానికీ కూడా లయస్థానం. అనగా స్థూల, సూక్ష్మ ప్రపంచాలు రెండూ దీనియందే లయమౌతాయి.



వి॥ శుద్ధచైతన్యమైన బ్రహ్మఒక్కటే సత్యము. తక్కినదంతా అజ్ఞాన కల్పితము. చివరికి సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వనియంత, అంతర్యామి, జగత్తుకు మూలం అని చెప్పబడే ఈశ్వరుడు కూడా అజ్ఞానకల్పితుడే. సమష్టి అజ్ఞానంచేత ఆవరించబడిన శుద్ధచైతన్యమే ఈశ్వరుడు. ఈ తత్త్వంలో సత్త్వగుణం ఉత్కృష్టంగా ఉంటుంది. రజస్తమోగుణాలు అణిగి ఉంటాయి. అందుచేతనే దీనిలో ఆనందమధికంగా ఉంటుంది. ఇది ‘కత్తిని’ ఆవరించే కోశంలాగా పరబ్రహ్మను కప్పివేస్తుంది. అన్ని కార్యాలూ ఇందులోనే విరమిస్తాయి. సత్త్వగుణం ఉత్కృష్టంగా ఉంటుంది. రజస్తమోగుణాలు అణిగి ఉంటాయి. అందుచేతనే దీనిలో ఆనందం అధికంగా ఉంటుంది. ఇది ‘కత్తిని’ ఆవరించే కోశంలాగా పరబ్రహ్మను కప్పివేస్తుంది. అన్ని కార్యాలూ ఇందులోనే విరమిస్తాయి. కాబట్టి దీన్ని ‘సుషుప్తి’ అన్నారు. స్థూల, సూక్ష్మప్రపంచాలకు ఇది లయస్థానము.

(స్థూల, సూక్ష్మప్రపంచాలను గూర్చి ముందుముందు చర్చించబడుతుంది.)

**మూ॥ యథా వనస్య వ్యష్ట్యభిప్రాయేణ వృక్షా ఇత్యనేకత్వవ్యపదేశో యథా వా జలాశయస్య వ్యష్ట్యభిప్రాయేణ జలానీతి తథాఽజ్ఞానస్య వ్యష్ట్యభిప్రాయేణ తదనేకత్వవ్యపదేశః, “ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయత” ఇత్యాదిశ్రుతేః. అత్ర వ్యస్తసమస్తవ్యాపిత్వేన వ్యష్టిసమష్టితా వ్యపదేశః.**

అను.వా॥ ఏ విధంగానైతే వనాన్ని గూర్చి వ్యష్టిగా చెప్పాల్సివచ్చినపుడు వృక్షములు అని అనేకవృక్షములుగా చెపుతారో, జలాశయం యొక్క వ్యష్టిరూపాన్ని చెప్పాల్సినపుడు ‘నీళ్లు’ అని ఎలా అనేకరూపాలుగా చెపుతారో అదేవిధంగా అజ్ఞానం యొక్క వ్యష్టిరూపం అనేకమైన అజ్ఞానాలు అని చెపుతారు. “ఇంద్రుడు (పరబ్రహ్మ) అనేకమైన మాయ (అజ్ఞానము)లతో కూడినవాడై అనేకరూపాలు పొందాడు” అనే శ్రుతివాక్యం ఈ విషయాన్నే చెపుతూంది. విడివిడిగా ఉన్నవాటిని వ్యాపించిన దానిని వ్యష్టి అనీ, అన్నింటినీ కలిపి వ్యాపించిన దానిని సమష్టి అని చెప్పడం జరుగుతూన్నది.

వి॥ వృక్షాలన్నిటినీ ఒక సమూహంగా గ్రహిస్తే 'వనం' అంటాం. విడిగా చెప్పాల్సివచ్చినపుడు 'వృక్షాలు' అంటాం. అలాగే 'జలాశయం' అని జలసముదాయాన్ని చెబితే 'నీళ్లు' అని విడిగా వ్యవహరిస్తాం. ఉదాహరణకు 'తోటనుండి పళ్లు తీసికొనిరా' అంటే 'సమష్టి' వ్యవహారం. 'చెట్టునుండి పళ్లు తీసుకురా' అంటే 'వృష్టి' వ్యవహారం. అదే విధంగా చెఱువులోని నీళ్లు ఎండిపోతే చెఱువు ఎండిపోయింది. అంటే 'సమష్టి' చెఱువులో 'నీళ్లు' ఎండిపోయాయి అంటే 'వృష్టి'.

'ఇంద్రుడు మాయలతో కూడినవాడై అనేక రూపాలు కలవాడుగా అయినాడు' అని శ్రుతివాక్యం చెప్తుంది (వేదాల్లో 'ఇంద్ర' పదానికి 'పరబ్రహ్మ' అనే అర్థం కూడా ఉంది). మాయలతో కూడిన ఆ 'ఇంద్రరూపం' అనేక విధాలుగా రూపొందింది. బ్రహ్మ ఒక్కటేనని, మాయలు, అనగా అజ్ఞానాలు, అనేకం అనీ ఈ వాక్యం వల్ల తెలుస్తుంది.

వృష్టియొక్క తత్త్వాన్ని తెలియజేస్తున్నాడు.

**మూ॥ ఇయం వ్యష్టిర్నికృష్టోపాధితయా మలినసత్త్వ ప్రధానా, ఏతదుపహితం చైతన్యమల్పజ్ఞత్వానీశ్వరత్వాదిగుణకం ప్రాజ్ఞ ఇత్యుచ్యతే. ఏకాజ్ఞానావభాసకత్వాత్. అస్య ప్రాజ్ఞత్వమస్పష్టోపాధితయా నాతిప్రకాశకత్వాత్. అస్యాపీయమహఙ్కారాది కారణత్వాత్కారణ శరీరమానన్దప్రచురత్వాత్కోశవదాచ్ఛాదకత్వాచ్చానన్దమయకోశః సర్వోపరమత్వాత్సుషుప్తిరత ఏవ స్థూల సూక్ష్మశరీరప్రపఞ్చలయ స్థానమితి చోచ్యతే.**

అను.వా॥ఒక్కొక్క జీవుణ్ణి ఆవరించి ఉండే యీ వ్యస్తమైన అజ్ఞానరూపం (వృష్టి) నికృష్టమైన (అల్పమైన) ఉపాధికలిగి ఉండటంవల్ల మలినసత్త్వ ప్రధానమైనది. ఈ వృష్టి అజ్ఞానంచేత ఆవరించబడిన చైతన్యం అల్పజ్ఞత్వం, అనీశ్వరత్వం కలిగి ఉంటుంది. ఒక అజ్ఞానాన్ని మాత్రమే ప్రకాశింపజేయడం వల్ల 'ప్రాజ్ఞ అనే పదానికి ఇక్కడ ప్రాయేణ అజ్ఞః' (చాలవరకు అజ్ఞుడు) అని చెప్పుకోవాలి. ఇది ప్రాజ్ఞమని ఎందువలన చెప్పబడుచున్నదనగా దీని ఉపాధి అస్పష్టము గాన నిది ఎక్కువగా ప్రకాశింపజేయజాలదు. అయితే జీవునికి సంబంధించిన ఈ వృష్టి (వృష్టిగా గ్రహింపబడిన అజ్ఞానం) వీని అహంకారాదులకు కారణమవటంచేత కారణశరీరమనీ, ఆనందం అధికంగా ఉండి, కోశంలాగా కప్పివేయటం చేత 'ఆనందమయకోశ'మనీ, అన్ని కార్యాలూ దీనిలో అణిగిఉండటం చేత 'సుషుప్తి' అనీ చెప్పబడుతుంది. అందుచేతనే ఇది స్థూలసూక్ష్మశరీర ప్రపంచానికి లయస్థానం అని కూడ చెప్పబడుతుంది.



వి॥ జీవుణ్ణి ఆవరించిన అజ్ఞానం నికృష్టోపాధి. రజస్తమోగుణాలచేత కప్పివేయబడిన సత్త్వగుణం యీ వృష్టి అజ్ఞానంలో ఉంటుంది. ఈ విధంగా సత్త్వంగుణం కంటె రజస్తమోగుణాలు అధిక్యంలో ఉండటంచేత యీ ఉపాధి మలినసత్త్వప్రధానమైనదిగా పరిగణించబడుతుంది. ఇలాంటి ఈ ఉపాధికి అస్పష్టత్వమూ, (అనగా స్పష్టంగా బ్రహ్మస్వరూపాన్ని తెలియజేయలేక పోవటం) అల్పప్రకాశకత్వమూ ఉంటాయి. అందుచేతనే యీ వృష్టి అజ్ఞానోపహితమైన జీవుడు 'ప్రాజ్ఞుడు' అనబడతాడు. ఇక్కడ 'ప్రాజ్ఞ' శబ్దానికి 'ప్రాయేణ అజ్ఞః' 'చాలావరకు అజ్ఞాని' అని అర్థం. ఈ జీవునికి కూడా ఈశ్వరుని కన్న తక్కువ స్థాయిలో కారణశరీరత్వాదులు ఉన్నాయి. అందుచేత ఈశ్వరుడు స్థూల, సూక్ష్మప్రపంచానికి లయస్థానమైతే ఈ జీవుడు స్థూలసూక్ష్మశరీరప్రపంచానికి లయస్థానం.

**మూ॥ తదానీమేతావీశ్వరప్రాజ్ఞౌ చైతన్యప్రదీప్తాభిరతిసూక్ష్మాభిరజ్ఞాన వృత్తిభిరానన్దమనుభవతః. "ఆనన్దభుక్ చేతోముఖః ప్రాజ్ఞ" ఇతి శ్రుతేః. ''సుఖమహమస్వాప్సం న కిఞ్చిదవేదిషమీ' త్యుత్థితస్య పరామర్శోపపత్తేశ్చ. అనయోః సమష్టివ్యష్ట్యోర్వనవృక్షయోరివ జలాశయజలయోరివ వాఽభేదః ఏతదుపహిత యోరీశ్వరప్రాజ్ఞా**

**యోరపి వనవృక్షావచ్ఛిన్నాకాశ యోరివజలాశయజలగత ప్రతిబింబాకాశయోరివ వా౽భేదః."ఏష సర్వేశ్వర" ఇత్యాది శ్రుతేః.**

అను.వా॥ఆ సుషుప్తి స్థితియందు ఈశ్వరుడు మరియు ప్రాజ్ఞుడు చైతన్యముచేత ఉద్దీపింపజేయబడిన అతిసూక్ష్మమైన అజ్ఞానవృత్తుల ద్వారా ఆనందాన్ని అనుభవిస్తారు. "ఆనన్దభుక్......" అని పైన ఉదాహరించిన శ్రుతివాక్యం ఈ విషయాన్నే తెలుపుతుంది. (చేతోముఖుడైన ప్రాజ్ఞుడు అజ్ఞానవృత్తి ప్రధానంగా కలవాడై ఆనందాన్ని అనుభవిస్తాడు). అందువల్లనే గాఢనిద్రనుండి మేల్కొన్న వ్యక్తి "హాయిగా సుఖంగా నిద్రించాను. ఏమీ తెలియలేదు" అని అనుకొంటాడు. (ఈ సమష్టివ్యష్టులకు భేదము లేదు). వనమువృక్షములవలె, జలాశయము–జలమువలె ఈ సమష్టివ్యష్టి కూడా అభిన్నములు. వీటిచేత ఆవరించబడిన ఈశ్వరప్రాజ్ఞులకు కూడా భేదము లేదు. వనావచ్ఛిన్నమూ, వృక్షావచ్ఛిన్నమూ అయిన ఆకాశం ఒకటే. జలాశయంలో ప్రతిబింబించే ఆకాశము ఒకటే. అలాంటిదే ఈశ్వర, ప్రాజ్ఞులతత్త్వం కూడా. "ఏష సర్వేశ్వరః" 'ఇతడు సర్వేశ్వరుడు' అనే శ్రుతివాక్యం ఈ విషయాన్నే చెప్తుంది.

**మూ॥ వనవృక్షతదవచ్ఛిన్నాకాశయోర్జలాశయజలతద్గతప్రతిబిమ్బాకాశయోర్వాధారభూతానుపహితాకాశవదనయోరజ్ఞానతదుపహిత చైతన్యయోరాధారభూతం యదనుపహితం చైతన్యం తత్తురీయమిత్యుచ్యతే "శివమద్వైతం చతుర్థం మన్యన్తే" ఇత్యాది శ్రుతేః, ఇదమేవ తురీయం శుద్ధచైతన్యమజ్ఞానాదితదుపహితచైతన్యాభ్యాం తప్తాయఃపిణ్డవదవివిక్తం సన్మహావాక్యస్య వాచ్యం వివిక్తం సల్లక్ష్యమితి చోచ్యతే.**

అను.వా॥వనావచ్ఛిన్నమైన (వనముచేత పరిమితమైన) ఆకాశానికీ, వృక్షముచేత అవిచ్ఛిన్నమైన ఆకాశానికీ, ఆధారభూతమైనది దేనిచేతా కప్పివేయబడని అఖండాకాశము. అదే విధంగా జలాశయంలో ప్రతిబింబించే ఆకాశానికీ, జలంలో ప్రతిబింబించే అకాశానికీ ఆధారం అనుపహితమైన ఆకాశమే. అలాగే సమష్టి అజ్ఞానముచేత ఆవరించబడిన ఈశ్వరచైతన్యాన్నే 'తురీయం' అంటారు. "శివమద్వైతం....." అనే శ్రుతివాక్యం ఈ విషయాన్ని చెప్తుంది. "ద్వైతరహితమైన సుఖరూపమైన చైతన్యాన్నే చతుర్థమని (తురీయమని) వేదాంతవేత్తలు చెప్పారు" అని దీనికర్థం. తురీయమని చెప్పబడే యీ శుద్ధచైతన్యం అజ్ఞానసమష్టితోను, తదుపహితచైతన్యంతోనూ, అజ్ఞానవ్యష్టితోనూ, తదుపహిత చైతన్యతోనూ తప్తాయఃపిండం (కాలిన ఇనుపగోళం) వలె అభిన్నమై 'తత్త్వమసి' అనే మహావాక్యంతో అభిన్నమై ఆ వాక్యం యొక్క వాచ్యార్థంగానూ, పైన చెప్పబడిన అజ్ఞానసమష్టి, తదుపహితచైతన్యాలకంటె, అజ్ఞానవ్యష్టి, తదుపహితచైతన్యాలకంటె భిన్నమై లక్ష్యంగానూ పరిగణించబడుతుంది.



వి॥ 'తత్త్వమసి' తత్, త్వం, అసి. ఆ బ్రహ్మపదార్థమే నీవు అనే అర్థాన్ని బోధించే యీ వాక్యం మహావాక్యం. 'అఖండబ్రహ్మ' తత్త్వాన్ని బోధించే వాక్యం ఇది. ఈ వాక్యంలో రెండుపదాలను ఏకవాక్యంతో అన్వయించి అర్థం చెప్పబడింది.

తత్ (అది – అనగా ప్రస్తుతం మన ఎదుటలేనిది)

త్వం (నీవు – ఎదుట ఉన్నవ్యక్తి)

అసి (అయి ఉన్నావు).

దేనియొక్క విశిష్టతత్త్వం చెప్పబడుతుందో ఆ 'తత్' అది 'త్వం అసి' నీనే అయి ఉన్నావు. అని 'తత్' యొక్క విశేషాన్ని (జగత్కారణత్వాదికాన్ని) వదలి ప్రస్తుతంతో సమన్వయించి చెప్పబడింది. ఇక్కడ 'తత్' అనగా అజ్ఞానసమష్టి మరియు తదుపహితచైతన్యం. 'త్వం' అనగా అజ్ఞానవ్యష్టి మరియు తదుపహిత చైతన్యం. ఈ రెండుపదాల్లోంచీ కేవలం 'చైతన్యాన్ని' మాత్రం గ్రహించి, లక్షణద్వారా అనుపహితమైన తురీయచైతన్యం చెప్పబడుతుంది. అందుచేత అది లక్ష్యంగా చెప్పబడింది.

వి॥ జీవుడు, ఈశ్వరుడు, అనుపహితమైన విశుద్ధబ్రహ్మచైతన్యం, అవిద్య, జీవునకు అవిద్యతో గల సంబంధం, ఈశ్వరునకు అవిద్యతో గల సంబంధం అనే యీ ఆరు వేదాంతుల మతానుసారం అనాదిగా ఉన్నవే. వీటిలో ముఖ్యమైన అంశాలు రెండు. వీటిని గూర్చే వేదాంతచర్చ కొనసాగుతుంది. అవి ఒకటి 'బ్రహ్మ'. రెండవది 'అవిద్య'. ఈ అవిద్యనే అజ్ఞానం అంటారు. ఈ 'అవిద్య' ఉంది అని గాని, 'లేదు' అనిగాని చెప్పశక్యం కానిది, అనిర్వచనీయం. ఇది సత్త్వరజస్తమోగుణాన్వితమైనది. సమష్టి, వ్యష్టి దీనిలోని రెండు భేదాలు. అజ్ఞానసమష్టిచేత ఆవరించబడిన చైతన్యమే 'ఈశ్వరుడు' అని వ్యవహరించబడుతూంది. ఇదే సర్వజ్ఞమనీ, సర్వేశ్వరుడనీ, సర్వనియంత అనీ, అంతర్యామి అనీ, జగత్కర్త అనీ భావింపబడుతుంది. అజ్ఞానవ్యష్టిచేత ఆవరించబడిన చైతన్యం జీవుడనీ పిలువబడుతుంది. ఇదే అల్పజ్ఞం, అనీశ్వరం, అనేకం అని భావించబడుతుంది.

బ్రహ్మయొక్క అధిదేవతస్వరూపం మూడు విధాలు అవి –

1. సూత్రాత్మ (హిరణ్యగర్భుడు).
2. విరాట్ (వైశ్వానరుడు)
3. ఈశ్వరుడు

ఈ విధంగా ఈశ్వరుడు బ్రహ్మయొక్క అధిదేవత రూపాల్లో ఒకటి.

బ్రహ్మయొక్క అధ్యాత్మరూపాలు కూడా మూడు. అవి – 1. తేజస, 2. విశ్వ, 3. జీవరూపాలు

ఈ విషయాలు ముందుముందు స్పష్టమౌతాయి.

మూ॥ **అస్యాజ్ఞానస్యావరణవిక్షేపనామకమస్తి శక్తిద్వయమ్. ఆవరణశక్తిస్తావద్ అల్పోఽపి మేఘోఽనేకయోజనాయతమాదిత్య మణ్డలమవలోకయితృనయనపథపిధాయకతయా యథాచ్ఛాదయతీవ తథా జ్ఞానం పరిచ్ఛిన్నమసంసారిణమవలోక యితృబుద్ధిపిధాయకతయాచ్ఛాదయతీవ తాదృశం సామర్థ్యమ్. తదుక్తమ్ –**



**ఘనచ్ఛన్నదృష్టిర్ఘనచ్ఛన్నమర్కం**
**యథా మన్య నిష్ప్రభం చాతిమూఢః।**
**తథా బద్ధవద్భాతి యో మూఢదృష్టేః**
**స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా"** ఇతి.

అను.వా॥ఆవరణశక్తి, విక్షేపశక్తి అని ఈ అజ్ఞానం యొక్క శక్తి రెండు విధాలు. వీటిలో ఆవరణశక్తి అనగా చిన్నమేఘశకలం (మబ్బుతునక) ఎలాగైతే దృష్టిపథానికి అడ్డుగా నిలిచి అనేక యోజనాలపర్యంతం విస్తరించి ఉన్న ఆదిత్యమండలాన్ని కప్పివేసినట్లు కన్పింపజేస్తుందో, అలాగే యీ అజ్ఞానం (ఆవరణశక్తి) అసంసారి (జీవుడుకానట్టి) ఆత్మను ఆవరించి చూచేవారికి ఆ ఆత్మస్వరూపం కనపడకుండా అడ్డుగా నిలుస్తుంది. ఈ సామర్థ్యమే ఆవరణశక్తి. అదే విషయాన్ని ఇలా చెప్పారు –

మేఘం అడ్డుగా ఉండటంవల్ల సూర్యుణ్ణి చూడలేని మూఢుడు ఏ విధంగానైతే సూర్యుడు కాంతిహీనుడు అనుకుంటాడో అదే విధంగా అజ్ఞానికి ఏ ఆత్మబంధంలో ఉన్నట్లు భాసిస్తుందో అట్టి నిత్యచైతన్య స్వరూపమైన ఆత్మయే నేను".

వి॥ బ్రహ్మ స్వప్రకాశమైన చైతన్యరూపం. అలాంటప్పుడు ఆ ప్రకాశం ఎలా కన్పించకుండా పోతుంది? బ్రహ్మ నిస్సంగుడూ, ఉదాసీనుడూ అయినపుడు జగత్సృష్టికి కారకుడు ఎలా అవుతాడు? అనేవి ప్రశ్నలు. ఈ ప్రశ్నలకి సమాధానంగా వేదాంతదర్శనం యిలా చెప్తూంది. అజ్ఞానానికి రెండు శక్తులున్నాయి. ఒకటి ఆవరణశక్తి. ఈ శక్తి వస్తువుయొక్క నిజరూపాన్ని ఆచ్ఛాదించి వేస్తుంది. రెండవది విక్షేపశక్తి. ఇది ఒక వస్తువు యొక్క వివిధమైన అవాస్తవ (అదికాని) రూపాల్ని కన్పింపచేస్తుంది. అనగా ఒకవస్తువును దానిరూపంలో కాకుండా అదికానట్టి అయాథార్థరూపాల్లో కన్పించేట్టు చేస్తుంది. ఈ రెండువిధాలశక్తితో కూడిన అజ్ఞానానికీ, సచ్చిదానందరూపమైన బ్రహ్మకూ గల సంబంధం 'అనాది'గా వస్తూన్నది. అజ్ఞానంయొక్క ఆవరణశక్తి బ్రహ్మయొక్క

'చిత్' ఆనందస్వరూపాన్ని కప్పివేస్తుంది. విక్షేపశక్తివలన సద్రూపమైన బ్రహ్మయందు జగత్తు కన్పిస్తుంది.

**మూ॥ అనయైవావరణశక్త్యావచ్ఛిన్నస్యాత్మనః కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖమోహాత్మకతుచ్ఛసంసారభావనాపి సంభావ్యతే యథా స్వాజ్ఞానేనావృతాయాం రజ్జ్వాం సర్పత్వసంభావనా. విక్షేపశక్తిస్తు యథా రజ్జ్వజ్ఞానం స్వావృతరజ్జౌ స్వశక్త్యా సర్పాదికముద్భావయత్యేవమజ్ఞానమపి స్వావృతాత్మని విక్షేపశక్త్యాఽఽకాశాది ప్రపఞ్చముద్భావయతి తాదృశం సామర్థ్యమ్, తదుక్తమ్ –**

**'విక్షేపశక్తిర్లిఙ్గాది బ్రహ్మాణ్డాన్తం జగత్సృజేత్'** ఇతి **10**

అను.వా॥ అజ్ఞానంచేత ఆవరించబడిన రజ్జువు (త్రాడు) నందు ఏ విధంగా సర్పత్వం (పాము స్వరూపం) భావించబడుతుందో అలాగే యీ ఆవరణశక్తిచేత ఆచ్ఛాదింపబడిన ఆత్మయందు దానికి చెందని కర్తృత్వ, భోక్తృత్వ, సుఖ, దుఃఖ, మోహములతో కూడిన మిథ్యా సంసారభావన కలుగుతుంది. విక్షేప శక్తికిగల సామర్థ్యం ఎలాంటి దంటే అజ్ఞానంచేత ఆవరించబడిన రజ్జువునందు అది 'సర్పము' అనే భావనను కలుగజేసినట్లుగా అజ్ఞానంచేత ఆవరించబడిన ఆత్మయందు ఆకాశాది ప్రపంచం ఉన్నట్లుగా భావింపజేస్తుంది. ఈ విషయమే "విక్షేపశక్తి లింగసూక్ష్మశరీరం మొదలు బ్రహ్మాండం వరకూ గల జగత్తును సృష్టిస్తుంది" అని శ్రుతివాక్యం ద్వారా చెప్పబడింది.

వి॥ ఇంతకు మునుపు చెప్పిన రెండు శక్తుల్లో అజ్ఞానం యొక్క ఆవరణశక్తి వస్తుతత్త్వాన్ని కప్పివేస్తుంది. ఇక విక్షేపశక్తి కప్పివేయబడిన ఆ వస్తువు మీద మిథ్యారూపాల్ని చూపిస్తుంది.

ఒక రజ్జువు (త్రాడు)లో రజ్జువును చూడకపోవటానికి కారణం అజ్ఞానం యొక్క ఆవరణశక్తి. దానియందు సర్పత్వం అనగా పాముయొక్క ధర్మాల్ని భావింపచేయటానికి కూడా యీ ఆవరణశక్తియే కారణం. విక్షేపశక్తి విషయం వచ్చేసరికి రజ్జువు లేనే లేదు. కప్పివేయబడిన రజ్జువునందు సర్పాన్ని చూపడం విక్షేపశక్తియొక్క పని.



| | | |
|---|---|---|
| రజ్జువు | సర్పం | (ఆవరణశక్తి) |
| సర్పం మాత్రమే | (విక్షేపశక్తి) | రజ్జువు |

అదే విధంగా ఆత్మస్వరూపం మొదట కప్పివేయబడి దానికి సుఖ దుఃఖాదిదర్మాలు అంటగట్టబడతాయి. తరువాతి దశలో ఆత్మ కన్పించదు. కేవలం ప్రపంచం, దాని ధర్మాలు మాత్రం కన్పిస్తాయి. అందుచేతనే విక్షేపశక్తి యొక్క సామర్థ్యం ఎంతటిదంటే ఆ శక్తివల్లనే లింగశరీరంనుండి బ్రహ్మాండ పర్యంతం సృష్టిజరుగుతుంది. అనగా ఏమీ లేనిదాన్ని అంతగా కన్పించేటట్లు చేస్తుంది.

**మూ॥ శక్తిద్వయవదజ్ఞానోపహితం చైతన్యం స్వప్రధానతయా నిమిత్తం స్వోపాధి ప్రధానతయోపాదానం చ భవతి. యథా తథా తన్తుకార్యం ప్రతి స్వప్రధానతయా నిమిత్తం స్వశరీరప్రధానతయోపాదానం చ భవతి.**

అను.వా॥ ఈ విధంగా శక్తి ద్వయంతో కూడుకొన్న అజ్ఞానంచేత కప్పివేయబడిన చైతన్యం తనయొక్క ప్రాధాన్యం వల్ల నిమిత్తకారణం తన యొక్క ఉపాధివలన ఉపాదానకారణం అవుతుంది. అది ఎలాగంటే 'లూత' అనగా సాలెపురుగు దాని నుండి వెలువడే తన్తువు (దారానికి) తానే నిమిత్తకారణమూ, ఉపాదానకారణమూ అయినట్లు 'సాలెపురుగు' యొక్క గూటిఅల్లికలో ప్రధానం సాలెపురుగు. అందుచేత అది నిమిత్తకారణం. అయితే 'దారం' వెలువడేది దానియొక్క శరీరం నుండి. అందుచేత అది ఉపాదానకారణం అవుతుంది.

నిమిత్తకారణానికీ ఉపాదానకారణానికీ ఒక భేదం ఉంది, ఉపాదాన కారణానికి కార్యంతో సన్నిహితసంబంధం ఉంటుంది. నిమిత్తకారణం బహిరంగంగా ఉంటుంది. ఉదాహరణకు 'ఘటం' అనే కార్యానికి 'మట్టి' ఉపాదానకారణం. కులాలుడు (కుమ్మరి) నిమిత్తకారణం.

వి॥ సాలెపురుగు తన గూటిని నిర్మించుకొనేందుకు ప్రత్తి, తురీ, వేమాదికంతో అవసరంలేదు. తానే తన శరీరంనుండి వెలువడే ఒకానొక తంతువుతో నిర్మించుకొంటుంది. అనగా గూటినిర్మాణానికి ముందు ఆ సాలెపురుగు ఏకం, అద్వితీయం. అదేవిధంగా సృష్టికి పూర్వం ఈశ్వరుడు కూడా అద్వితీయుడు, అసహాయుడు. తన మాయాశక్తిచేత యీ జగత్తును సృష్టిస్తాడు. ఈ విషయాన్ని ముండకోపనిషత్తులోని ఒక మంత్రం యిలా వివరిస్తుంది.

**యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ**
**యథా పృథివ్యామోషధయః సమ్భవన్తి,**
**యథా సతః పురుషాత్కేశలోమాని**
**తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్.** ***(1-1-7)***

ఏ విధంగానైతే తంతువులను నాభిందు కల్గిన సాలీడు తననుండి జాలాన్ని సృజించి, తిరిగి తనలోకే గ్రహిస్తుందో, ఏ విధంగానైతే పృథివి యందు ఓషధులు పుడతాయో, ఏ విధంగానైతే పురుషున్ని శరీరంలో కేశాలూ, రోమాలు ఉద్భవిస్తాయో అదే విధంగా అక్షరమైన బ్రహ్మనుండి యీ విశ్వం ఉద్భవిస్తుంది.

**మూ॥ తమః ప్రధానవిక్షేపశక్తిమదజ్ఞానోపహితచైతన్యాదాకాశ అకాశాద్వాయుర్వాయోరగ్నిరగ్నేరాపోఽద్భ్యః పృథివీ చోత్పద్యతే "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూత" ఇత్యాదిశ్రుతేః. తేషు జాడ్యాధిక్యదర్శనోత్తమః ప్రాధాన్యం తత్కారణస్య తదానీం సత్త్వరజస్తమాంసి కారణగుణప్రక్రమేణ తేఽష్వాకాశాదిషూత్పద్యన్తే. ఏతాన్యేవ సూక్ష్మభూతాని తన్మాత్రాణ్యపఞ్చీకృతాని చోచ్యన్తే. ఏతేభ్యః సూక్ష్మశరీరాణి స్థూలభూతాని చోత్పద్యన్తే. 12**

అను.వా॥ తమోగుణం అధికంగా కల్గిన, విక్షేపశక్తితో కూడిన అజ్ఞానంచేత ఆవరించబడిన చైతన్యం నుండి ఆకాశం, ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటి నుండి పృథివి (భూమి)



ఉత్పన్నమవుతాయి. చైతన్యంనుండి ఆకాశం ఉద్భవించింది" అనే శ్రుతివాక్యం చెప్తుంది. వీటియందు జాడ్యము (జడత్వము) అధికంగా కన్పించటంచేత వాటి ఉత్పత్తికి కారణమైన దానిలో తమోగుణప్రాధాన్యం ఉందని తెలుస్తుంది. ఈ ఉత్పత్తి సమయంలో కారణగుణక్రమాన్ని అనుసరించి ఆకాశాదులలో సత్త్వ, రజ స్తమోగుణాలు ఉత్పన్నమౌతాయి. వీటినే సూక్ష్మభూతాలు, తన్మాత్రలు, అపంచీకృతాలు అని అంటారు. వీటినుండి సూక్ష్మశరీరాలు, స్థూలభూతాలు ఉద్భవిస్తాయి.

వి॥ చైతన్యం జగత్కారణం. అయితే సృష్టిక్రమం ఎలాంటిది అనేది ఇక్కడ వివరించబడింది. అజ్ఞానం సత్త్వ, రజ, స్తమోగుణాలతో కూడినది. విక్షేపశక్తిగల యీ అజ్ఞానంతో తమోగుణం ప్రబలంగా ఉన్నపుడు, ఇలాంటి విక్షేపశక్తిసహిత అజ్ఞానంతో ఆవరించబడిన చైతన్యంనుండి ఆకాశం పుడుతుంది. తరువాత క్రమంగా ఆకాశంనుండి వాయువు ఇత్యాది క్రమంలో ఉత్పత్తి జరుగుతుంది.

విక్షేపశక్తియుతఅజ్ఞానోపహితచైతన్యం
|
ఆకాశం
|
వాయువు
|
అగ్ని
|
ఆపః (నీరు)
|
పృథివి (భూమి)

ఈ ఐదూ సూక్ష్మభూతాలు అనబడతాయి. వీటి నుండి జరిగే సృష్టిక్రమం ముందుముందు వివరించబడుతుంది. 'తన్మాత్రం' అనగా 'ఆదిమాత్రమే' అని అర్థం. అనగా ఆకాశంలో ఆకాశతత్త్వం మాత్రమే ఉంటుంది. 'పంచీకరణం' గూర్చి ముందు చెప్పబోతున్నాడు. ఈ ఐదూ ప్రతిక్కటీ మిగిలిన నాల్గింటితో కలిసినపుడు సృష్టికి కారణం అవుతాయి.

**మూ॥ సూక్ష్మశరీరాణి సప్తదశావయవాని లిఙ్గశరీరాణి. అవయవాస్తు జ్ఞానేన్ద్రియపఞ్చకం బుద్ధిమనసీ కర్మేన్ద్రియపఞ్చకం వాయుపఞ్చకం చేతి. జ్ఞానేన్ద్రియాణి శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాఖ్యాని. ఏతాన్యాకాశాదీనాం సాత్త్వికాంశేభ్యో వ్యస్తేభ్యః పృథక్ క్రమేణోత్పద్యన్తే.**

అను.వా॥సూక్ష్మశరీరములే లింగశరీరములు. ప్రత్యగాత్మ ఉందనడానికి లింగం (సూచన) కాబట్టి లింగశరీరం అంటారు. ఈ సూక్ష్మశరీరం యొక్క అవయవాలు పదిహేడు. అవి – ఐదు జ్ఞానేంద్రియాలు, బుద్ధి, మనస్సు, ఐదు కర్మేంద్రియాలు. ఐదు వాయువులు, శ్రోత్రం (చెవి), త్వక్ (చర్మం), చక్షుస్ (కన్ను), జిహ్వ (నాలుక), ఘ్రాణం (ముక్కు) – ఈ ఐదూ జ్ఞానేంద్రియాలు, ఆకాశాదులయొక్క ప్రత్యేకమైన సాత్త్వికాంశాల ద్వారా విడివిడిగా క్రమంగా ఇవి ఉత్పన్నమవుతాయి.

వి॥ ఆకాశము మొదలైన సూక్ష్మభూతాలనుండి సూక్ష్మశరీరాలు ఉద్భవిస్తాయి. కంటికి కనుపించనిది, స్పర్శకు అందనిది, అతిసూక్ష్మమైనది సూక్ష్మశరీరం. ఈ శరీరంద్వారా సుఖదుఃఖాదిఅనుభవం సాధ్యంకాదు. అయితే స్థూలశరీరం (కంటికి కనుపించేది) లేని కాలంలో కూడా మోక్షం పొందేంతవరకు జీవుడు ఒకానొక శరీరాన్ని ఆశ్రయించి ఉంటాడు. అదే పైన చెప్పబడిన సూక్ష్మరీరం. ఇది ప్రత్యక్షంగా కనపడకపోవటం చేతా, కేవలం అనుమాన ప్రమాణం ద్వారా తెలుసుకొనబడటంచేత దీన్ని 'లిఙ్గశరీరం' అంటారు. 'లిఙ్గ్యతే జ్ఞాప్యతే యత్ తత్ లిఙ్గమ్' అని 'లింగ' శబ్దానికి వ్యుత్పత్త్యర్థం.

'జ్ఞానసాధనాని ఇన్ద్రియాణి' – జ్ఞానేన్ద్రియాణి తెల్సుకొవటానికై ఉపయోగపడే సాధనములు జ్ఞానేంద్రియములు. అవి శ్రోత్ర, త్వక్ మొదలైనవి. ఇవి క్రమంగా శబ్దస్పర్శరూపరసగంధాలను గ్రహించేవి. ఇంద్రియం, దానిచేత గ్రహించబడేవి. క్రమంగా ఇలా వుంటాయి.

| **ఇంద్రియము** | **గుణం** |
|---|---|
| శ్రోత్రం | శబ్దం |
| త్వక్ | స్పర్శ |
| చక్షుస్ | రూపం |
| జిహ్వా | రసం |
| ఘ్రాణం | గంధం |



జ్ఞానేంద్రియాల ఉత్పత్తి ఆకాశాదుల వ్యస్తమైన సాత్త్వికాంశాలవలన జరిగింది అని పైన చెప్పబడింది. దానియొక్క వివరణ యిలా ఉంది. ఆకాశం, వాయువు మొదలైన ఐదుభూతాల సాత్త్వికాంశాలు ఆ యా ఇంద్రియాల ఉత్పత్తికి కారణమౌతాయి. ఆ ఉత్పత్తిక్రమం ఇలా ఉంటుంది.

| | |
|---|---|
| ఆకాశం యొక్క సాత్త్వికాంశవలన | – శ్రోత్రేంద్రియం, |
| వాయువు యొక్క సాత్త్వికాంశవలన | – త్వగింద్రియం, |
| తేజస్సు యొక్క సాత్త్వికాంశవలన | – చక్షురింద్రియం, |
| జలం యొక్క సాత్త్వికాంశవలన | – రసనేంద్రియం, |
| భూమి యొక్క సాత్త్వికాంశవలన | – ఘ్రాణేంద్రియం |

ఉత్పన్నమౌతాయి. ఈ ఐదు ఇంద్రియాలూ శరీరం బయట ఉన్న విషయాలను గ్రహించడంచేత బాహ్యేంద్రియాలు అనబడతాయి. బుద్ధి, మనస్సులు కంటికి కనిపించకుండా లోపలే ఉంటాయి. కాబట్టి వీటిని అంతః కరణం (లోపలి సుఖదుఃఖాలను కూడా గ్రహించే ఇంద్రియం) యొక్క విభాగాలుగా భావించారు. ఇవి సూక్ష్మభూతాలయొక్క సాత్త్వికాంశలు కలవటంచేత ఉత్పన్నమౌతాయి. సత్త్వ, రజ, స్తమస్సులతో కూడిన భూతముల యొక్క సత్త్వగుణప్రాధాన్యంవలన ఉత్పన్నమైనవి యీ జ్ఞానేంద్రియాలు.

**మూ॥ బుద్ధిర్నామ నిశ్చయాత్మికాంతఃకరణవృత్తిః మనో నామ సఙ్కల్ప వికల్పాత్మికాంతః కరణవృత్తిః, అనయోరేవ చిత్తాహఙ్కారయోరన్తర్భావః. ఏతే పునరాకాశాదిగతసాత్త్వికాంశేభ్యో మిలితేభ్య ఉత్పద్యన్తే. ఏతేషాం ప్రకాశాత్మకత్వాత్సాత్త్వికాంశకార్యత్వమ్.**

అను.వా॥బుద్ధి మరియు మనస్సు లింగశరీరం యొక్క అవయవాలే అని ఇంతకుముందు తెలుపబడింది. వాటిలో బుద్ధి అనగా "ఇది ఇంతే" అని నిశ్చయంగా చెప్పగల అంతఃకరణవృత్తి, చిత్తం, అహంకారం అనే మరో రెండు వీటిలోని అంతర్భాగాలే. ఇవి ఆకావాదులందుగల, పరస్పరం కలిసిపోయిన సాత్త్వికాంశల నుండి ఉత్పన్నమౌతాయి. ఇవి ప్రకాశవంతములు కాబట్టి సాత్త్వికాంశములనుండి ఉత్పన్నమైనవని తెలుస్తూంది.

వి॥ అంతఃకరణమనగా శరీరం లోపల ఉండే ఇంద్రియం. ఈ అంతః కరణం లోపలి విషయాల్ని సుఖదుఃఖాదుల్ని గ్రహిస్తుంది. బయట విషయాలను గ్రహించేందుకు మాత్రం వీటికి బాహ్యేంద్రియాలైన శ్రోత్రేంద్రియాదుల సహాయం అవసరం.

ఉదాహరణకు ఒక మనిషికి బుద్ధి బాగానే పనిచేస్తూన్నప్పటికీ చక్షురింద్రియం పనిచేయకపోతే ఎదుట వస్తువును చూడలేదు. అయితే యీ అంతఃకరణవృత్తి (పనిచేసే విధానం) నాల్గు విధాలు. అవి – బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము. 'ఇది ఈ విధంగా ఉంటుంది' అని నిశ్చయించే వృత్తి 'బుద్ధి', 'ఇది నీలం', 'ఇది పీతం' (నలుపు, పసుపు) అని అనుకొని, అవునా కాదా అనే సంశయంలో ఉంటే వృత్తిని సంకల్పవికల్పాత్మకం అంటారు. ఇది మనస్సుయొక్క వృత్తి – (మనసుచేసే పని). ఇక పూర్వానుభవాన్ని స్మరించేది 'చిత్తం'. 'ఇది నాది' అనే అభిమానాన్ని కల్గించే వృత్తి 'అహంకారం'.

**మూ॥ మనో బుద్ధిరహఙ్కారశ్చిత్తం కరణమాన్తరమ్,**
**సంశయో నిశ్చయో గర్వః స్మరణం విషయా ఇమే.**

అనే 'కారిక' పై విషయాల్ని చెప్తూంది. చిత్తం బుద్ధిలోనూ, అహంకారం మనస్సులోనూ అంతర్భావాలని 'వేదాంతసారం'లో చెప్పబడింది.

**మూ॥ ఇయం బుద్ధిః జ్ఞానేన్ద్రియైః సహితా విజ్ఞానమయకోశో భవతి. అయం కర్తృత్వభోక్తృత్వసుఖత్వదుఃఖిత్వాద్యభిమానిత్వేనేహలోకపరలోకగామీ వ్యావహారికో జీవ ఇత్యుచ్యతే. మనస్తు జ్ఞానేన్ద్రియైః సహితం సన్మనోమయకోశో భవతి.**



అను.వా॥పైన చెప్పబడిన బుద్ధి జ్ఞానేంద్రియములైన శ్రోత్రాదులతో కలిసి 'విజ్ఞానమయకోశం' అనబడుతుంది. ఈ 'విజ్ఞానమయకోశం' 'వ్యావహారికజీవుడు' అని చెప్పబడుతుంది. ఈ వ్యావహారిక జీవుడు నేను కర్తను, భోక్తను, సుఖవంతుడను, దుఃఖితుడను ఇత్యాది భావనలు కలిగినవాడై ఇహలోకానికీ, పరలోకానికీ తిరుగుతూ ఉంటాడు. జ్ఞానేంద్రియములతో కలిసిన మనస్సు 'మనోమయకోశం'.

వి॥ ఇంతకు మునుపు చెప్పబడిన పదిహేడు అవయవాలతో కూడిన లింగశరీరం ఆత్మచైతన్యాన్ని ఆవరించే మూడు కోశాలరూపంలో ఉంటుందని వేదాంతశాస్త్రం వర్ణిస్తుంది. ఆ మూడు కోశాలు –

1. విజ్ఞానమయకోసం, 2. మనోమయకోశం, 3. ప్రాణమయకోశం. వీటిలో మొదటి రెండింటిని గూర్చి పైన చెప్పబడింది.

విజ్ఞానమయకోశంచేత ఆచరించబడిన ఆత్మచైతన్యమే వ్యావహారిక జీవుడు. వేదాంతదర్శనం ప్రకారం విశుద్ధచైతన్యం ఎట్టివ్యవహారాలూ లేనిది. కాని ఈ విజ్ఞాననమయకోశం అన్ని వ్యవహారాలనూ కల్గి ఉంటుంది. అందుచేత ఈ చైతన్యం వ్యావహారిక జీవుడు అనబడుతుంది. విజ్ఞానమయకోశం వలె మనోమయకోశం కూడా వ్యవహారాలను కలిగి ఉన్నది. అయితే ఇది వ్యావహారిక జీవునకు ఉపకరణంగా ఉంటుంది. మనోమయకోశంలో చెలరేగే సంకల్పవికల్పాదులను బుద్ధి నిశ్చయిస్తుంది. ఈ విధంగా జీవుని వ్యవహారం ముందుకు నడుస్తుంది.

**మూ॥ కర్మేన్ద్రియాణి వాక్పాణిపాదపాయూపస్థాఖ్యాని, ఏతాని పునరాకాశాదీనాం రజోంశేభ్యో వ్యస్తేభ్యః పృథక్ పృథక్ క్రమేణోత్పద్యన్తే.**

అను.వా॥వాక్కు, చేతులు, పాదములు, పాయువు, ఉపస్థ (జననేంద్రియం) – ఈ మూడు కర్మేంద్రియాలు. ఈ కర్మేంద్రియాలు ఆకాశాదుల యొక్క

విడివిడిగా ఉండే రాజసాంశలనుండి ఆకాశాదిక్రమంలో ఉత్పన్నమవుతాయి.

వి॥ స్థూలశరీరంయొక్క కర్మకు సాధనాలుగా ఉంటాయి కాబట్టి యీ ఐదుకర్మేంద్రియాలు అనబడతాయి. వాటియొక్క వ్యుత్పత్త్యర్థం అవి చేసే పనులను సూచిస్తుంది. ఆ వ్యుత్పత్త్యనుసారం –

'వాక్' అనగా 'వక్తి యయా' దేనిచేత మాటలాడతాడో అది. స్థూలశరీరం యొక్క అంగమైన నాలుకపైన ఉండి శబ్దోచ్చారణకు సహకరించేది వాగింద్రియం

'పాణి' – అనగా 'పణతే' – వ్యవహరతి కిం వా పణయతి – యేన – దేనిచేత మనుష్యుడు ఆదానప్రదానాదులను (తీసుకోవటం, ఇవ్వటం) చేస్తాడో అది 'పాణి'.

'పాదము' – 'పద్యతే – గచ్ఛతి యేన' మనుష్యుడు దేనితో గమనాన్ని సాగిస్తాడో అది.

'పాయువు' – అనగా 'పాతి–రక్షతి' శరీరాన్ని రక్షించేది. శరీరంలోని అనవసరపదార్థాలను విసర్జించి శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచేది.

ఉపస్థ – 'ఉపతిష్ఠతి ఇతి ఉపస్థా'.

**మూ॥ వాయవః ప్రాణాపానవ్యానోదానసమానాః, ప్రాణోనామ ప్రాగ్గమనవాన్నాసాగ్రస్థానవర్తీ. అపానో నామ వాగ్గమనవాన్పాయ్వాదిస్థానవర్తీ. వ్యానో నామ విష్వగ్గమనవానఖిలశరీరవర్తీ, ఉదానో నామ కణ్ఠస్థానీయోర్ధ్వగమనవానుత్క్రమణవాయుః. సమానో నామ శరీరమధ్యగతాశితపీతాన్నాది సమీకరణకరః.**

అను.వా॥వాయుపంచకం అనగా ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అనబడు ఐదు వాయువులు. వీటిలో ప్రాణవాయువు ముందుకు వెళుతుంది. ఇది నాసాగ్రభాగంలో ఉంటుంది. అపానవాయువు క్రిందికి సంచరిస్తుంది. ఇది పాయువు మొదలైన స్థానాలలో ఉంటుంది.



శరీరమంతటా సంచరించే వాయువు వ్యానము అనబడుతుంది. కంఠంలో ఉండి పైకి సంచరించే వాయువు ఉత్క్రమణవాయువు ఉదానము. శరీరమధ్యభాగంలో ఉండి భుజించిన ఆహారాన్ని, సేవించిన ద్రవాల్నీ సమీకరించేది సమానవాయువు.

ఈ వాయువుల స్థానాలని గూర్చి ఈ క్రింది శ్లోకంలో చెప్పారు.

'హృది ప్రాణో గుదేఽపానః సమానో నాభిసంస్థితః,

ఉదానః కంఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః'

ప్రాణాదిపదాల వ్యుత్పత్తి యీ క్రింది విధంగా చెప్పారు.

ప్రాణితి – ప్రకర్షేణ అనితి' – శ్వాసక్రియలో ఉండేది ప్రాణవాయువు.

'అపకర్షేణ అనితి' – క్రిందుగా వెళ్లేశ్వాసను కల్గించేది.

'విష్వగ్ అనితి' – శరీరమంతటా శ్వాసింపచేస్తుంది.

'వ్యానము' – అంతేగాక ప్రాణాపానముల సంధి యీ వ్యానవాయువు.

'ఉద్ ఆ అనితి' – పైకి శ్వసిస్తుంది ఉదానవాయువు.

'సమీకరణాయ అనితి' – సమీకరణం కొరకై సంచరించేది సమానవాయువు.

**మూ॥ కేచిత్తు నాగకూర్మకృకలదేవదత్తధనఞ్జయాఖ్యాః పఞ్చాన్యే వాయవః సన్తీతి వదన్తి. తత్ర నాగ ఉద్గిరణకరః, కూర్మ ఉన్మీలనకరః. కృకలః క్షుత్కరః. దేవదత్తో జృమ్భణకరః. ధనఞ్జయః పోషణకరః. ఏతేషాం ప్రాణాదిష్వన్తర్భావాత్ ప్రాణాదయః పఞ్చైవేతి కేచిత్.**

అను.వా॥వేదాంతులమతం ప్రకారం వాయువులు (ప్రాణాదులు) ఐదు మాత్రమే. కొందరు (ఇతరమతానుయాయులు) ఈ ఐదు మాత్రమేకాక ఇతరమైన నాగ, కూర్మాది పంచవాయువులున్నాయని అంగీకరించారు. వారి

మతానుసారం ఆ ఐదు క్రమంగా ఇవి – నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయములు. వీటిలో పైకి వెలిగ్రక్కించేది నాగవాయువు. కళ్లు తెరవడం 'కూర్మ'మనే వాయువువల్ల జరుగుతుంది. 'కృకల' వాయువు ఆకలిని పుట్టిస్తుంది. 'దేవదత్త' వాయువు ఆవులింతకు కారణం. శరీరానికి పుష్టిని కల్గించేది. 'ధనంజయ' వాయువు. ఈ ఐదింటి కార్యాలూ ప్రాణాదివాయువుల వల్ల జరుగుతున్నాయి. కనుక ఇవి మొదట చెప్పిన పంచవాయువుల్లోనే అంతర్భూతమౌతాయని మరి కొందరి అభిప్రాయం.

**మూ॥ ఏతత్ప్రాణాదిపఞ్చకమాకాశాదిగత రజోఽంశేభ్యో మిలితేభ్య ఉత్పద్యతే. ఇదం ప్రాణాదిపఞ్చకం కర్మేన్ద్రియైః సహితం సత్ప్రాణమయకోశో భవతి. అస్య క్రియాత్మకత్వేన రజోఽంశకార్యత్వమ్. ఏతేషు కోశేషు మధ్యే విజ్ఞానమయో జ్ఞానశక్తిమాన్ కర్తృరూపః. మనోమయ ఇచ్ఛాశక్తిమాన్ కార్యరూపః. యోగ్యత్వాదేవమేతేషాం విభాగ ఇతి వర్ణయన్తి. ఏతత్కోశత్రయం మిలితం సత్సూక్ష్మశరీరమిత్యుచ్యతే.**

**13**

అను.వా॥ పైన చెప్పబడిన ప్రాణాదిపంచవాయువులు ఆకాశాది సూక్ష్మభూతాల పరస్పరసమ్మిళితములై రజోగుణాంశములనుండి ఉత్పన్నమౌతాయి. ఈ ఐదువాయువులూ, ఐదుకర్మేంద్రియములతో కలిసి ప్రాణమయకోశం ఏర్పడుతుంది. ఈ ప్రాణమయకోశం క్రియాత్మకం (పనిచేసేది) కాబట్టి క్రియాగుణం కల్గిన రజోగుణం వల్ల ఏర్పడిందని తెలుస్తుంది. ఈ విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయకోశాలు మూడింటిలో విజ్ఞానకోశము జ్ఞానశక్తిగల కర్తృరూపము. మనోమయకోశము ఇచ్ఛాశక్తిగల కార్యరూపము. ఇవి చేసే పనులనుబట్టి వీటియొక్క విభాగము (విభజన) ఏర్పడింది. ఈ మూడు – కోశాలు కలిసి సూక్ష్మశరీరంగా చెప్పబడుతాయి.



వి॥ వాక్కు మొదలైన కర్మేంద్రియాలు ఆకాశాది సూక్ష్మభూతాల వివిక్త (విడివిడిగా) రజోభాగంనుండి ఏర్పడినాయి. ప్రాణాదులు సమ్మిళితమైన రజోగుణాంశాలవలన ఏర్పడినాయి. కేవల కర్మేంద్రియాలకు క్రియాశీలత లేదు. ప్రాణాదులతో కలవటం వల్లనే వాటికి క్రియాశక్తి చేకూరుతుంది. విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయకోశాలకి వరుసగా జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అవి మూడుశక్తులు ఉన్నాయి. జ్ఞానశక్తి ఉండటంచేత విజ్ఞానమయానికి కర్తృత్వరూపం, ఇచ్ఛాశక్తి ఉండటంచేత మనోమయానికి కరణరూపం ఏర్పడినాయి. ప్రాణమయానికి క్రియాశక్తి ఉండటంచేత కార్యరూపం ఏర్పడింది. ఈ విధంగా అవిచేసే పనిని బట్టి ఆయా కోశాలు వర్గీకరణ జరిగింది. అదే విషయం ఈ క్రింద చెప్పబడింది.

"విజ్ఞానమయస్య తు కర్తృత్వముపపాదితం, మనోమయస్య కరణత్వం వివేకసాధనత్వాత్, ప్రాణమయస్య కార్యరూపం యుక్తమ్".

ఈ విధంగా అవయవాలను గూర్చి చెప్పి, 'ఏతత్కోశత్రయం......' అని అవయవి ఐన సూక్ష్మశరీరం ఎలా ఏర్పడిందో చెప్పాడు.

**మూ॥ అత్రాప్యఖిలసూక్ష్మశరీరమేకబుద్ధివిషయతయా వనవజ్జలాశయవద్వా సమష్టిరనేకబుద్ధివిషయతయా వృక్షవజ్జలవద్వా వ్యష్టిరపి భవతి. ఏతత్సమష్ట్యుపహితం చైతన్యం సూత్రాత్మా, హిరణ్యగర్భః, ప్రాణశ్చేత్యుచ్యతే, సర్వత్రానుస్యూతత్వాత్ జ్ఞానేచ్ఛాక్రియాశక్తి వదుపహితత్వాచ్చ, అస్యైషా సమష్టిః స్థూల ప్రపఞ్చాపేక్షయా సూక్ష్మత్వాత్సూక్ష్మశరీరం విజ్ఞానమయాదికోశ త్రయం జాగ్రద్వాసనామయత్వాత్స్వప్నోఽత ఏవ స్థూలప్రపఞ్చలయస్థానమితి చోచ్యతే.**

అను.వా॥ ఇక్కడకూడా సమస్తసూక్ష్మశరీరాలను ఒకే సముదాయంగా గ్రహించినపుడు వనంవలె, జలాశయంవలె 'సమష్టి' రూపంగానూ, అనేకంగా గ్రహించనపుడు వృక్షంవలె, జలం వలె 'వ్యష్టి' రూపంగానూ

వ్యవహరించబడుతుంది. 'సమష్టి' చేత కప్పివేయబడిన చైతన్యమే సూత్రాత్మ అనీ, హిరణ్యగర్భుడనీ, ప్రాణము అనీ చెప్పబడుతూంది. ఇలా పిలువబడటానికి కారణం ఈ చైతన్యం అనుస్యూతంగా అంతటా ఉండటం, జ్ఞానశక్తి, క్రియాశక్తులుకల వాటిచేత కప్పివేయబడి ఉండటం. స్థూలప్రపంచం కంటె యీ సమష్టి సూక్ష్మమైంది కనుక సూక్ష్మశరీరం అనీ, విజ్ఞానము, మనోమయ, ప్రాణయకోశత్రయము అనీ చెప్పబడుతుంది. అంతేగాక జాగ్రదవస్థలోని వాసనలతో కూడి యుండటంచేత ఇది 'స్వప్నం' అనీ, అందుచేతనే స్థూలప్రపంచం యొక్క లయస్థానమనీ చెప్పబడుతూంది.

వి॥ ఇంతకుమునుపు అజ్ఞానం యొక్క సమష్టివ్యష్టిలను గూర్చి వివరించడం జరిగింది. అజ్ఞానానికి వలెనే యీ సూక్ష్మశరీరం కూడా సమష్టి, వ్యష్టి అని రెండు విధాలు. సూక్ష్మశరీరసముదాయం ఒక్కటే అనే విషయం బుద్ధిగ్రాహ్యమైతే అది వ్యష్టిరూపం, జ్ఞానక్రియాశక్తులతో కూడియున్న సమష్టి ప్రాణేంద్రియసముదాయంతో కూడినది. ఇది సమష్టిలింగశరీరం. దీనిచేత ఆవరించబడిన చైతన్యం జ్ఞానశక్తిప్రాధాన్యం కలిగినదై 'హిరణ్యగర్భ' డనీ, క్రియాశక్తిప్రాధాన్యం వల్ల 'ప్రాణు'డనీ వ్యవహరించబడుతూంది.

మాలలోని పుష్పాలన్నింటిలోనూ సూత్రం (దారం) ఎలా అనుస్యూతంగా ఉంటుందో అదే విధంగా సమష్టిచైతన్యం ప్రతిసూక్ష్మశరీరంలోని ఆత్మచైతన్యంలో అనుస్యూతంగా ఉంటుంది. అందుచేతనే యీ చైతన్యం సూత్రాత్మగా వ్యవహరించబడుతుంది. సమష్టిరూపమైన ఉపాధియొక్క గర్భంలో ఉన్న యీ చైతన్యం హిరణ్యం (బంగారం) లా మెరుస్తూ ఉంటుంది. కాబట్టి హిరణ్యగర్భుడని వ్యవహరించబడుతుంది. సమష్టిరూపమైన సూక్ష్మశరీరంచేత కప్పివేయబడిన ఆత్మచైతన్యం ప్రాణం అని వ్యవహించబడటానికి కారణం ఆ శరీరంలో ప్రాణానికి ప్రాధాన్యం ఉండటమే. ఈ సూక్ష్మశరీరం జాగ్రదవస్థలోని అనుభవాల వాసనలతో కూడినది కాబట్టి 'స్వప్నం' అని వ్యవహరించబడుతూంది. ఇది స్థూలప్రపంచానికి లయస్థానం.



**మూ॥ ఏతద్వష్ట్యుపహితం చైతన్యం తైజసో భవతి తేజోమయాంతః కరణోపహితత్వాత్. అస్యాపీయం వ్యష్టిః స్థూలశరీరాపేక్షయా సూక్ష్మత్వాదితి హేతోరేవ సూక్ష్మశరీరం విజ్ఞానమయాదికోశత్రయం జాగ్రద్వాసనామయత్వాత్స్వప్నోఽత ఏవ స్థూలశరీరలయస్థానమితి చోచ్యతే.**

అను.వా॥తేజోమయమైన అంతఃకరణంచేత ఆవరించబడటంచేత యీ 'వ్యష్టి' చేత ఆవరించబడిన చైతన్యాన్ని 'తైజస'మని వ్యవహరించబడుతుంది. 'తైజసం' యొక్క యీ వ్యష్టి స్థూలశరీరంకంటె సూక్ష్మమయినది. అందుచేత ఇది సూక్ష్మశరీరమని పిలువబడుతుంది. ఇది విజ్ఞానమయాదికోశాలతో కూడుకొన్నది కాబట్టి విజ్ఞానమయాది కోశత్రయం అనీ, జాగ్రదవస్థలోని అనుభవాల సంస్కారాలను కలిగి ఉండటంచేత, 'స్వప్న' మనీ, అందుచేతనే స్థూలశరీరాలకు లయస్థానమనీ చెప్పబడుతుంది.

వి॥ సమష్టివ్యష్టులకు గల భేదమే వాటిచేత ఆవపించబడిన చైతన్యాలు భిన్నంగా కనపడడానికి కారణం.

| సమష్ట్యుపహిత చైతన్యం | వ్యష్ట్యుపహితచైతన్యం |
|---|---|
| సూత్రాత్మ, హిరణ్యగర్భుడు, ప్రాణం | తైజసుడు |
| స్థూలప్రపంచంకంటె సూక్ష్మం | స్థూలశరీరంకంటె సూక్ష్మం |
| స్థూలప్రపంచలయస్థానం | స్థూలశరీరలయస్థానం |

మిగిలిన విజ్ఞానమయాదికోశత్రం మొదలైనవి రెంటికీ సామాన్యమే.

**మూ॥ ఏతౌ సూత్రాత్మతైజసౌ తదానీం మనోవృత్తిభిః సూక్ష్మవిషయాననుభవతః "ప్రవివిక్తభుక్తైజస" ఇత్యాదిశ్రుతేః. అత్రాపి సమష్టివ్యష్ట్యోస్తదుపహిత సూత్రాత్మతైజసయోర్వనవృక్షవత్తదవచ్ఛిన్నాకాశవచ్చ**

**జలాశయజలవత్తద్గతప్రతిబిమ్బాకాశవచ్చాభేదః. ఏవం సూక్ష్మశరీరోత్పత్తిః.**

అను.వా॥ఈ సూత్రాత్మతైజసులిరువురూ ఆ సమయంలో మనస్సుయొక్క వృత్తులద్వారా సూక్ష్మవిషయాలను అనుభవిస్తారు. 'ప్రవివిక్తభుక్ తైజసః' అని శ్రుతివాక్యం. అనగా తైజసుడు సూక్ష్మవిషయాలను అనుభవిస్తాడు. అని అర్థం. ఇక్కడ కూడా యీ సమష్టివ్యష్టులకూ, వాటిచేత ఆవరించబడిన సూత్రాత్మతైజసులకూ అభేదమే. వన, వృక్షములకూ, వనావచ్ఛిన్న, వృక్షావచ్ఛిన్నాకాశాలకూ ఎలా భేదం లేదో, జలాశయ, జలాలకు, వాటియందు ప్రతిబింబించే ఆకాశాలకూ ఎలా భేదం లేదో అలాంటి అభేదభావమే సూత్రాత్మ తైజసులకు ఉంటుంది.

వి॥ ఇక్కడ ఈ ఉపహితచైతన్యాన్ని గూర్చి స్పష్టమైన అవగాహన కొరకై కొన్ని అంశాలు యీ క్రింది ఇవ్వబడినాయి.

1. అజ్ఞానసమష్టిచేత ఉపహితమైన చైతన్యం – ఈశ్వరుడు
2. అజ్ఞానవ్యష్టిచేత ఉపహితమైన చైతన్యం – ప్రాజ్ఞుడు
3. ఈశ్వర సుషుప్తి – జగత్ప్రళయము
4. ప్రాజ్ఞసుషుప్తి – నిద్ర
5. సూక్ష్మశరీరసమష్టిచేత ఉపహితమైన చైతన్యం – సూత్రాత్మ
6. సూక్ష్మశరీరవ్యష్టిచేత ఉపహితమైన చైతన్యం – తైజసుడు. సూత్రాత్మస్వప్నము ప్రళయానికీ సృష్టికీ మధ్యదశ
7. తైజస స్వప్నము –సుషుప్తి జాగరణలకి మధ్యదశ



**స్వప్నానికీ, సుషుప్తికీ గల భేదం**

| స్వప్నం | సుషుప్తి |
|---|---|
| జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలు లయం చెందుతాయి. అంతఃకరణంమాత్రం క్రియాత్మకంగా ఉంటుంది. | జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాంతః కరణముల లయము (పనిచేయవు). అవిద్య మాత్రమే క్రియాత్మకమై ఉంటుంది. |
| స్వప్నంలో అంతఃకరణవృత్తి ద్వారా సూక్ష్మవిషయాల అనుభవం ఉంటుంది. | సుషుప్తియందు అవిద్యావృత్తిచేత ఆనందము మరియు అజ్ఞానంయొక్క అనుభవం ఉంటుంది. |

**మూ॥ స్థూలభూతాని తు పఞ్చీకృతాని, పఞ్చీకరణం త్వాకాశాది పఞ్చస్వేకైకం ద్విధా సమం విభజ్య తేషు దశసు భాగేషు ప్రాథమికాన్పఞ్చభాగాన్ప్రత్యేకం చతుర్ధా సమం విభజ్య తేషాం చతుర్ణాం భాగానాం స్వస్వ ద్వితీయార్ధభాగపరిత్యాగేన భాగాన్తరేషు సంయోజనమ్. తదుక్తమ్ –**

**ద్విధా విధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః।**
**స్వస్వేతర ద్వితీయాంశైర్యో జనాత్పఞ్చ పఞ్చ తే॥ ఇతి**

అను.వా॥స్థూలభూతములైతే పంచీకృతాలు. పంచీకరణం అనగా మొదటగా ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి – ఈ ఐదింటినీ ఒక్కొక్క దాన్ని రెండు సమభాగాలుగా చేయాలి. అలా పది సగభాగాలు ఏర్పడతాయి. వాటిలో ప్రతి ఒక్కదానిలో రెండవసగం వదిలేసి, మొదటి సగభాగాన్ని తీసుకొని ఒక్కొక్కదాన్నీ నాలుగేసి సమభాగాలుగా చేయాలి. అలా చేసిన నాలుగు భాగాలను తన దాంతో తప్ప మిగిలిన నాలుగు సగభాగాలతోనూ కలిపివేయాలి. ఇదే పంచీకరణం. ఈ విషయాన్నే పై శ్లోకం తెలయజేస్తుంది. పట్టిక ద్వారా ఈ విషయం స్పష్టమవుతుంది.




ఇప్పుడు ఖ+$గ_1$+$చ_1$+$జ_1$+$ట_1$ = ఆకాశము + ఇతర భూతాల అంశాలు

ఘ+$క_1$+$చ_1$+$జ_1$+$ట_1$ = వాయువు + ఇతర భూతాల అంశాలు

ఛ+$గ_1$+$చ_1$+$జ_1$+$ట_1$ = తేజస్సు + ఇతర భూతాల అంశాలు

ఝ+$గ_1$+$చ_1$+$జ_1$+$ట_1$ = ఆపస్సు + ఇతర భూతాల అంశాలు

ఠ+$గ_1$+$చ_1$+$జ_1$+$ట_1$ = పృథివి + ఇతర భూతాల అంశాలు

ఈ విధంగా ఒక్కో భూతంలో సగభాగం స్వతత్త్వం, మిగిలిన సగభాగంలో ఇతరభూతాల అంశాలు ఉంటాయి. ఇది పంచీకరణం. ఈ పంచీకరణం వలన ఏర్పడిన ఆకాశాదిభూతాలు స్థూలభూతాలు అనబడతాయి.

వి॥ అజ్ఞానోపహితచైతన్యంనుండి ఆకాశాదిక్రమంలో ఉత్పన్నమైన భూతాలు సూక్ష్మభూతాలు. వీటి ఉత్పత్తి మొదట ఆకాశం, తరువాత వాయువు ఇలా క్రమంలో జరుగుతుంది. వీటిలో తమతత్త్వమే పూర్తిగా ఉంటుంది. ఇతర భూతాలఅంశలు ఏమాత్రం ఉండవు. పంచీకరణం జరిగిన తరువాతనే అవి కలుస్తాయి.

**మూ॥ అస్యాప్రామాణ్యం నాశఙ్కనీయం త్రివృత్కరణం శ్రుతేః పఞ్చీకరణస్యాప్యుపలక్షణత్వాత్. పఞ్చానాం పఞ్చాత్మకత్వే సమానే ఽపి తేషు చ. 'వైశేష్యాత్తద్వాదస్తద్వాద' ఇతి న్యాయేనాకాశాదివ్యపదేశః సమ్భవతి. తదానీమాకాశే శబ్దో ఽభివ్యజ్యతే వాయౌ శబ్దస్పర్శరూపరసగన్ధాశ్చ. 15**



అను.వా॥ ఈ పంచీకరణాన్ని గూర్చి శ్రుతివాక్యాలేమీ చెప్పటం లేదు. కాబట్టి దీనికి ప్రమాణం లేదు. ఇది అప్రామాణికం అని సందేహించకూడదు. ఎందుచేతనంటే శ్రుతిలో పంచీకరణాన్ని గూర్చి చెప్పకపోయినా 'త్రివృత్కరణ' ప్రక్రియ చెప్పబడింది. దాని ఆధారంగా ఉపలక్షణద్వారా పంచీకరణానికే ఈ ప్రక్రియ అన్వయిస్తుంది. ఐదుభూతాల్లోనూ ప్రతి ఒక్కదానిలో స్వతత్త్వంతో కలిపి పంచభూతాలతత్త్వం ఉన్నప్పటికీ ఆయాభూతాల్లోనూ ప్రతి ఒక్కదానిలో స్వతత్త్వంతో కలిపి పంచభూతాలతత్త్వం ఉన్నప్పటికీ ఆయాభూతాల్లో ఉన్న అధికాంశాన్ని బట్టి ఆయాపేర్లతో వ్యవహరించబడుతుంది. అర్థభాగం ఆకాశం ఉంటే ఆకాశం అనీ, ఇలాగే తక్కిన భూతాలు 'వాయు' మొదలైన పేర్లతో పిలువబడతాయి. ఈ పంచీకరణం తర్వాత ఆకాశంలో శబ్దగుణం అభివ్యక్తవవుతుంది. వాయువునందు శబ్ద, స్పర్శ, రూప, రసాలూ, పృథిలో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అభివ్యక్తమౌతాయి.

వి॥ త్రివృత్కరణాన్ని గూర్చి ఛాందోగ్య ఉపనిషత్‌లో (6-3-2,3) ఇలా వర్ణించబడింది.

క్ష "సేయం దేవతైక్షత హన్తాహమిమాస్తిస్రో, దేవతా అనేన-
జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి తాసాం త్రివృతం
త్రివృతమేకైకాం కరవాణి" -
ఇతీక్షిత్వా సా సదాఖ్యా దేవతా త్రివృతం
త్రివృతం త్రిరూపా త్రిరూపామకరోత్కృతవతీతి త్రివృత్కరణశ్రుతిః

"ఆ ఈ దేవత ఇలా అనుకొంది. నేను ఈ మూడు దేవతలయందు ఆత్మచేత ప్రవేశించి వీటియొక్క నామరూపాలు ఏర్పాటు చేస్తాను". ఇలా అనుకొని 'సత్' అనబడే ఆ దేవత మూడింటినీ రెండు, రెండు భాగాలుగా విభజించి మూడు, మూడు రూపాలు గల్గిన దేవతలను సృజించింది. తేజస్సు, జలం, భూమి, ఈ మూడింటినీ (పంచీకరణంలో చూపినట్లుగా) మొదట ప్రతి ఒక్కదాన్నీ

రెండు సమభాగాలుగా విభజించి, దానిలోని ఒకభాగాన్ని మళ్లీ రెండుగా విభజించి మిగతా రెండు భూతాల అర్ధభాగంలో కలిపివేసింది. ఇదే త్రివృత్కరణం. ఈ విధంగా మూడు భూతాలను గూర్చి అనుకొన్న దేవత పంచభూతాలను గూర్చి ఆలోచించినప్పుడు పంచీకరణంమాత్రం ఎందుకు చేయదు? అందుచేత త్రివృత్కరణాన్ని బట్టే పంచీకరణం కూడా ప్రామాణికమయినది అని చెప్పవచ్చు.

ఇక పంచీకృతాలైన స్థూలభూతాల్లో ఆయా గుణాల అభివ్యక్తిని గూర్చి కూడా ఒక సందేహానికి అవకాశం ఉంది. అది – అన్ని – భూతాల్లోనూ యితర భూతాల భాగాలు ఉన్నప్పుడు ప్రతి ఒక్కదానియందూ శబ్ద, స్పర్శమొదలైన ఐదు గుణాలూ అభివ్యక్తం కావాలి. కాని పైన చెప్పిన దాంట్లో ఉత్తరోత్తర గుణాల సంఖ్య పెరిగింది. అని సందేహం కలుగవచ్చు. దానికి సమాధానం ఉత్పత్తి క్రమంలో ఆకాశాదులు ఒకదాని తరువాత ఒకటి వస్తాయి. గుణాల అభివ్యక్తి విషయంలో పూర్వపూర్వం అంటే మొదట ఉన్నదాని గుణాలు తరువాతి దాంట్లో అభివ్యక్తమవడానికి ఆస్కారముంటుంది. కాని తరువాతి వాటినుంచి మొదటి వాటిలోకి వెళ్ళలేవు. ఈ రకంగా పంచభూతాల పంచీకరణం మరియు వాటి గుణనిర్ధారణా జరిగింది.

**మూ॥ ఏతేభ్యః పఞ్చీకృతేభ్యో భూతేభ్యో భూర్భువః స్వర్మహర్జనస్తపః సత్యమిత్యేతన్నామకానాముపర్యుపరి విద్యమానానామతల వితలసుతలరసాతల తలాతలమహాతలపాతాలనామకానామధోఽధో విద్యమానానాం లోకానాం బ్రహ్మాణ్డస్య తదన్తర్వర్తి చతుర్విధస్థూలశరీరాణాని తదుచితానామన్నపానాదీనాం చోత్పత్తిర్భవతి. చతుర్విధశరీరాణి తు జరాయుజాణ్డజోద్భిజ్జ స్వేదజాఖ్యాని. జరాయుజాని జరాయుభ్యో జాతాని మనుష్యపశ్వాదీని, అణ్డజాన్యణ్డేభ్యో జాతాని పక్షిపన్నగాదీని. ఉద్భిజ్జాని భూమిముద్భిద్య జాతాని కక్షవృక్షాదీని. స్వేదజాని స్వేదేభ్యో జాతాని యూకామశకాదీని.**

అను.వా॥పంచీకృతములైన ఈ ఐదుస్థూలభూతములనుండి పైపైన ఉన్న భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం, మహర్లోకం, జనోలోకం, తపోలోకం,



సత్యలోకం, అనే ఏడు లోకాలు, క్రింది భాగంలో ఉండే అతలం, వితలం, సుతలం, రసాతలం, తలాతలం, మహాతలం, పాతాలం, అనే ఏడులోకాలూ, బ్రహ్మాండమూ. దానిలో ఉండే నాలుగు విధాలైన స్థూలశరీరాలు – జరాయుజ, అండజ, ఉద్భిజ్జ, స్వేదజాలు– జరాయుజాలనగా గర్భాశయం నుండి మావితో ఉద్భవించినవి. ఉదా: మానవ, పశుశరీరాలు. అండజాలనగా మావితో గ్రుడ్లనుండి జన్మించిన పక్షి, సర్పాదులు శరీరాలు. ఉద్భిజ్జాలు అనగా భూమిని చీల్చుకొని వచ్చిన కక్ష (డొంకలు), వృక్షములు మొదలైనవి. స్వేదజాలు అనగా స్వేదము మరియు మలిన జలము నుండి పుట్టిన పేలు, దోమలు మొదలైనవి.

వి॥ స్థూలభూతాలైన ఆకాశాదుల నుండి సమస్త సృష్టి ఎలా జరిగిందో పైన వర్ణించబడింది. ఆ వర్ణనానుసారం –

ఏడు ఊర్ధ్వలోకాలు 'భూ' మొదలైనవి సృజించబడినాయి. ఈ ఊర్ధ్వలోకాలు ప్రాణులయొక్క కర్మజ్ఞానఫలభోగానికి స్థానాలు. వారి వారి కర్మలను బట్టి పైపై లోకాలకు వెళతారు. అని చెప్పబడే పై లోకాలు ఇవే. అదే విధంగా అధో లోకాలు ఏడు. 'అతల' మొదలైనవి. ఇవి పాపకర్మల ఫలితాన్ని అనుభవించే స్థానాలు. ఈ పదునాల్గింటిలో భూలోకం మాత్రమే కర్మ భూమి. ఈ లోకంలోనే పుణ్య, పాపకర్మలు చేయడానికి అవకాశం ఉంది. ఈ పదునాల్గులోకాలు 'లోకలోక' మనే పర్వతంచేత నాల్గువైపులా ఆవరించబడి ఉన్నాయి. ఆ 'లోకలోక' పర్వతంచుట్టూ 'భూమి' ఉంది. ఆ 'భూమి' నలువైపులా సముద్రం ఉంది. ఇలా ఉన్న ఈ మొత్తం అంతా కలిసి బ్రహ్మాండం అవుతుంది.

ఇదే విషయం – ఏత ఏవస్యావరణభూత 'లోకాలోక' పర్వత, తద్బాహ్యా పృథివీ. తద్బాహ్యా సముద్రైః సహితా బ్రహ్మాండమిత్యుచ్యతే" – అని చెప్పబడింది. ఇలాంటి వర్ణనే బృహదారణ్యక ఉపనిషత్తులో లభిస్తుంది.

"ద్వాత్రింశతం వై దేవరథాహ్నాయోఽయం లోకస్తం సమస్తం పృథివీ ద్విస్తావత్ పశ్యేతి, తాం సమస్తం పృథివీం ద్విస్తావత్సముదాః పర్యేతి"

(3-3-2)

ముప్పది రెండు సూర్యగమనాలు (దేవరథాలు) కల్గినది ఒకలోకం. అనగా ఒకలోకాన్ని చుట్టటానికి ముప్పది రెండుసార్లు సూర్యుడు తిరగాలి. అలాంటి లోకాన్ని దాంతో రెండింతలు గల భూమి ఆవరించి ఉంది. ఆ భూమిని దాంతో రెండింతలు గల సముద్రం ఆవరించి ఉంది అని అర్థం.

**మూ॥ అత్రాపి చతుర్విధసకలస్థూలశరీరమేకానేకబుద్ధి విషయతయా వనవజ్జలాశయవద్వా సమష్టిర్వృక్షవజ్జలవద్వా వ్యష్టిరపి భవతి. ఏతత్సమష్ట్యుపహితం చైతన్యం వైశ్వానరో విరాడిత్యుచ్యతే సర్వనరాభిమానిత్వాద్వివిధం రాజమానత్వాచ్చ. అస్యైషా సమష్టిః స్థూలశరీరమన్నవికారత్వాదన్నమయకోశః స్థూలభోగాయతనత్వాచ్చ స్థూలశరీరం జాగ్రదితి చ వ్యపదిశ్యతే.**

అను.వా॥ ఈ స్థూలశరీరాలవిషయంలో కూడా సమష్టి, వ్యష్టి అని వ్యవహారం ఉంది. నాల్గువిధాలుగా చెప్పబడిన (ఉత్పన్నమయిన) సకల స్థూలశరీరాలూ ఒక్కటిగా బుద్ధిగోచరమైనప్పుడు వనంలాగా, జలాశయంలాగా సమష్టిరూపంలో చెప్పబడుతుంది. అనేకరకాలుగా బుద్ధిగోచరమైనపుడు ఈ స్థూలశరీరాలు వృక్షంలాగా, జలంలాగా వ్యష్టిగా చెప్పబడతాయి. వీటిలో మొదట చెప్పిన సమష్టిచేత కప్పివేయబడిన చైతన్యం 'అందరు నరులూ నేనే' అనుకోవటంచేత 'వైశ్వానరు'డనీ వివిధ రూపాల్లో ప్రకాశించటంచేత 'విరాట్' అని చెప్పబడుతున్నాడు. ఈ వైశ్వానరునికి ఉపాధిగా ఉన్న స్థూలశరీరాత్మకమైన సమష్టి అన్నంవలన ఏర్పడింది. కాబట్టీ, ఇది కోశంలాగా చైతన్యాన్ని కప్పి ఉంచుతుంది. కాబట్టీ ఇది 'అన్నమయకోసం' అయింది. స్థూలభోగానికి (అనుభవాలకు) నిలయం



అవటంచేత స్థూలశరీరంగానూ, భోగాలను అనుభవించగల్గిన దశ అనటంచేత స్థూలశరీరంగానూ,భోగాలను అనుభవించగల్గిన దశ అనటంచేత జాగ్రదవస్థగానూ చెప్పబడింది.

వి॥స్థూలశరీరాలు కంటికి కనిపించే ప్రమాణంలో ఉంటాయి. అందుచేతనే వీటిని స్థూలశరీరాలు అంటారు. వీటిని ఉత్పత్తి 'అన్నం' అనగా తినే పదార్థాలవలన ఏర్పడుతుంది.

"అన్నాద్భవన్తి భూతాని ........" అనే శ్రుతివాక్యం అందరికీ తెలిసినదే. అన్నం యొక్క ప్రాధాన్యంవల్ల ఈ శరీరానికి 'అన్నమయం' అనీ, ప్రాణాన్ని (చైతన్యాన్ని) కోశంలాగా లోపల దాచి ఉంచుతుంది, కనుక ఈ రెండు కారణాల వల్లా 'అన్నమయకోశం' అనే పేరు వచ్చింది. ఈ శరీరంలో ఉన్న చైతన్యం శరీరాన్నే తానుగా భావిస్తాడు. అన్ని శరీరాల సమూహాన్ని తానుగా భావించే చైతన్యమే వైశ్వానరుడు. ఈ చైతన్యమే జగత్తుయొక్క వివిధ రూపాల్లో ప్రకాశమానం అవుతుంది కనుకనే ఇదే 'విరాట్'.

**మూ॥ ఏతద్వ్యష్ట్యుపహితం చైతన్యం 'విశ్వ' ఇత్యుచ్యతే సూక్ష్మశరీరాభిమాన మపరిత్యజ్య స్థూలశరీరాదిప్రవిష్టత్వాత్. అస్యాప్యేషా వ్యష్టిః స్థూల శరీరమన్నవికారత్వాదేవ హేతోరన్నమయకోశో జాగ్రదితి చోచ్యతే.**

అను.వా॥ఈ వ్యష్టిచేత ఆవరించబడిన చైతన్యాన్ని సూక్ష్మశరీరంనందలి అభిమానాన్ని వదలిపెట్టకుండానే స్థూలశరీరాదుల్లో ప్రకాశిస్తుంది. అందుచేత ఈ చైతన్యం 'విశ్వ' అని అనబడుతుంది. ఈ చైతన్యానికి సూక్ష్మశరీరాల్లో అన్నింట్లోనూ అభిమానం ఉండటంచేత దీన్ని 'విశ్వ' అంటారు. ఈ 'విశ్వ' అనే చైతన్యానికి ఉపాధి అయిన వ్యష్టిని స్థూలశరీరం అనీ, అన్నంనుండి జన్మించినది కావటంచేత అన్నమయకోశమూ అనీ, 'జాగ్రత్' అని వ్యవహరిస్తారు.

వి॥ కారణశరీరమైన సూక్ష్మశరీరం పట్ల అభిమానం వదలకుండానే చైతన్యం స్థూలశరీరంలో ప్రవేశిస్తుంది. జీవుడనబడే చైతన్యానికి మూడురకాల ఉపాధులు

(ఆవరణలు) అని చెప్పవచ్చు. అవి – 1. సుషుప్తియందు బుద్ధి మొదలైనవాటి సంస్కారంతో కూడిన 'అజ్ఞానం' 2. స్వప్నమునందు జాగ్రదవస్థలోని అనుభవాలవాసనలతో కూడిన లింగశరీరం. 3. జాగ్రదవస్థయందు సూక్ష్మశరీరంలో కలిపిన స్థూలశరీరం. ఈ సమష్టివ్యష్టులకు పేరులోనే భేదం, తత్త్వంలో మాత్రం అభేదం ఉంటుంది.

| **సమష్టిచేత ఆవరించబడిన చైతన్యం** | **వ్యష్టచేత ఆవరించబడిన చైతన్యం** |
|---|---|
| వనంవలె | వృక్షంవలె |
| జలాశయంవలె | జలంవలె |
| వైశ్వానరుడు, విరాట్ | విశ్వ |
| అన్నమయకోశం | అన్నమయకోశం |
| జాగ్రత్ | జాగ్రత్ |

**మూ॥ తదానిమేతౌ విశ్వవైశ్వానరౌ దిగ్వాతార్కవరుణాశ్విభిః క్రమాన్నియన్త్రితేన శ్రోత్రాదీంద్రియపఞ్చకేన క్రమాచ్ఛబ్దస్పర్శ రూపరసగంధానగ్నీన్ద్రోపేన్ద్రయమప్రజాపతిభిః క్రమాన్నియన్త్రితేన వాగాదీన్ద్రియపఞ్చకేన క్రమాద్వచనాదానగమనవిసర్గానంశ్చన్ద్రచతుర్ముఖశఙ్కరాచ్యుతైః క్రమాన్నియన్త్రితేన మనోబుద్ధ్యహంకార చిత్తాఖ్యేనాన్తరిన్ద్రియచతుష్కేణ క్రమాత్సఙ్కల్పనిశ్చయాహఙ్కార్య చైత్తాంశ్చ సర్వానేతాన్ స్థూలవిషయాననుభవతః 'జాగరితస్థానో బహిః ప్రజ్ఞ' ఇత్యాది శ్రుతే.**

అను.వా॥ జాగ్రవస్థలో నున్న ఈ విశ్వవైశ్వానరులిరువురూ స్థూల విషయాలను ఎలా అనుభవిస్తారో పైన వివరించబడింది. ఈ విశ్వవైశ్వానరులిరువులు దిక్, వాత, అర్క, వరుణ, అశ్విని దేవతలచే క్రమంగా నియంత్రించబడిన జ్ఞానేంద్రియాలు శ్రోత్ర, త్వక్ చక్షు, జిహ్మా ఘ్రూణేంద్రీయములైదింటిలో క్రమంగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాల్నీ, అగ్ని ఇంద్ర, ఉపేంద్ర, యమ, ప్రజాపతులచే క్రమంగా నియంత్రించబడిన కర్మేంద్రియాలు వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలైదింటిలో క్రమంగా వచన, ఆదాన, గమన, విసర్గ, ఆనందాలనూ, చంద్ర, చతుర్ముఖ, శంకర, అచ్యుతులచే క్రమంగా నియంత్రించబడిన మనోబుద్ధ్యహంకారచిత్తములనే నాలుగు అంతరింద్రియములతో క్రమంగా సంకల్ప నిశ్చయ, అహంకార, చైత్తాలనూ అన్నింటినీ అనుభవిస్తారు. ఈ విషయాన్ని "జాగరిత స్థానంలో వైశ్వానరుడు బహిర్ముఖమైన బుద్ధికలవాడై స్థూల విషయాలను అనుభవిస్తాడు" అని శ్రుతివాత్యం తెలియజేస్తూంది.



వి॥ స్థూలశరీరం ప్రత్యక్షంగా కన్పించేది, జాన్ష, కర్మేంద్రియలాతో, అంతః కరణవృత్తులతో స్థూలవిషయాలను అనుభవించేది కనుక ఆయా ఇంద్రియాలను, వాటి అధిష్ఠానుదేవతలను గూర్చిపైన వివరంగా తెలియజేయబడింది. జ్ఞానేంద్రియాలనుగూర్చి కర్మేంద్రియాలను గూర్చి సూక్ష్మశరీరోత్పత్తి జరిగినప్పుడు స్థూలశరీరంలో ఆయా అవయవభాగాల్లో ప్రవేశిస్తాయి. అవి క్రమంగా–

| | | |
|---|---|---|
| శ్రోత్రం | – | కర్ణఛిద్రంలోనూ, |
| త్వక్ | – | చర్మంలోనూ, |
| చక్షు | – | కళ్లలోనూ, |
| రసన | – | జిహ్వాపైనా, |
| ఘ్రాణ | – | నాసికాగ్రభాగంలో చేరిపోతాయి. |

జానేంద్రియాలకూ, అవి ఉన్న అవయవస్థానాలకూ గల భేదం సామన్యా దృష్టికి తెలియకపోవచ్చు. కాని అతిసూక్ష్మమైన శాస్త్రాయమైన వివరణ ఇందులో ఉంది. ఉదాహరణకు కంటికి కనిపించే చెవి మొత్తం శ్రవణేంద్రియం కాదు

చెవిలోపల ఉండే 'కర్ణవివరం'() మాత్రమే ఇంద్రియం. అదే శబ్దాన్ని గ్రహిస్తుంది. ఇలాగే అన్ని ఇంద్రియాలను గూర్చిన వివరణ దర్శనశాస్త్రాల్లో లభిస్తుంది.

ఇదే విధంగా కర్మేంద్రియాలు ఐదు–

| | | |
|---|---|---|
| వాక్ | – | కంఠం యొక్క ఉచ్చారణ స్థానంలోనూ, |
| పాణి | – | చేతుల లోనూ, |
| పాదం | – | కాళ్లలోనూ, |
| పాయువు | – | అపానమార్గం (గుదం) లోనూ, |
| ఉపస్థ | – | జననేంద్రియంలోనూ ప్రవేశిస్తాయి. |

ఇదే విధంగా స్థూలశరీరభాగాల్లో ప్రవేశించి భోగాలను అనుభవించడానికి శరీరానికి సహకరించే ఈ ఇంద్రియాలన్నింటికి అధిష్ఠానదేవతలున్నారు. ఒక్కొక్క దేవత ఒక్కొక్క ఇంద్రియాన్ని నియమిస్తూంటుంది.

| జ్ఞానేంద్రియాలు | | అధిష్ఠానదేవతలు |
|---|---|---|
| శ్రోత్ర | – | దిక్కులు |
| త్వక్ | – | వాయువు |
| చక్షు | – | సూర్యుడు (అర్కుడు) |
| జిహ్వా | – | వరుణుడు |
| ఘ్రాణ | – | అశ్వినీదేవతలు. |

శబ్దం 'దిక్కు' అనగా శూన్యంలోంచి పుడుతుంది. కావున దిక్కు అధిష్ఠానదేవత. స్పర్శ చర్మం ద్వారా తెలియజేయబడుతుంది. దీనికి అధిష్ఠానదేవత వాయువు. వెలుగులేకపోతే చూపులేదు. కనుక చక్షువునకు సూర్యుడు అధిష్ఠానదేవత. నాలుక రసాన్ని ఆస్వాదిస్తుంది. కనుక దీనికి అదిష్ఠాన దేవత వరుణుడు. ఘ్రాణేంద్రియానికి అశ్వినిదేవతలు శక్తినిస్తారు. అందుచేత వారు అధిష్ఠానదేవతలు.

కర్మేంద్రియాలు – వాటి అధిష్ఠానదేవతలు క్రమంగా ఇలా వుంటారు.

| **ఇంద్రియం** | | **దేవత** |
|---|---|---|
| వాక్ | – | అగ్ని |
| పాణి | – | ఇంద్రుడు |
| పాదం | – | ఉపేంద్రుడు |
| పాయువు | – | యముడు |
| ఉపస్థ | – | ప్రజాపతి. |



అంతరింద్రియాలు అధిష్ఠానదేవతలు ఈ క్రింది క్రమంలో ఉంటారు.

| **ఇంద్రియం (అంతఃకరణం)** | | **దేవత** |
|---|---|---|
| మనస్సు | – | చంద్రుడు |
| బుద్ధి | – | చతుర్ముఖుడు |
| అహంకారం | – | శంకరుడు |
| చిత్తం | – | అచ్యుతుడు |

ఈ ఇంద్రియాలన్నింటిచేతా అనుభవించబడే విషయాలు –

1. శ్రోత్రం – శబ్దం, 2. త్వక్ – స్పర్శ, 3. చక్షుస్ – రూపం, 4. జిహ్వా – రసం, 5. ఘ్రాణం – గంధం (వాసన)

ఇంద్రియాలచేత చేయబడే పనులు –

1. వాక్ – వచనం, 2. పాణి – ఇవ్వటం, తీసుకోవటం, 3. పాదం – గమనం, 4. పాయువు – విసర్జనం, 5. ఉపస్థ – ఆనందాన్ని అనుభవించటం.

అంతరింద్రియములు చేసే పనులను గూర్చి ఇదివరకే చర్చించబడింది.

ఈ విధంగా స్థూలశరీరం భోగాలకు ఎలా ఆస్పదమైందో స్పష్టీకరించబడింది. ఈ జాగ్రదవస్థకు ప్రాధాన్యం ఉంది. ప్రమాతృప్రమాణ ప్రమేయవ్యవహారాలన్నీ సంభవించేవి ఈ దశలోనే. ప్రమాణాలద్వారా అర్థాన్ని తెలుసుకొనేవాడు ప్రమాత. దేనిచేత తెలుసుకోనబడుతుందో అది ప్రమాణం. ఏదైతే తెలుసుకొనబడుతుందో అది ప్రమేయం.

**మూ॥ అత్రాప్యనయోః స్థూలవ్యష్టిసమష్ట్యోస్తదుపహితవిశ్వవైశ్వానరయోశ్చ వనవృక్షవత్తదవచ్ఛిన్నాకాశవచ్చ జలాశయ జలవత్తద్గత**

**ప్రతిబిమ్బాకాశవచ్చ పూర్వవదభేదః, ఏవం పఞ్చీకృతపఞ్చభూతేభ్యః స్థూలప్రపఞ్చోత్పత్తిః.**

అను.వా॥ఇంతకుముందు చెప్పిన వనవృక్షాలకూ, వాటిచేత అవచ్ఛిన్నమైన ఆకాశాదులకూ, జలాశయజలాలకూ, వాటిలో ప్రతిబింబించే ఆకాశాలకూ ఎలా అభేదం ఉందో (భేదంలేదో) అలాగే ఇక్కడ చెప్పబడిన స్థూలవ్యష్టి సమష్టులకూ, వాటిచేత ఆవరించబడిన విశ్వ వైశ్వానరులకూ కూడా భేదం లేదు. ఈ విధంగా పంచీకృతమైన పంచభూతాలనుండి స్థూలప్రపంచోత్పత్తి జరుగుతుంది.

మూ॥ **ఏతేషాం స్థూలసూక్ష్మకారణప్రపఞ్చానామపి సమష్టిరేకో మహాన్ప్రపఞ్చో భవతి యథావాన్తరవనానాం సమష్టిరేకం మహద్వనం భవతి యథా వాఽవాన్తరజలాశయానాం సమష్టిరేకో మహాన్ జలాశయః. ఏతదుపహితం వైశ్వానరాదీశ్వరపర్యన్తం చైతన్యమప్యవాన్తరవనావచ్ఛిన్నాకాశవదవాన్తరజలాశయగతప్రతిబిమ్బాకాశవచ్చైకమేవ.**

అను.వా॥కొన్ని వనాలు కలిపి ఒక సమష్టిరూపంలో మహావనం ఏర్పడినట్లుగా కొన్ని జలాశయాలు కలిసి మహాజలాశయం ఏర్పడినట్లుగా, ఈ స్థూల, సూక్ష్మ, కారణప్రపంచాలయొక్క సమష్టి ఒక మహాప్రపంచం అవుతుంది. ఈ స్థూల, సూక్ష్మ, కారణప్రపంచాల సమష్టిరూపమైన మహాప్రపంచం చేత ఆవరించబడిన చైతన్యం కూడా వైశ్వానరుని నుండి ఈశ్వరునివరకు అవాంతర (చిన్న, పెద్ద) వనాలతో అవచ్ఛినమైన ఆకాంశంలా, అవాంతరజలాశయాల్లో ప్రతిబింబించే ఆకాశంలా ఒక్కటే. భిన్నంకాదు.

వి॥ వృక్షాదుల ఉనికి మూడు విధాలుగా చెప్పవచ్చును. 1. ఒకే వృక్షం. 2. కొన్ని వృక్షాల సముదాయమైన ఒక చిన్నవనం. 3. ఇలాంటివనాల యొక్క సముదాయమైన మహావనం.



ఇలాంటి స్థితే జలం విషయంలో కూడా ఉంటుంది. అది 1. బిందురూపమైన జలం, 2. చిన్నజలాశయంలోని జలం, 3. జలాశయాల సముదాయమైన మహాజలాశయం (సముద్రం).

ఈ విధమైన దశలు ప్రపంచసృష్టికి ఉంటాయి. అవి 1. కారణ ప్రపంచమని చెప్పబడే అజ్ఞాన ప్రపంచం. 2. సూక్ష్మభూతాలుగా చెప్పబడే సూక్ష్మ ప్రపంచం. 3. స్థూలభూతాలు వాటియొక్క కార్యాలతో కూడిన స్థూల ప్రపంచం. వీటన్నింటి సమూహం ఒక మహాప్రపంచం.

వృక్షం, వనం, మహావనం వీటిలో భేదం ఏమీలేదు. (అన్నింటిలో ఉండేది వృక్షము) అందుచేత వాటిచేత అవచ్ఛినమైన ఆకాశంలో కూడా భేదం లేదు. అన్నింటిలోనూ ఉండేది జలమే. భేదంలేదు. అలాగే వీటిలో ప్రతిబింబించే ఆకాశం కూడా ఒక్కటే.

ఇలాంటి అభేదమే కారణప్రపంచం, సూక్ష్మప్రపంచం, స్థూల ప్రపంచాల్లో ఉంది. వీటిచేత ఆవరించబడిన చైతన్యంలో కూడా ఏకత్వమే ఉంది. అందుచేత వీటిలోని చైతన్యాలుగా చెప్పబడే విశ్వ, తైజస, ప్రాజ్ఞ మరియు వైశ్వానరసూత్రాత్మ మరియు ఈశ్వరులందు కూడా భేదం లేదు. ఈ ఉపాధులన్నింటిచేత ఆవరించబడిన మహాచైతన్యం ఒక్కటే.

మూ॥ **ఆభ్యాం మహాప్రపంచతదుపహితచైతన్యాభ్యాం తప్తాయః పిణ్డవదవివిక్తం సదనుపహితం చైతన్యం "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇతి వాక్యస్య వాచ్యం భవతి; వివిక్తం సల్లక్ష్యమపి భవతి. ఏవం వస్తున్యవస్తారోపోఽధ్యారోపః సామాన్యేన ప్రదర్శితః.**

అను.వా॥స్థూలసూక్ష్మకారణప్రపంచసముదాయరూపమైన మహాప్రపంచం కంటే, దానిచేత ఆవరించబడిన చైతన్యం కంటె వేరుగాకనబడని విశుద్ధమైన అనుపహితచైతన్యం. "ఇది అంతయూ బ్రహ్మయే" అనే వాక్యంయొక్క వాచ్యార్థం అవుతుంది. అలాకాకుండా కేవల విశుద్ధచైతన్యాన్నే పరిగణిస్తే "ఇది అంతయూ బ్రహ్మయే" అనే వాక్యానికి లక్ష్యార్థం అవుతుంది.

ఈ విధంగా వస్తువుగాని దానిని (అవస్తువును) వస్తువునందు ఆరోపించటం అనే ఆధ్యారోపం సంక్షిప్తంగా చెప్పబడింది.

వి॥ ఇక్కడ వాచ్యార్థం అంటే ఏమిటో లక్ష్యార్థం అంటే ఏమిటో తెల్సుకోవాలి. ఒక వాక్యంలోని పదాలు పరస్పర అన్వయంలో అర్థాన్ని ఇస్తే అది వాక్యం యొక్క వాచ్యార్థం అవుతుంది. అలా కాకుండా ఒక వాక్యంలోని పదాలకు పరస్పరం అన్వయం కుదరక 'అర్థం' గ్రహించడం సాధ్యం కానప్పుడు దాన్ని 'భాధ' (ఆటంకం) అంటారు. అలా వాక్యంలోని పదాలతో అన్వయం కుదరనప్పుడు ఆ పదాల అర్థంతో సంబంధం ఉన్న మరో దానిని లక్ష్యంగా అర్థం చెపితే కుదిరే సందర్భంలో ఆయా అర్థం చెప్పుకోవచ్చు. దీన్నే లక్ష్యార్థం అంటారు.

ఉదా: "గొడుగును ధరించిన వ్యక్తి వెళ్తున్నాడు" అనేవాక్యంలో అర్థం స్పష్టంగా ఉంది, అర్థం గ్రహించడంలో ఎలాంటి అసౌకర్యమూ లేదు. అదే "గొడుగు వస్తున్నది" అనే వాక్యంలో అచేతనమైన గొడుగు, గమన క్రియకూ పొత్తు కుదరక పోవటం వలన అర్థం కుదరదు. అలాంటప్పుడు గొడుగు నడిచి రాదు కాబట్టి దాన్ని ధరించిన వ్యక్తి నడచివస్తున్నాడు అని అర్థం గ్రహిస్తాం. ఈ విధంగా అనుకోవడానికి కారణం గొడుగు ఎవరో ధరిస్తే తప్ప కదల్లేదు అనే విషయం తెల్సి ఉండటం. ఇలా గొడుగు ద్వారా అక్కడ లేని వ్యక్తిని లక్ష్యంగా చేసుకొని చెప్పటమే లక్ష్యార్థం.

చైతన్యం లేని గొడుగులో మనిషికి గల చైతన్యాన్ని ఆరోపించడం 'గొడుగు నడుస్తూంది' అని చెప్పటంలో గల అంశం. దీన్నే 'అధ్యారోపం' అంటారు. అలాగే "తప్త అయః పిండం" అన్నప్పుడు తాపానికి ఆశ్రయం అగ్ని, ఇనుపగోళం కాదు. కానీ వ్యవహారంలో "ఇనుపగోళం కాలుస్తుంది" అని చెప్తున్నాం. కాల్చే శక్తి గలది 'అగ్ని' మాత్రమే. అందుచేత అగ్నిత్వాన్ని ఇనుపగోళంలో ఆరోపించటం కూడా ఆ వస్తువునందు వస్త్వారోపమే. ఇదే విధంగా "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నప్పుడు 'ఇదంతయు బ్రహ్మ' అన్నది వాచ్యార్థం. అయితే శ్రుతి యొక్క ఉద్దేశ్యం ఈ వాచ్యార్థం కాదు. దేని చేతా ఆవరించబడని విశుద్ధమైన చైతన్యం మాత్రమే బ్రహ్మ. ఈ అర్థం లక్షణ ద్వారా సిద్ధిస్తుంది. మహాప్రపంచంనందు బ్రహ్మను ఆరోపించడం పైన చెప్పినట్టి ఆధ్యారోపం.



ఈ విధంగా అధ్యారోపాన్ని గూర్చి సంక్షిప్తంగా తెలియజేసి తరువాత బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించబోతున్నాడు.

**మూ॥ ఇదానీం ప్రత్యగాత్మనీదమిదమయమారోపయతీతి విశేషత ఉచ్యతే. అతిప్రాకృతస్తు "అత్మా వై జాయతే పుత్ర" ఇత్యాదిశ్రుతేః స్వస్మిన్నివ స్వపుత్రేఽపి ప్రేమదర్శనాత్పుత్రే పుష్టే నష్టే చాహవేవ పుష్టో నష్టశ్చేత్యాద్యనుభవాచ్చ పుత్ర ఆత్మేతి వదతి.**

అను.వా॥ఇప్పుడు ప్రత్యగాత్మయందు ఈ వ్యక్తి దీన్ని ఆరోపింపచేస్తున్నాడు అని విశేషోదాహరణలతో (ముందుముందు) నిరూపించబడుతుంది. అతి సామాన్యమానవుడు (అజ్ఞాని) అయితే "ఆత్మయే పుత్రునిగా జన్మిస్తుంది" అనే శ్రుతివాక్యాన్ని విని తన పుత్రుడే తానుగా భావించుకొని, తనపట్ల తనకు ఎంత ప్రేమ ఉందో అంతటి ప్రేమనూ పుత్రుని పట్ల కలిగి ఉంటాడు. అంతే కాదు పుత్రునికి పుష్టి (మంచి) కలిగితే తనకే పుష్టి కలిగినట్లూ, అతనికి నష్టం కలిగితే తనకే నష్టం కలిగినట్లూ భావిస్తాడు.

వి॥ మోక్షం కావాలనుకునేవాడూ, వేదాంతవిద్యకు అధికారి అయిన పురుషుడు సంసారానలంలో సంతప్తుడై వేదాంతవేత్త అయిన గురువు దగ్గరికి వెళతాడు. గురువు అతనికి జీవబ్రహ్మలయొక్క ఐక్యాన్ని అభేదాన్ని అధ్యారోపం, అపవాదం ఈ రెండింటిద్వారా వివరిస్తాడు. (అధ్యారోప అపవాదాల్ని గూర్చి మొదటే చెప్పబడింది). అచార్యుడు శిష్యుని మొదట సులభంగా అర్థమయ్యే ఉదాహరణల్ని చూపిస్తాడు. ఇదే సామాన్యంగా చెప్పటం. తర్వాత ఆ జీవ, బ్రహ్మలను గూర్చి విశేషంగా వివరిస్తాడు. ఈ విధంగా ఇంతవరకూ సామాన్యంగా వివరించడం జరిగింది. సచ్చిదానందబ్రహ్మ, విశుద్ధచైతన్యం అద్వైతం (ఒక్కటే) అనీ, అజ్ఞానంవల్లనే వేరువేరుగా కన్పిస్తున్నాయనీ, అందుచేతనే ఆ బ్రహ్మలో

ఈశ్వర, జీవ, జగత్తులు చూపబడుతున్నాయని సోదాహరణంగా వివరించబడింది.

ఇక ముందు మానవుడు విశుద్ధచైతన్యమైన బ్రహ్మనే కాదు, తనను తానే తెల్సుకోవటం లేదు అని వివరించబడుతుంది. తాను కాని పుత్రున్ని తానుగా భావించటం, అతని కష్టనష్టాలు తనవిగా భావించడం ఇవన్నీ అజ్ఞానంయొక్క ఫలితాలు అని తెలియజేయబడుతుంది. అసలు శరీరమే తాను కానప్పుడు ఇక తన పుత్రునికి సంబంధించినది తనవి అనుకోవటం ఎంత అవివేకం; అదే విశేషం ఇక్కడ చర్చించబడుతూంది.

**మూ॥ చార్వాకస్తు "స వా ఏష పురుషోఽన్నరసమయ" ఇత్యాదిశ్రుతేః ప్రదీప్తగృహాత్స్వపుత్రం పరిత్యజ్యాపి స్వస్య నిర్గమదర్శనాత్ స్థూలో ఽహం కృశోఽహమిత్యాద్యనుభవాచ్చ స్థూలశరీరమాత్మేతి వదతి.**

అను.వా॥ఇక్కడ చార్వకమతాన్ని పేర్కొనడం జరిగింది. చార్వాకుడు అయితే "అన్నరసమయుడు అని చెప్పబడిన ఆ పురుషుడు (ఆత్మ) ఇతడే, ఈ కనబడే స్థూలశరీరమే" అని శ్రుతివాక్యానికి అర్థం గ్రహించి శరీరంకన్నా భిన్నంగా ఆత్మలేదని భావిస్తాడు. కాలిపోతున్న ఇంటినుండి తన కుమారుణ్ణి కూడా వదలివేసి తనను తాను రక్షించుకోవటానికి (మనుష్యుడు) ఇంటి నుండి బయటపడటం దీనికి దృష్టాంతం. అంతే కాకుండా "నేను లావుగా ఉన్నాను, నేను కృశించి ఉన్నాను అని 'అహం' పదాన్ని శరీరంలో అన్వయించి చెప్పబడుతుంది. దీన్ని బట్టి కూడా శరీరమే ఆత్మ అని వారి సిద్ధాంతం.

వి॥ ఇహలోకజీవితాన్ని పరమార్థంగా భావిస్తారు చార్వాకులు, వారికి ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం. ఈ శరీరం ఉన్నంతవరకే ఆత్మ ఉంటుంది అని వారి విశ్వాసం. ఈ జన్మకు ముందు ఈ శరీరం లేదు. తరువాత జన్మంటూ ఉండబోదు అని వారి అభిప్రాయం. తల్లిదండ్రులు భుజించిన అన్నరసమే జన్మకు (శరీరోత్పత్తికి) కారణం. ఇలాంటి అభిప్రాయాలతో ఈ లోకంలో ఉన్న



సుఖమే సుఖమనీ, స్వర్గాదులు ఉండవనీ చార్వాకులు తమ సిద్ధాంతాల్ని ప్రతిపాదించారు.

ఈ చార్వాకమతప్రవర్తకుడు 'బృహస్పతి' అని పేర్కొనబడింది. "నిరంతరమూ కలహాలతో ఉండే దేవదానవుల్ని చూసి, శారీరకంగా బలవంతులైన దానవుల్లో అనాత్మవాదాన్ని వ్యాపింపజేయటానికి బృహస్పతి చార్వాకునిగా వారి మధ్యకు వెళ్లి వర్తమానమే సత్యమని ఈ శరీరంకన్నా వేరొక ఆత్మ లేదని బోధించాడు. దానివలన దానవుల్లో అజ్ఞానం పెరిగింది. అందుచేతనే వారిని తమోగుణసంపన్నులుగా వర్ణిస్తారు." అని చార్వాకులను గూర్చి చెప్పబడింది.

ఇక్కడ నుండి గ్రంథకారుడు వివిధమతాలను చెపుతున్నాడు.

**మూ॥ అపరశ్చార్వాకః "తేహ ప్రాణాః" ప్రజాపతిం పితరమేత్య బ్రూయుః ఇత్యాదిశ్రుతేరింద్రియాణామభావే శరీరచలనాభావాత్ కాణోఽహం బధిరోఽహమిత్యాద్యనుభవాచ్చేంద్రియాణ్యాత్మేతి వదతి.**

అను.వా॥"ఆ ప్రాణాలు తండ్రియైన ప్రజాపతిని చేరి ఇలా అన్నాయి" – అనే శ్రుతివాక్యాన్ని అనుసరించి ఇంద్రియాలు లేనిదే శరీరచలనం లేదు కనుక, నేను అంధుణ్ణి. నేను చెవిటివాణ్ణి అని అనుకోవటం చేత ఇంద్రియాలే ఆత్మ అని మరొక చార్వాకుడు అంటున్నాడు.

వి॥ చార్వాకులలో గల మతభేదాల్ని సోదాహరణంగా వివరిస్తున్నాడు. ఇంతకు ముందు 'శరీరమే ఆత్మ' అని వాదాన్ని పేర్కొని ఇప్పుడు 'ఇంద్రియలే ఆత్మ' అని చెప్పే మరొక వాదాన్ని వివరిస్తున్నాడు. ఈ విషయాన్ని చెప్పడానికై ఛాందోగ్య ఉపనిషత్తులోని (5–17) ఒక ఆఖ్యాయికలోని ఒక వాక్యాన్ని ఉదహరించాడు. 'ప్రాణాః ...........' ఇత్యాది అని ఈ కథ సంక్షిప్తంగా ఇలా ఉంది.

ప్రాణేంద్రియాల్లో ముఖ్యమైన ప్రాణ, వాక్, చక్షు, శ్రోత్ర, మనస్సులకు తమలో ఎవరు గొప్ప అనే వివాదం బయలుదేరింది. ప్రతి ఇంద్రియమూ

'నేనంటే నేను' గొప్ప అని వాదించింది. చివరికి తమలో ఎవరు గొప్పో తెలుసుకోవడానికి తమను సృష్టించిన ప్రజాపతి వద్దకు బయలుదేరాయి. వాటిన్నింటి వాదాలు విన్న ప్రజాపతి తన అభిప్రాయం ఇది అని చెప్పకుండా వాటితో "మీలో మీరే మీ మీ ప్రాధాన్యాన్ని పరీక్షించుకొనండి, ఎవరు శరీరాన్ని వదలివేస్తే శరీరం అస్పృశ్యం, నిశ్చేతనం అవుతుందో ఎవరు లేకుంటే శరీరం పనికిరాకుండా పోతుందో వారిదే ప్రాధాన్యం" అని చెప్పాడు. దాంతో ప్రతి ఇంద్రియమూ తన ప్రాధాన్యాన్ని నిరూపించుకోవడానికై శరీరాన్ని వదలి బయటకు వచ్చి పరీక్షించుకున్నాయి. ఆ ప్రయత్నంలో మొదట వాక్కు శరీరాన్ని వదలి వచ్చేసింది. వాక్కు లేకపోయినా శరీరం స్వస్థంగానే ఉండి ఆ మనిషి జీవితం యథాపూర్వంగా నడుస్తోంది. అలాగే చక్షుస్సు, శ్రోత్రం, మనస్సు ఒకటొకటిగా బయటకు వచ్చి శరీరాన్ని పరీక్షించాయి. శరీరం ఆయా ఇంద్రియాలు లేకపోయినా స్వస్థంగానే వుంది. చివరికి 'ప్రాణం' బయటకు రావాలని అనుకొంది. ప్రాణం బయలుదేరగానే మిగతా ఇంద్రియాలకు లోపల ఉండడం సాధ్యం కాలేదు. అశ్వాన్ని అధిరోహించిన పురుషుని చేతిలో కొరడాతో దెబ్బలుతిన్న ఆశ్వం పరుగెత్తడం ప్రారంభిస్తేదాని కట్లు ఎలా విడిపోతాయో ప్రాణం ముందుకు కదలగానే ఇంద్రియాలు వాటంతటవే వదిలిపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. దాంతో ఆ ఇంద్రియాలు ప్రాణంయొక్క మహత్వాన్ని అంగీకరించాయి". దీన్ని బట్టి తెలిసిందేమిటంటే ఇంద్రియాలు లేకపోతే శరీరం పనిచేయలేదు. అందుచేత ఇంద్రియాలే చేతనం అనగా ఆత్మ అని పై చార్వాకుని మతం.

**మూ॥ అపరశ్చార్వాకః "అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయ" ఇత్యాదిశ్రుతేః ప్రాణాభావ ఇన్ద్రియాదిచలనాయోగాదశనాయావానహం పిపాసావానిత్యాద్యనుభావాచ్చ ప్రాణ ఆత్మేతి వదతి.**

అను.వా॥"లోపల ఉండే ప్రాణమయమైన ఆత్మ వేరు" అనే శ్రుతివాక్యాన్ని ప్రమాణంగా తీసికొని 'ప్రాణమే ఆత్మ' అని మరొక చార్వాకమతం.



ప్రాణం లేనపుడు ఇంద్రియాల్లో చలనం లేకపోవటం, ప్రాణం ఉన్నప్పుడే నాకు ఆకలిగా ఉంది. నాకు దప్పికగా ఉంది. అనే అనుభవం కలుగటం వీటన్నింటిని బట్టి ప్రాణమే ఆత్మ అని వీరి మతం.

వి॥ "అన్యోఽన్తర............." అనే వాక్యం తైత్తిరీయ ఉపనిషత్తులోనిది (బ్రహ్మానందవల్లి –1), మొదటి అనువాకంలో అన్నరసమయమైన స్థూలశరీరాన్ని పురుషునియొక్క ఆత్మగా తెలిపి, అటుపిమ్మట రెండవ అనువాకంలో అన్నరసమయశరీరానికి భిన్నమైన, అంతకన్నా లోపలిభాగంలో ఉండే 'ప్రాణ్నాని' పురుషునియొక్క ఆత్మ అని "తస్మాద్ ఏతస్మాదన్నరసమయాత్ అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయ" అనే వాక్యంలో చెప్పాడు. ఈ వాక్యమే చార్వాకులయొక్క "ప్రాణమే ఆత్మ" అనే సిద్ధాంతానికి ఆధారం అని గ్రంథాకారుని అభిప్రాయం.

ఆకలి, దప్పికలు అనేవి ప్రాణానికి సంబంధించినవి. సరియైన ఆహారాదులు అందనప్పుడు ప్రాణం దుర్బలమైపోతుంది. అయితే మనుష్యుడు "నేను క్షుదాపీడితుడను, నేను పిపాసార్తుడను" అని "అహం–ఆత్మనే" పీడితుడుగా భావిస్తున్నాడు. అందుచేత ఆకలి, దప్పికలచే పీడించబడే "ప్రాణమే ఆత్మ" అని భావించబడింది.

**మూ॥ బౌద్ధస్తు "అన్యోఽన్తరఆత్మా విజ్ఞానమయ" ఇత్యాదిశ్రుతేః కర్తుర భావే కరణస్య శక్త్యభావాదహం కర్తాహం భోక్తేత్యాదనుభవాచ్చ బుద్ధిరాత్మేతి వదతి.**

అను.వా॥బౌద్ధమతానుయాయి "అంతర్వర్తి (లోపలఉండే) అయిన విజ్ఞానమయమే ఆత్మ" అని అంటాడు. ఇంతకు ముందు పేర్కొనబడిన అన్నమయ, ప్రాణమయాలకన్నా అంతర్భాగంలో ఉంటుంది ఈ జ్ఞానమయము. ఆ విధంగా ఉండటంచేతా, కర్తలేకుంటే కరణం చేసేదంటూ ఏమి ఉండదు. కనుక, నేను కర్తను, నేను భోక్తను అని బుద్ధికి కలిగే అనుభవాలను బట్టి 'బుద్ధి' అనగా విజ్ఞానమయమే ఆత్మ అని ఈ మతం చెప్తుంది.

వి॥ ఏదైనా పనిచేయాల్ని ఉన్నప్పుడు నిశ్చయించే శక్తి బుద్ధికే గలదని ఇంతకుముందు తెలుపబడింది. బుద్ధివల్లనే పనులు జరుగుతాయి. కాబట్టి బుద్ధి కర్త. కర్తలేకపోతే కరణం సాధనం ఏమి చేయలేదు. కట్టెలు కొట్టేవాడి ప్రక్కనే గొడ్డలి ఉన్నా కట్టెలు కొట్టాలనే 'బుద్ధి', ఆలోచనలేకపోతే గొడ్డలి తానుగా ఏమి చేయలేదు. అందుచేత 'బుద్ధి'కి ప్రాధాన్యం ఉందని తెలుస్తోంది. అలాగే 'నేను చేస్తున్నాను', 'నేను అనుభవిస్తున్నాను' అనే భావాలు నాలో అనే 'అహం-ఆత్మ'లో భావించబడుతున్నాయి. ఇవి బుద్ధియొక్క (బుద్ధికితోచే) భావాలు. వీటిని బట్టిచూస్తే 'బుద్ధి'యే ఆత్మ అనీ బౌద్ధుల సిద్ధాంతం.

**మూ॥ ప్రాభాకరతార్కికౌ తు "అన్యోఽన్తర ఆత్మాఽనన్దమయ" ఇత్యాది శ్రుతేర్బుద్ధ్యాదీనామజ్ఞానే లయదర్శనాదహమజ్ఞోఽహమజ్ఞానీత్యాద్యనుభవాచ్చాజ్ఞానమాత్మేతి వదతః.**

అను.వా॥ప్రాభాకరమీమాంసకులు మరియు తార్కికులు "అంతరంగా ఉండే ఆనందమయమే ఆత్మ" అనే శ్రుతి వాక్యాల్ని అన్వయించుకొని, బుద్ధి మొదలైనవి అజ్ఞానంలో లయ చెందటంచేత, 'నేను అజ్ఞుడను', 'నేను అజ్ఞానిని' అనే అనుభవాలచేత 'అజ్ఞానమే ఆత్మ' అని చెబుతారు.

వి॥ మీమాంసాదర్శనంలో రెండు మతాలున్నాయి. ఒకటి కుమారిలభట్టు ప్రతిపాదించినది. దీన్ని భాట్టమతం అంటారు. మరొకటి ప్రభాకరుల ప్రతిపాదించినది. దీన్ని ప్రాభాకరమతం అంటారు. మూలసిద్ధాంతం ఒక్కటే ఐనప్పటికీ అక్కడక్కడ గల చిన్న భేదాలతో ఈ రెండు శాఖలూ ఏర్పడినాయి. ఇక తర్కశాస్త్రం అనగా న్యాయవైశేషికుల శాస్త్రం. ప్రాభాకరుల అభిప్రాయం ప్రకారం అజ్ఞానం ఆత్మ బుద్ధి మొదలైనవి జ్ఞానభిన్నమైన ఆత్మయొక్క ధర్మాలు. ఆత్మ అజ్ఞాని అనడానికి తార్కాణం 'నేను అజ్ఞుడను, నేను అజ్ఞానిని' అనే అనుభవం.

ప్రాభాకరులు మరియు తార్కికులు "ఆత్మ క్షణికము విజ్ఞానరూపమూ" అనే బౌద్ధుల వాదాన్ని అంగీకరించరు. వారు జ్ఞానభిన్నమైనది ఆత్మ అని



అంగీకరిస్తారు. 'నాకేమి తెలియదు', 'నేను అజ్ఞానిని' అనే భావనలు కలగడాన్ని బట్టి ఆత్మ 'అజ్ఞాని' అని తెలుస్తుంది అని వీరి మతం.

**మూ॥ భాట్టస్తు "ప్రజ్ఞానఘన ఏవానన్దమయ" ఇత్యాదిశ్రుతేః సుషుప్తౌ ప్రకాశాప్రకాశసద్భావాన్మామహం న జానామీత్యాద్యనుభవాచ్చాజ్ఞానోపహితం చైతన్యమాత్మేతి వదతి.**

అను.వా॥బాట్టుడు (భాట్టసంప్రదాయానికి చెందినవాడు) అయితే 'అజ్ఞానం చేత ఆవరించబడిన చైతన్యమే ఆత్మ అని అంటాడు. దీనికి ప్రమాణంగా 'ప్రజ్ఞానఘనమే ఆనందమయం' అనే శ్రుతివాక్యాన్ని చూపిస్తారు. అదీగాక సుషుప్తి అవస్థయందలి ప్రకాశంగాను, ప్రకాశం లేనిదిగానూ ఉండే స్థితిని బట్టి, "నన్ను నేను ఎరుగను" అని అనిపించే అనుభవాన్ని బట్టీ కూడా భాట్టులు పై మతాన్ని ప్రతిపాదించారు.

వి॥ భాట్టమతం ప్రకారం ''అధికమైన జ్ఞానంయొక్క రాశియే ఆనందమయము", అందుచేత 'ఆనందమయమే' ఆత్మ అన్నట్లయితే అది ప్రకృష్టమైన జ్ఞానరాశియే అని అర్థం. ఏ ప్రమాణాలూ పనిచేయని సుషుప్తి స్థితియందే ఈ ప్రజ్ఞానఘనత్వం స్పష్టంగా అనుభవించబడుతుంది. సుఖంగా నిద్రించి మేల్కొన్న వ్యక్తి 'నేను సుఖంగా నిద్రించాను' అని అనుభూతి చెందుతాడు. సుషుప్తిదశలో 'ఆత్మ' యొక్క ప్రకాశమే లేక పోయినట్లైతే అలాంటి అనుభవానికి ఆస్కారం లేదు. అయితే ఇలా అన్వయించడానికి కారణం ఇంద్రియమనస్సుల సంయోగం ద్వారా కల్గిన జ్ఞానం కాదు. నిద్రావస్థలో ఇంద్రియాలు పనిచేయవు. కాబట్టి ఈ అనుభూతికి కారణం ఆ సమయంలో ఆత్మలో ఉన్న ప్రకాశమే. అవిద్యకు ప్రకాశకత్వం లేదు కాబట్టి ఆ సమయంలో చైతన్యమే ఆ ప్రకాశానికి కారణం. అయితే ఆ చైతన్యం అజ్ఞానోపహితం అని భాట్టులు ప్రతిపాదించారు.

**మూ॥ అపరో బౌద్ధః "అసదేవేదమగ్ర ఆసీత్" ఇత్యాదిశ్రుతేః సుషుప్తౌ సర్వాభావాదహం సుషుప్తౌ నాసమిత్యుత్థితస్య స్వాభావపరామర్శ విషయానుభవాచ్చ శూన్యమాత్మేతి వదతి.**

అను.వా॥ మరొక బౌద్ధుడు ఇలా అంటున్నాడు. "అసత్తుమాత్రమే మొదట ఉండినది" అనే శ్రుతివాక్యాన్ననుసరించి మొదట ఏమీ లేదని అనగా 'అసత్తు' మాత్రమే ఉందనీ, సుషుప్త్యవస్థయందు ఏమీ ఉండకపోవటం చేతా, నిద్రనుండి లేచినవానికి నా ఉనికి నాకు తెలియదు (నేనులేను) అనిపించటంచేతా శూన్యమే ఆత్మ. ఈ విధంగా బౌద్ధమతంలో ఒక శాఖ అయిన శూన్యవాదం చెప్తుంది.

వి॥ బౌద్ధమతంలో మాధ్యమికశాఖకు చెందినవారు శూన్యవాదులు. నామ, రూపాత్మకమైన ఈ జగత్తుయొక్క సృష్టికి ముందు ఏమీలేదని, ప్రత్యక్షంగా కనిపించేది ఏదీ నిజానికి లేదనీ అంతా శూన్యమేనని వీరి అభిప్రాయం. ఈ రకంగా ఆత్మయొక్క అస్తిత్వంలో కూడా ప్రమాణం లేదనీ అది ద్రవ్యము కాదు. జ్ఞానాత్మక కాదు అని వీరి సిద్ధాంతం.

**మూ॥ ఏతేషాం పుత్రాదీనామనాత్మత్వముచ్యతే. ఏతైరతిప్రాకృతాదివాదిభిరుక్తేషు శ్రుతియుక్త్యనుభవాభాసేషు పూర్వపూర్వోక్త శ్రుతియుక్త్యనుభవాభాసానాముత్తరోత్తరశ్రుతియుక్త్యనుభావభా-సైరాత్మత్వభాధదర్శనాత్పుత్రాదీనామనాత్మత్వం స్పష్టమేవ. కిఞ్చ ప్రత్యగస్థూలోఽచక్షురప్రాణోఽమనా అకర్తా చైతన్యం చిన్మాత్రం సదిత్యాది ప్రబలశ్రుతివిరోధాదస్య పుత్రాది శూన్య పర్యన్తస్య జడస్య చైతన్యభాస్యత్వేన ఘటాదివదనిత్యత్వాదహం బ్రహ్మేతి విద్వదనుభవప్రాబల్యాచ్చ తత్తచ్ఛృతియుక్త్యనుభవాభాసానాం బాధితత్వాదపి పుత్రాదిశూన్యపర్యన్తమఖిలమనాత్మైవ అతస్తద్భాసకం నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావం ప్రత్యక్ చైతన్యమేవాత్మవస్త్వితి వేదాన్తవిద్వదనుభవః. ఏవమధ్యారోపః. 20**

అను.వా॥ ఇంతవరకూ ఆత్మనుగూర్చి "ఆత్మా …………" ఇత్యాది శ్రుతివాక్యాలతో అన్వయించి చెప్పిన మతాలన్నింటినీ ఖండించి ఆయా మతాలవారు ఆయా విషయాలకు అపాదించిన ఆత్మత్వాన్ని తప్పుగా నిరూపించి, వాటి అనాత్మత్వాన్ని ప్రతిపాదించబోతున్నాడు. అందుచేత "ఏతేషాం ……" అని వీటియొక్క అనాత్మత్వం చెప్పబోతున్నాను అని ప్రారంభించాడు. ఈ అతిప్రాకృతవాదులచేత చెప్పబడిన శ్రుతి, యుక్తి, అనుభవాలుగా భాసించే వాటిలో వెనుక చెప్పిన శ్రుతి, యుక్తి, అనుభవాలుగా భాసించెడి, విషయాలను తరువాత చెప్పిన శ్రుతి. యుక్తి, అనుభవాలుగా భాసించెడి విషయాలు కొట్టివేశాయి అన్న విషయం సుస్పష్టం. అదీగాక ప్రత్యగాత్మ అస్థూలము, అచక్షుస్సు, అప్రాణము, అకర్త, చైతన్యం, చిన్మాత్రము, సత్తు అని శ్రుతులు చెబుతున్నాయి. వీటికి విరోధంగా చెప్పబడటం చేత, పుత్రాది శూన్యపర్యంతము (పుత్రుడు ఆత్మా అనువాదము నుండి శూన్యము ఆత్మ అనువాదం వరకు) ఉన్నవాదులు అయుక్తములు. జడమైనట్టివి చైతన్యంగా భాసించటం చేత ఘటాదులవలె అనిత్యములు. "అహం బ్రహ్మ" "నేను బ్రహ్మను" అని విద్వాంసులకు (బ్రహ్మవేత్తలకు) కలిగిన అనుభవంచేత ఆయా శ్రుతి, యుక్తి, అనుభవాలుగా భాసించెడి వాటికి బాధ (అడ్డు) ఏర్పడటంచేత పుత్రాదిశూన్యపర్యంతము సమస్తమూ అనాత్మయే (ఆత్మకానిదే). అందుచేత ఆ విధంగా భాసింపచేసే నిత్యమైన, శుద్ధమైన, బుద్ధమైన, ముక్తమైన, సత్యమైన ప్రత్యక్ చైతన్యమే ఆత్మవస్తువు (ఆత్మ అని) వేదాంతవేత్తల అనుభవం. ఈ విధంగా వస్తువుకాని పుత్రాదులయందు వస్తువైన ఆత్మతత్త్వాన్ని ఆరోపించటం చేత ఇది అధ్యారోపం.



వి॥ ఈ సందర్భంలో గ్రంథకారుడు చాలా స్పష్టంగా ఆధ్యారోపాన్ని గూర్చి చెప్పాడు. ఇంతవరకూ ఆత్మ స్వరూపాన్ని గూర్చి వివిధమతాలు చర్చించబడినాయి. మొదట అతిసామాన్యుడు చెప్పే "ఆత్మయే పుత్రుడుగా జన్మిస్తుంది" అనువాదాన్ని తీసుకొని మాధ్యమికులు చెప్పే 'శూన్యమే ఆత్మ' అనే వాదం వరకూ శ్రుతివాక్యాలతోను, యుక్తులతోను, అనుభవాలతోను అన్వయించి చెప్పబడిన, వివిధమతాలు వివరించాడు. అయితే ఆ మతాలు

క్రమంగా తరువాత చెప్పబడిన వాటితో వాటి వెనుక చెప్పబడినవి బాధించబడినాయి. అనగా కొట్టివేయబడినాయి. అనగా ఒకరు ఆత్మ పుత్రుడంటే మరొకరు స్థూలశరీరం ఆత్మ అన్నారు. ఇలాగే ఒకటి తర్వాత ఒకటిగా నిరూపించబడినాయి. వేదాంతి ఇప్పుడు వాటన్నింటిని గూర్చి చెప్పున్నాడు. ఇంతవరకూ చెప్పబడినవి ఆత్మలు కాదు. ఎందుచేతనంటే వాటిలో వాటికిగల పరస్పర విరోధం చేతనే ఆ విషయం నిరూపింపబడింది. అదిగాక ఆత్మను గూర్చి శ్రుతులు "ప్రత్యక్ స్థూలముకాదు, చక్షువు కాదు, ప్రాణము కాదు, అది చైతన్యం, చిన్మాత్రం (ప్రకాశాత్మకం), మరియు సత్తు అని చెప్తూన్నాయి. అలాంటి ఆత్మకు ఒకరు స్థూలత్వాన్నీ, ఒకరు ఇంద్రియత్వాన్నీ ఇలా ఆపాదిస్తూ అసలు ఆత్మత్వం లేనిచోట ఉందని చెప్తూ వచ్చారు. అయితే నిజానికి వారు ఉదహరించిన శ్రుతివాక్యాదుల్లో వారికి ఆ 'అర్థం' భాసిస్తుంది (పైపైన కనబడుతుంది). అంతే కాని అది తత్త్వం కాదు, అసలైన ఆత్మ అనుభవం "అహం బ్రహ్మాస్మి" అని బ్రహ్మవేత్తలకు కల్గింది. ఈ అనుభవం యొక్క బలంచేత పుత్రాదులు ఆత్మకాదనే విషయం స్పష్టంగా తెలుస్తూంది. అందుచేత ఇలా భాసించేవి ఆత్మకాదు. భాసింపజేసే శక్తిగల ఆత్మ నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సత్య స్వభావం గల ప్రత్యక్ చైతన్యమే. ఈ విధంగా ఆత్మలేనిచోట దాన్ని ఆరోపిస్తున్నారు. ఇది అధ్యారోపం.

పైన చెప్పబడిన మతాల్లో పరస్పర విరోధం గల వాక్యాలు ఇలా ఉన్నాయి. "ఆత్మా వై పుత్రనామాసి" అనే వాక్యానికి "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్" అనే వాక్యంతో విరోధం. పుత్రుడే ఆత్మ అని మొదటవాక్యం ప్రతిపాదిస్తే ఆత్మ ప్రత్యక్ (లోపల నున్నది) అని రెండవవాక్యం చెపుతూంది. 'స వా ఏష పురుషోఽన్నరసమయః' అనే వాక్యానికి "అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్" అను దాంతో విరోధం. 'పురుషుడు అన్నరసమయుడు' అని ఒక పరిమాణం గూర్చి చెప్తే, స్థూలము, అణువు, పొట్టీ, పొడుగూ ఏదీకానిది ఆత్మ అని ఆత్మకు ఏర్పరచిన హద్దులు కొట్టివేయబడినాయి. ఇలాగే "తేహ ప్రాణా ప్రజాపతిమ్" అనే వాక్యానికి 'అచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదమ్" అనే వాక్యంతోనూ, 'అన్యోఽన్తర



ఆత్మాప్రాణమయ' అనే వాక్యానికి "అన్యోఽన్తర ఆతా మనోమయ" అనే వ్యాంతోనూ, పై రెండు వాక్యాలకూ "అప్రాణోహ్యమనా శుభ్ర" అనేవాక్యంతోనూ, "అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయ" అనే వాక్యానికి "అన్యోఽన్తశ్చాత్మా విశ్వరూపోహ్యకర్తా" అను వాక్యంతోనూ, "అన్యోఽన్తర ఆత్మా ఆనన్దమయ" అనే వాక్యానికి "న చాస్తి వేత్తా మమ చిత్సదాహం" అను వాక్యంతోనూ, "ప్రజ్ఞానఘన ఏవానన్దమయ" అనే వాక్యానికి "చిన్మాత్రోఽహం సదాశివః" అనేవాక్యంతోనూ, "అసదేవేదమగ్ర ఆసీత్" అనువాక్యానికి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అను వాక్యంతోనూ విరోధం.

అధ్యారోపనిరూపణ తర్వాత ఇపుడు 'అపవాదం' వివరించబడుతుంది.

**మూ॥ అపవాదో నామ రజ్జువివర్తస్య సర్పస్య రజ్జుమాత్రత్వవద్వస్తు వివర్తస్యావస్తునో జ్ఞానాదేః ప్రపఞ్చస్య వస్తుమాత్రత్వమ్. తదుక్తమ్–**

**"స తత్త్వతోఽన్యథా ప్రథా వికార ఇత్యుదీరితః.**

**అతత్త్వతోఽన్యథా ప్రథా వివర్త ఇత్యుదాహృతః" ఇతి.**

**తదాహి ఏతద్భోగాయతనం చతుర్విధసకలస్థూలశరీరజాతం భోగ్యరూపాన్నపానాదికమేతదాయతనభూతభూరాదిచతుర్దశ భువనాన్యే తదాయతనభూతం బ్రహ్మాణ్డం చైతత్సర్వమేతేషాం కారణరూపం పఞ్చీకృతభూతమాత్రం భవతి. ఏతాని శబ్దాది విషయసహితాని పఞ్చీకృతాని భూతాని సూక్ష్మశరీరజాతం చైతత్సర్వమేతేషాం కారణరూపా పఞ్చీకృతభూతమాత్రం భవతి. ఏతాని సత్త్వాదిగుణసహితాన్యపఞ్చీకృతాన్యుత్పత్తివ్యుత్క్రమేణైతత్కారణభూతాజ్ఞానోపహితచైతన్యమాత్రం భవతి. ఏతదజ్ఞానమజ్ఞానోపహితం చైతన్యం చేశ్వరాదికమేతదాధార భూతానుపహితచైతన్యరూపం తురీయం బ్రహ్మమాత్రం భవతి.**

అను.వా॥ అపవాదమనగా 'రజ్జువు యొక్క వివర్తరూపమైన సర్పమునందు నిజానికి రజ్జువు మాత్రమే వస్తువు' (అసలైనది)గా గ్రహించడం. అదే విధంగా

'వస్తువు' బ్రహ్మ యొక్కవివర్తరూపమైన అజ్ఞానాది ప్రపంచంయొక్క తత్త్వం వస్తువుగానే ఉండడం అపవాదం. అపవాదాన్ని గూర్చి ఇలా చెప్పారు – 'వస్తువుయొక్క తత్త్వం మార్పుచెంది కన్పించటం వికారం. వస్తువే లేకుండా అది ఉన్నట్లుగా మరొక్క దానిమీద కనుపించడం వివర్తం' అని.

భోగాలకు ఆయతనం (ఆశ్రయం) అయిన నాల్గు విధాల (జరాయుజఇత్యాది) స్థూల శరీరమూ అనుభవింపబడేవి అయిన అన్నపానాదులూ, వీటన్నిటికీ ఆశ్రయమైన భూర్భువాది పదునాల్గు లోకాలూ, వీటన్నింటికీ ఆశ్రయమైన బ్రహ్మాండమూ ఇదంతా కూడా వీటన్నింటికీ కారణరూపమైన పంచీకృతభూతాలు మాత్రమే. శబ్దాదివిషయాలతో కూడిన యీ పంచీకృతభూతాలూ సూక్ష్మశరీరప్రపంచమూ దీనికంతా కారణరూపం అంపచీకృతభూతాలు. ఈ అపంచీకృతభూతాలు సత్త్వాదిగుణములతో కలిసి ఉత్పత్తివిపరీతక్రమంలో వీటన్నింటికీ కారణభూతమైన 'అజ్ఞానోపహితచైతన్యమైన ఈశ్వరాదులూ, దీనికంతా ఆధారభూతమైన అనుపహితచైతన్యరూపం తురీయం బ్రహ్మమాత్రంగా అవుతుంది.

వి॥ ఇంతకుముందు ఉత్పత్తిక్రమాన్ని నిరూపించి ఉన్నాడు. అజ్ఞానాదికము, అపంచీకృతసూక్ష్మభూతాలు, సూక్ష్మశరీరాలు, పంచీకృత భూతాలు, స్థూలశరీరాలు ఇత్యాది. ఇపుడు విపరీతక్రమంలో అనగా కార్యం నుండి కారణం వైపుకు తీసుకువెళుతున్నాడు. ఇలా ఒకటొకటిగా ప్రదర్శిస్తున్నాడు.

భోగాలకు ఆలవాలమైన జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములనెడి నాల్గువిధాలస్థూలశరీరాలు, ఆ శరీరాలద్వారా అనుభవించే (భోగ్య) అన్నపానాదికమూ, ఆ శరీరాలకూ, భోగ్యపదార్థాలకు ఆలవాలమైన పదునాల్గుభువనాలు, ఆ పదునాల్గుభువనాలను తనలో ఇముడ్చుకొన్న బ్రహ్మాండమూ – వీటిన్నింటికీ అనగా కంటికీ కనిపించే ప్రపంచానికి కారణం **పంచీకృతభూతాలు** ఆకాశాదులు.



శబ్దాదివిషయాలు (శబ్ద, స్పర్శ ఇత్యాదులు) వాటితో కూడిన పంచీకృత భూతాలు, సూక్ష్మశరీరాలు – వీటిన్నింటికి కారణరూపం – **అపంచీకృతభూతాలు.**

సత్త్వ, రజస్తమోగుణాలతో కలిసిన అపంచీకృతభూతాలు – వీటికి కారణరూపం – **అజ్ఞానోపహిత చైతన్యం.**

అజ్ఞానం, అజ్ఞానోపహితచైతన్యం (ఈశ్వరమొదలైన) – వీటికి కారణరూపం – **అనుపహితచైతన్య రూపం** – అదే తురీయం – అదే బ్రహ్మ.

ఈ విధంగా మూలంవరకూ వెళ్లి యథార్థవస్తువును తెలుసుకోవటానికి జరిగే ప్రక్రియే తత్త్వాన్వేషణ. తురీయబ్రహ్మకంటె ముందు చెప్పబడినదంతా వివర్తరూపమే. లేనిది ఉన్నట్లుగా కన్పించటం వస్తువు మాత్రం బ్రహ్మమే.

ఈ విషయమే యీ క్రింది శ్లోకాల్లో చెప్పబడింది.

1. జగత్ప్రతిష్ఠా దేవర్షే పృథివ్యప్సు ప్రలీయతే
   జ్యోతిష్యాపః ప్రలీయన్తే జ్యోతిర్వాయౌ ప్రలీయతే.
1. వాయుశ్చ లీయతే వ్యోమ్ని తచ్చావ్యక్తే ప్రలీయతే,
   అవ్యక్తం పురుషే బ్రహ్మన్నిష్కలే సమ్ప్రలీయతే. ఇతి.

"పురుషాన్నపరం కిఞ్చిత్సా కాష్ఠా సా పరా గతిః" – ఇతి చ.

"ఓ దేవర్షీ! జగత్తుయొక్క అస్తిత్వం అయిన పృథివి ఆప్ (జలం) నందు లీనమైపోతుంది. ఆప్ జ్యోతిస్సునందు (తేజస్సునందు), తేజస్సు వాయువునందు, వాయువు ఆకాశంనందు, ఆకాశం అవ్యక్తమునందు, అవ్యక్తం నిష్కలమైన పురుషునియందు క్రమంగా లీనమౌతాయి. ఆ పురుషునికంటె పరమైనది ఏదీ లేదు. అదియే పరాకాష్ఠ.

**మూ॥ ఆభ్యామధ్యారోపాపవాదాభ్యాం తత్త్వమ్పదార్థశోధనమపి సిద్ధం భవతి. తథా హి – అజ్ఞానాదిసమష్టిరేతదుపహితం సర్వజ్ఞత్వాది విశిష్టం చైతన్యమేతదనుపహితం చైతత్త్రయం తప్తాయః పిణ్డవదేకత్వేనావభాసమానం తత్పదవాచ్యార్థో భవతి. ఏత**

**దుపాధ్యుపహితాధారభూతమనుపహితం చైతన్యం తత్పదలక్ష్యార్థో భవతి. అజ్ఞానాదివ్యష్టిరేతదుపహితాల్పజ్ఞత్వాది విశిష్టచైతన్యమేతదనుపహితం చైతత్త్రయం తప్తాయః పిణ్డవదేకత్వేనావభాసమానం త్వమ్పదవాచ్యార్థో భవతి. ఏతదుపాధ్యుపహితాధారభూతమనుపహితం ప్రత్యగానన్దం తురీయం చైతన్యం త్వమ్పదలక్ష్యార్థో భవతి.**

అను.వా॥ ఈ అధ్యారోప, అపవాదములద్వారా 'తత్', 'త్వమ్' పదాల అర్థాన్ని కూడా శోధించడం సాధ్యమవుతుంది. అది ఎలాగంటే –

అజ్ఞానాది సమష్టి, ఈ అజ్ఞానసమష్టిచేత ఆవరించబడి సర్వజ్ఞత్వం కలిగిన, సర్వజ్ఞుడుగా చెప్పబడే చైతన్యమూ, అజ్ఞానాదిసమష్టిచేత ఆవరించబడని అనుపహితచైతన్యమూ – ఈ మూడూ కలిసి తప్తాయః పిండం (కాలుతున్న ఇనుపగోళం) వలె (ఇనుపగోళం+అందులోని అగ్ని+అగ్నిమాత్రంగా) ఒకటిగా అనిపించినపుడు 'తత్' అనే పదానికి వాచ్యార్థం. ఈ ఉపాధికి (ఆవరణకు) ఆధారమైన అనుపహిత చైతన్యం 'తత్' పదము యొక్క లక్ష్యార్థం అవుతుంది.

1. అజ్ఞానాది వ్యష్టి
2. అజ్ఞానంచేత ఆవరించబడి అల్పజ్ఞత్వం కలిగి అల్పజ్ఞుడుగా చెప్పబడే చైతన్యమూ,
3. అజ్ఞానవ్యష్టిచేత ఆవరించబడని చైతన్యమూ – ఈ మూడు కలిసి ఒకటిగా భాసించినపుడు 'త్వమ్' అనే పదముయొక్క వాచ్యార్థం అవుతుంది.

ఈ ఉపాధికి (ఆవరణకు) ఆధారభూతమైన అనుపహితమైన ప్రత్యక్ (ఆత్మ) ఆనందమైన తురీయచైతన్యం 'త్వమ్' పదంయొక్క లక్ష్యార్థం అవుతుంది.

వి॥ 'తత్త్వమసి' అనేది వేదాంతంలో ఒక మహావాక్యం. ఈ వాక్యంలో 'తత్ అనే పదం చేత చెప్పబడేదానికి, 'త్వమ్' అనే పదంచేత చెప్పబడేదానికి



ఐక్యం చెప్పబడింది. 'తత్ త్వం అసి' అంటే 'అది నీవు అయి ఉన్నావు' అని అర్థం. అయితే వాచ్యార్థం ద్వారా 'తత్' అనే ప్రథమపురుషలో చెప్పబడేదానికీ, 'త్వమ్' అని మధ్యమపురుషలో చెప్పబడేదానికీ ఐక్యం కుదరదు. అది కేవలం లక్ష్యార్థం ద్వారానే సిద్ధిస్తుంది. ఈ విధంగా 'తత్ త్వం అసి' అని తెలుసుకున్న సాధకునికి 'అహం బ్రహ్మాస్మి' అన్న భావన కలుగుతుంది.

అజ్ఞానాది సమష్టి, తదుపహితచైతన్యం అన్నపుడు సర్వజ్ఞత్వం కలిగిన హిరణ్యగర్భ, విరాట్‌లను గ్రహించాలి.

అజ్ఞానాది వ్యష్టి, తదుపహితచైతన్యం అన్నపుడు అల్పజ్ఞత్వం కలిగిన ఈశ్వరుడూ, సూక్ష్మ–స్థూలశరీరాలూ గ్రహించాలి.

ఈ విధంగా –A–1. అజ్ఞానసమష్టి, 2. తదుపహితచైతన్యం, 3. అనుపహితచైతన్యం – ఈ మూడూ ఒక త్రికంగా ఏర్పడతాయి.

B–1. అజ్ఞానవ్యష్టి, 2. తదుపహితచైతన్యం – ఈ మూడూ ఒక త్రికంగా ఏర్పడతాయి.

పైవాటిలో అవి త్రికంగా మూడూ ఒక్కటిగా 'మండుతున్న ఇనుపగోళంలో భాసించినట్లుగా' భాసించినపుడు శుద్ధచైతన్యానికీ మిగతా రెండింటికీ మధ్యభేదం తెలియదు.

ఇనుపగోళం + అగ్ని + తాపం.

అగ్నిదూరం కాగానే, అగ్ని, తాపం రెండూ తొలగిపోయి 'ఇనుపగోళం' మాత్రం మిగులుతుంది. అపుడు ఇంతవరకూ కాలుతున్నది. ఇనుపగోళం కాదనీ, అది అగ్ని అనీ, అగ్ని యొక్క 'తాపం' అనే ధర్మం ఇనుపగోళం పై ఆరోపించబడిందనీ తెలుస్తుంది.

ఇలాంటి అనుభవమే బ్రహ్మను గూర్చి తెలుసుకోవాలన్న సాధకునికి క్రమేణ కలుగుతుంది. మొదట సాధకునికి అంతా ఒకటిగానే (పైన ప్రదర్శించినట్లుగా) భాసిస్తుంది. శోధనలో వాటిభేదం తెలిసి శుద్ధ బ్రహ్మతత్త్వం తెలుస్తుంది.

ఇపుడు 'తత్త్వమసి' అనే మహావాక్యం యొక్క అర్థాన్ని వివరించబోతున్నాడు.

**మూ॥ అథ మహావాక్యార్థో వర్ణ్యతే. ఇదం తత్త్వమసీతి వాక్యం సమ్బన్ధత్రయేణాఖణ్డార్థబోధకం భవతి. సమ్బన్ధత్రయం నామ పదయోః సామానాధికరణ్యం. పదార్థయోర్విశేషణవిశేష్యభావః, ప్రత్యగాత్మలక్షణయోర్లక్ష్యలక్షణభావశ్చేతి. తదుక్తమ్ –**

**“సామానాధికరణ్యం చ విశేషణవిశేష్యతా,**
**లక్ష్యలక్షణసమ్బన్ధః పదార్థప్రత్యగాత్మనామ్” ఇతి.**

**సామానాధికరణ్యసమ్బన్ధస్తావద్యథా 'సోఽయం దేవదత్త' ఇత్యస్మిన్ వాక్యే తత్కాలవిశిష్టదేవదత్తవాచకసశబ్దస్యైతత్కాల విశిష్ట దేవదత్తవాచకాయం శబ్దస్య చైకస్మిన్పిణ్డే తాత్పర్యసమ్బన్ధః. తథా చ తత్త్వమసీతి వాక్యేఽపి పరోక్షత్వాది విశిష్టచైతన్యవాచకతత్పదస్యాపరోక్షత్వాదివిశిష్టచైతన్య వాచకత్వమ్పదస్య చైకస్మింశ్చైతన్యే తాత్పర్యసమ్బన్ధః.**

**విశేషణవిశేష్యభావసమ్బన్ధస్తు యథా తత్రైవ వాక్యే సశబ్దార్థ తత్కాలవిశిష్టదేవదత్తస్యాయం శబ్దార్థైతత్కాలవిశిష్టదేవదత్తస్య చాన్యోన్యభేదవ్యావర్తకతయా విశేషణవిశేష్యభావః. తథాత్రాపి వాక్యే తత్పదార్థపరోక్షత్వాదివిశిష్టచైతన్యస్య త్వమ్పదార్థాపరోక్షత్వాదివిశిష్ట చైతన్యస్య చాన్యోన్యభేదవ్యావర్తకతయా విశేషణవిశేష్యభావః.**

**లక్ష్యలక్షణసమ్బన్ధస్తు యథా తత్రైవ వాక్యే సశబ్దాయం శబ్దయోస్తదర్థయోర్వా విరుద్ధతత్కాలైతత్కాలవిశిష్టత్వపరిత్యాగేనావిరుద్ధదేవదత్తేన సహ లక్ష్యలక్షణభావః. తథాత్రాపి వాక్యే తత్త్వమ్పదయోస్తదర్థయోర్వా విరుద్ధపరోక్షత్వాపరోక్షత్వాదివిశిష్టత్వపరిత్యాగేనావిరుద్ధచైతన్యేన సహ లక్ష్యలక్షణభావః. ఇయమేవ భాగలక్షణేత్యుచ్యతే. 23**



అను.వా॥ ఇప్పుడు మహావాక్యార్థం వర్ణించబడుతూంది. ఈ 'తత్త్వమసి' అనే వాక్యం మూడువిధాలైన సంబంధాలచేత అఖండార్థాన్ని బోధిస్తుంది.

అవి – 1. పదములయొక్క సామానాధికరణ్యసంబంధం.

2. పదార్థాలవిశేషణవిశేష్యభావసంబంధం.

3. ప్రత్యగాత్మలక్షణల మధ్యనున్న లక్ష్యలక్షణసంబంధం.

తత్ అనే పదం, 'త్వం' అనే పదం ఒకే అర్థాన్ని బోధిస్తున్నాయి. కనుక ఈ రెండు పదాలకూ సామానాధికరణ్యం ఉంది. రెండు పదాలయొక్క అర్థాల్లో విశేషణవిశేష్యభావం ఎలాగంటే 'తత్' ఆ కాలంలో ఉన్నదాన్ని అనగా ఎదుటలేనిదాన్ని గూర్చి చెప్పేది. 'త్వం' ఈ కాలంలో ఉన్నదాన్ని అనగా ఎదుట ఉన్నదాన్ని గూర్చి చెప్పేది. ఈ రెండింటికీ విశేష్యభావసంబంధం ఉంది.

ప్రత్యగాత్మ లక్ష్యం, తత్, త్వం రెండు పదాలలో లక్షణ ఉంది. అనగా ఇవి లక్షింపచేసే పదాలు.

పదపదార్థముతో ప్రత్యగాత్మకు గల సంబంధం మూడువిధాలని ఇలా చెప్పారు. ''పదార్థప్రత్యగాత్మలకు గల సంబంధం సామానాధికరణ్యం, విశేషణవిశేష్యత మరియు లక్ష్యలక్షణసంబంధం.''

సామానాధికరణ్యమనగా ''భిన్నవృత్తినిమిత్తానాం శబ్దానామేకస్మిన్నర్థే తాత్పర్యసమ్బన్ధః సామానాధికరణ్యమ్.'' వేరువేరువృత్తులకై ఉన్న శబ్దాలు తాత్పర్యసంబంధంతో ఒకే అర్థాన్ని చెప్పినపుడు అది సామానాధికరణ్యం.

ఈ సామానాధికరణ్యసంబంధం ఇలా వుంటుంది. సోఽయం దేవదత్తః 'అతడే ఈ దేవదత్తుడు' అన్న వాక్యంలో 'స' అనే శబ్దం తత్కాల, తద్దేశ (అప్పుడు, అక్కడ ఉన్న) విశిష్టుడైన దేవదత్తుని గూర్చి చెప్పే వాచకశబ్దం. 'అయం' అనేది ఏతత్కాల, ఏతద్దేశ (ఇప్పుడు, ఇక్కడ ఉన్న) విశిష్టుడైన దేవదత్తుని గూర్చి చెప్పే వాచక శబ్దం. ఈ విధంగా యీ రెండు పదాలూ తత్పరములు, అనగా దేవదత్తుని

గూర్చే చెప్తున్నాయి. అందుచేత రెంటికీ తాత్పర్యార్థం దేవదత్తుడే. ఇలా చెప్పటంలో రెండూ ఆయా కాలాలకు, ఆయా దేశాలకు గల భేదాన్ని వదలి దేవదత్తుని గూర్చే చెప్తూన్నాయి. ఇదే విధంగా 'తత్త్వమసి' అనే వాక్యంలో కూడా 'తత్' అనే పదం అపరోక్షంగా ఉన్న చైతన్యం గూర్చి చెపుతున్నాయి. ఈ రెండింటియొక్క తాత్పర్యం పరోక్ష, అపరోక్షత్వాలు లేని చైతన్యంలోనే. ఈ విధంగా 'తత్ త్వం' పదాలకు సామానాధికరణసంబంధం చెప్పబడింది.

ఇక **విశేషణవిశేష్యభావసంబంధం** – అదే వాక్యం (సోऽయం దేవదత్త) లో 'సః' శబ్దానికి అర్థం తత్కాలవిశిష్టుడైన దేవదత్తుడు అని, 'అయం' శబ్దానికి అర్థం ఏతత్కాలవిశిష్టుడైన దేవదత్తుడితడు అని. ఈ రెండుఅర్థాలూ పరస్పరభేదాన్ని తొలగించివేసేవి కనుక యీ రెండూ పరస్పరం విశేషణవిశేష్యభావసంబంధాన్ని కలిగి ఉన్నాయి. ఇదే విధంగా 'తత్త్వమసి' వాక్యంలో కూడా 'తత్' పదానికి అర్థం పరోక్షత్వం మొదలైన విశేషాలు కలిగిన చైతన్యం. 'త్వం' పదానికి అర్థం అపరోక్షత్వం మొదలైన విశేషాలు కలిగిన చైతన్యం. ఈ విధంగా అన్యోన్యభేదం తొలగించుకోవటం వలన యీ రెండింటికీ విశేషణవిశేష్యభావసంబంధం.

**లక్ష్యలక్షణసంబంధం** – అదే 'సోऽయం దేవదత్తః' అనే వాక్యంలో 'స' శబ్దానికీ 'అయం' శబ్దానికీ, వాటి అర్థలకూ విరుద్ధమైన తత్కాల, ఏతత్కాల విశిష్టత్వాన్ని వదలివేయగా మిగిలిన అవిరుద్ధమైన (రెండు సందర్భాల్లోనూ దేవదత్తుడై) దేవదత్తునికీ గల సంబంధం లక్ష్యలక్షణభావం. అలాగే 'తత్త్వమసి' వాక్యంలో కూడా 'తత్ త్వం పదాలకూ, వాటి అర్థాలకూ, విరుద్ధములైన పరోక్షత్వ, అపరోక్షత్వాదులను వదిలివేసి, అవిరుద్ధమైన చైతన్యంలో గల సంబంధం లక్ష్యలక్షణభావం. ఈ లక్షణమే 'భాగలక్షణ' అని అనబడుతుంది.

వి॥ అద్వైతవేదాంతంలో 'తత్త్వమసి' అనే వాక్యాన్ని మహావాక్యం అంటారు. భిన్నార్థకాలైన రెండు 'తత్', 'త్వం' అనే పదాలు బోధించే వాటికీ ఐక్యం చెప్పి ఒక అఖండార్థాన్ని బోధించే వాక్యం ఇది. ఈ వాక్యం ద్వారా ముముక్షువుకు జీవబ్రహ్మల ఐక్యం బోధించబడుతుంది. పైన ఉదాహరించిన 'సోऽయం దేవదత్తః' అనే వాక్యంతో 'స' అనే పదం 'అతడు' అని ఎదుటలేని వ్యక్తిని



గూర్చి బోధిస్తుంది. అతీతకాలం, దూరంగా ఉండటం అనేవి 'స' అనే పదానికి సంబంధించినవి కాగా 'అయం' అన్నపుడు 'వర్తమానకాలంలో ఎదుట ఉన్న వ్యక్తి' అనే అర్థం ఎదుట ఉన్న దేవదత్తుణ్ణి గూర్చి చెబుతుంది. ఒకే దేవదత్తుణ్ణి గూర్చి చెప్పటం వల్ల యీ రెండు పదాలకీ సామానాధికరణ్యం అని చెప్పబడింది.

ఇక రెండింటికీ గల విశేషణవిశేష్యభావం ఎలాగంటే 'స' అనే శబ్దంతో 'అయం' శబ్దం సంబంధిస్తూన్నది గాన 'అయం' విశేషణం, 'స' విశేష్యం.

లక్ష్యలక్షణలో భాగలక్షణను గూర్చి ప్రస్తావించటం జరిగింది. లక్షణయొక్క స్వరూపం మూడు విధాలుగా ఉంటుంది. అవి – 1. జహల్లక్షణ 2. అజహల్లక్షణ, 3. భాగలక్షణ.

వాచ్యార్థాన్ని పూర్తిగా త్యజించి ఆ వాచ్యార్థంతో సంబంధం ఉన్న మరొక అర్థాన్ని గ్రహించటం జహల్లక్షణ. ('జహద్' అనగా వదలివేయుట).

వాచ్యార్థం త్యజించకుండానే దాంతో సంబంధం కలిగి ఉన్న మరొక అర్థాన్ని గ్రహించటం 'అజహల్లక్షణ'.

వాచ్యార్థంలో కొంత గ్రహించి కొంత త్యజించి ఆ వాచ్యార్థంలో సంబంధం వున్న మరొక అర్థాన్ని గ్రహించటం జహదజహల్లక్షణ.

మొదటదానికి ఉదాహరణంగా– 'గంగాయాం ఘోషః' అనే వాక్యం. 'గంగలో గొల్లపల్లె' అని ఈ వాక్యానికి అర్థం. 'గంగ' అనే పదానికి వాచ్యార్థం 'గంగానది' అంటే గంగా ప్రవాహం. అయితే ప్రవాహంలో పల్లె ఉండడం సంభవం కాదు కనుక ఈ అర్థానికి దగ్గర సంబంధం ఉన్న మరో అర్థం లక్షితమవుతుంది. అది 'గంగాతీరం'. ప్రవాహం అనే అర్థం పూర్తిగా వదలివేయబడి 'తీరం' అనే అర్థం గ్రహించబడింది. కనుక ఇది జహల్లక్షణ.

ఇక రెండవదైన అజహల్లక్షణకు ఉదాహరణ – 'కున్తాః ప్రవిశన్తి' అనే వాక్యం. కుంతములు (ఒక రకమైన ఆయుధాలు) ప్రవేశిస్తున్నాయి అని ఈ వాక్యానికి వాచ్యార్థం. అయితే అచేతనాలైన ఆయుధాలు స్వయంగా ప్రవేశించలేవు. కనుక వాటిని ధరించినవారు ప్రవేశిస్తునారు అని వాచ్యార్థంతో

సమీపసంబంధం ఉన్న మరొక అర్థం లక్షితమవుతుంది. అందుచేత "కున్తధారిణః పురుషాః ప్రవిశన్తి" అని లక్షణద్వారా అర్థం అవుతుంది. ఈ వాక్యంలో వాచ్యార్థంలో చెప్పబడిన 'కుంతలు' గూడా గ్రహించబడినాయి. కనుక ఇది అజహల్లక్షణ.

ఈ రెండింటినీ క్రమంగా లక్షణలక్షణ, ఉపాదానలక్షణ అని అలంకార శాస్త్రంలో వ్యవహరిస్తారు.

ఇక భాగలక్షణ వివరించబడుతుంది – ఇంతవరకూ చర్చించిన 'సోఽయం దేవదత్తః', 'తత్త్వమసి' వాక్యాలలో తత్కాల, ఏతత్కాల విశిష్టతను, సర్వజ్ఞత్వ, కించిజ్ఞత్వాదులను త్యజించి 'దేవదత్త', 'చైతన్యాల'ను గ్రహించడం 'భాగలక్షణ'.

**మూ॥ అస్మిన్వాక్యే నీలముత్పలమితి వాక్యవద్వాక్యార్థో న సఙ్గచ్ఛతే. తత్ర తు నీలపదార్థనీలగుణస్యోత్పలపదార్థోత్పలద్రవ్యస్య చ శౌక్లపటాదిభేదవ్యావర్తకతయాన్యోన్యవిశేష్యభావసంసర్గస్యాన్యతర విశిష్టస్యాన్యతరస్య తదైక్యస్య వా వాక్యార్థత్వాఙ్గీకారే ప్రమాణాన్తర విరోధాభావాత్తద్వాక్యార్థః సఙ్గచ్ఛతే. అత్ర తు తదర్థపరోక్షత్వాది విశిష్టచైతన్యస్య త్వమర్థాపరోక్షత్వాదివిశిష్టచైతన్యస్య చాన్యోన్యభేద వ్యావర్తకతయా విశేషణవిశేష్యభావసంసర్గస్యాన్యతరవిశిష్టస్యాన్యతరస్య తదైక్యస్య చ వాక్యార్థత్వాఙ్గీకారే ప్రత్యక్షాదిప్రమాణవిరోధాద్వాక్యార్థో న సఙ్గచ్ఛతే. తదుక్తమ్ –**

**'సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః,**

**అఖణ్డైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః' ఇతి.**

**–పఞ్చదశి 24**

అను.వా॥'తత్త్వమసి' అనే మహావాక్యం 'తత్ త్వం' పదాలకు విశేషణవిశేష్యాది సంబంధాల అన్వయంతో అఖండార్థం సిద్ధిస్తుంది అని ఇంతవరకూ చెప్పి ఇప్పుడు ఆ విశేషణవిశేష్యసంబంధాలు లోకవ్యవహారంలో ఉన్న 'నీలముత్పలమ్' ఇత్యాదుల సంబంధంకంటె ఎలా భిన్నమో వివరిస్తున్నాడు.



ఈ వాక్యంలో 'నీలముత్పలమ్' అనే వాక్యంలో వలె వాక్యార్థం పొసగదు. ఆ వాక్యంలో 'నీల' మనే పదానికి అర్థం 'నీలం' అనే గుణం. 'ఉత్పలం' అనే పదానికి అర్థం 'ఉత్పలం' అనే ద్రవ్యం. 'నీలగుణం' ఉత్పలంలో శుక్లాదిగుణాలను తొలగించివేస్తుంది. అలాగే 'ఉత్పలం' అన్నపుడు ఘటాదులు తొలగించి వేయబడతాయి. ఇక్కడ 'నీలం' అనేది గుణం. అదే ఉత్పలానికీ ఉన్న సంసర్గం వల్ల నీలవిశిష్టమైన ఉత్పలం అని చెప్పవచ్చు. ఈ విధంగా గుణ, గుణిలయందు గల అభేదం చేత 'నీల' శబ్దంయొక్క వాచ్యార్థం, ఉత్పలశబ్దంయొక్క వాచ్యార్థం ఐక్యాన్ని పొందవచ్చు. ఈ విధమైన అర్థాన్ని గ్రహించడంలో ఏ ప్రమాణంతోనూ విరోధం లేదు. 'తత్త్వమసి' అన్న వాక్యంలో మాత్రం ఈ రకమైన అర్థం పొసగదు. అందుచేతనంటే 'తత్' అనే పదం పరోక్షత్వాదులతో కూడిన (విశిష్ట) చైతన్యాన్నీ 'త్వం' అనే పదం అపరోక్షత్వాదులతో కూడిన చైతన్యాన్నీ బోధిస్తాయి. ఈ రెండూ పరస్పరం తమలోని భేదాన్ని తొలగించటం చేత అభిన్నార్థం వాటికి తాత్పర్యం సిద్ధిస్తుంది. వీటితో గల విశేషణవిశేష్యభావం 'నీలముత్పలం'లో వలె సంసర్గం (ఒకదానితో ఒకటి కలిసిపోయినది) కాదు. అందుచేత ఈ సంబంధం విషయంలో ప్రత్యక్షాదిప్రమాణాలకు విరోధం ఉండే అవకాశం ఉంది. ఎందుచేతనంటే – 'తత్' గుణం కాదు. త్వత్, త్వం రెండూ కూడా ద్రవ్యాలే. ఈ రెంటికీ సంసర్గం కుదరదు. అయితే విద్వాంసులకు మాత్రం ఈ రెండు పదాలకూ సంసర్గం ఉందనీ కానీ, లేదా ఒకదానితో ఒకటి కలిసి (విశిష్టమై) ఉన్నాయని గానీ అంగీకార్యం కాదు. ఈ వాక్యానికి అర్థం 'అఖండమైన ఏకరూపమైన చైతన్యం' అని మాత్రమే వాళ్ల అభిప్రాయం.

వి॥ 'త్వత్ త్వం' పదాలకు విశేషణవిశేష్యభావసంబంధమే కాక ఇతరసంబంధాలు కూడా ఎలా పొసగవో వ్యాఖ్యానకారుడు ఇలా వివరించాడు.

1. 'తత్ త్వం' పదాల అర్థాలకు 'నీలోత్పలంలో వలె' 'గుణగుణి' భావం కుదరదు. ఎందుచేతనంటే ఆ రెండూ ద్రవ్యాలే.

2. ఈ 'తత్ త్వం' పదాల అర్థం చేతన్యం కనుక అది నిత్యమూ, మార్పులేదనిదీ అవటంచేత కుండలాలకూ, సువర్ణానికీ ఉన్నట్లుగా కార్యకారణభావసంబంధం కూడా కుదరదు.

3. ఇవి నిరవయవపదార్థాన్ని బోధిస్తున్నాయి. కనుక వీటికి భూమి, ఊషరక్షేత్రాలవలె ఆంశాంశి (అంగాంగి) భావం కూడా కుదరదు.

4. బాణాదులవలె వీటికి క్రియ, క్రియావాన్ అనే సంబంధం కూడా కుదరదు. ఎందుచేతనంటె ఇవి బోధించేది నిష్క్రియాత్మకమైన చైతన్యం.

5. వీటికి గల ద్రవ్యత్వం వలన వీటికి గోత్వ, శాబలేయాలకు వలె జాతి, వ్యక్తి సంబంధం కూడా కుదరదు.

6. అందుచేత విశేషణవిశేష్యభావం కూడా కుదరదు.

వస్తుతః ఇది "త్వమిన్ద్రోసి" నీవు ఇంద్రుడవు అన్నట్లుగా స్తుతివాక్యం కాదు. స్తుతివాక్యం పదేపదే చెప్పబడదు కనుక

ఇది 'అర్థవాదం' కూడా కాదు. ఈ ప్రకరణంలో ఏ ప్రధానవాక్యమూ లేదు. ఉండి ఉంటే దీన్ని అర్థవాదమని చెప్పుకోవచ్చును.

ఒక వాక్యంలో చెప్పిన విషయాలను ప్రశంసించే వాక్యాలను అర్థవాద వాక్యాలు అంటారు. వేదాలతో విధిని గూర్చి చెప్పేవాక్యాలను విధివాక్యాలు అనీ, ఆ విధి (ఆప్రక్రియ) చేయడం వలన కలిగే ఫలితాలను గూర్చి చెప్పేవాక్యాలను అర్థవాదవాక్యాలనీ అంటారు).

పోనీ రాజోద్యోగి వెళ్తుంటే 'రాజు వెళుతున్నాడు' అని ఔపచారికంగా చెప్పటమా అంటే అది కుదరదు. భేదమే లేని వాటికి 'ఉపచారం' ఎలా కుదురుతుంది? ఇక్కడ విపర్యయం కానీ, సంశయం కానీ కుదరదు. ఎందుచేతనంటే శ్రుతి తానే ప్రమాణము. అందుచేత 'తత్త్వమసి' మొదలైన వాక్యాలు అఖండార్థాన్ని బోధిస్తాయి. కార్యకరణసంబంధం వీటితో పొసగదు. సామానాధికరణ్యం కలిగిన 'సోऽయం దేవదత్తః' వాక్యం వంటిదే ఇది కూడా.



ఈ విధంగా అఖండార్థం చెప్పటం వాచ్యార్థానికి సంబంధించినంతవరకూ కుదరదు కనుక లక్షణద్వారానే అఖండార్థం చెప్పాల్సివస్తుంది.

**మూ॥ అత్ర 'గఙ్గాయాం ఘోషః' ప్రతివసతీతి వాక్యవజ్జహల్లక్షణాపి న సఙ్గచ్ఛతే. తత్ర తు గఙ్గాఘోషయోరాధారాధేయభావలక్షణస్య వాక్యార్థస్యాశేషతో విరుద్ధత్వాద్వాక్యార్థమశేషతః పరిత్యజ్య తత్సమ్బన్ధి తీరలక్షణాయా యుక్తత్వాజ్జహల్లక్షణా సఙ్గచ్ఛతే. అత్ర తు పరోక్షాపరోక్ష చైతన్యైకత్వలక్షణస్య వాక్యార్థస్య భాగమాత్రే విరోధాద్భాగాన్తరమపి పరిత్యజ్యాన్యలక్షణాయా అయుక్తత్వాజ్జహల్లక్షణా న సంగచ్ఛతే. న చ గఙ్గాపదం స్వార్థపరిత్యాగేన తీరపదార్థం యథా లక్షయతి తథా తత్పదం త్వమ్పదం వా స్వార్థపరిత్యాగేన త్వమ్పదార్థం తత్పదార్థం వా లక్షయత్వతః కుతో జహల్లక్షణా న సఙ్గచ్ఛత ఇతి వాచ్యమ్. తత్ర తీరపదాశ్రవణేన తదర్థా ప్రతీతా లక్షణయా తత్ప్రతీత్యపేక్షయామపి తత్త్వమ్పదయోః శ్రూయమాణత్వేన తదర్థప్రతీతౌ లక్షణయా పునరన్యతరపదేనాన్యతరపదార్థప్రతీత్యపేక్షాభావాత్. 25**

అను.వా॥'గంగాయాం ఘోషః' అనే వాక్యానికి 'గంగయందు' గొల్లపల్లె ఉన్నది అని అర్థం. 'గంగ' అనగా గంగానది అని అర్థం కదా. అలాంటప్పుడు నదియందు పల్లె ఉండడం అసంభవం కనుక 'గంగ' పదాన్ని దానితో సంబంధం ఉన్న 'గంగాతీరం' అనే అర్థం లక్షణద్వారా గ్రహించాల్సి వస్తుంది. గంగాప్రవాహానికీ, గొల్లపల్లెకూ ఆధారఆధేయభావసంబంధం వాచ్యార్థంలో విరోధాన్ని సూచిస్తుంది. అందుచేత లక్షణద్వారా మాత్రమే అర్థం గ్రహించాల్సి ఉంది. గంగాశబ్దం ప్రవాహార్థాన్ని పూర్తిగా విడిచిపెట్టి, 'తీరం' అనే అర్థాన్ని లక్షింపచేసింది. ఈ విధంగా ఇక్కడ జహల్లక్షణ వర్తింపచేయాలంటే కుదరదు. ఎందుచేతనంటే గంగకీ, గొల్లపల్లెకూ ఉన్నట్టుగా వాచ్యార్థం అనన్వయం (విరోధం) యీ 'తత్త్వమసి' లోని 'తత్', త్వం పదాలలో లేదు. ఇక్కడ ఉన్న విరోధమంతా చైతన్యంయొక్క పరోక్షత్వ-అపరోక్షత్వాలకు మాత్రమే. ఈ పరోక్ష-అపరోక్షచైతన్యాలకు

ఐక్యం చెప్పటానికి కేవలం ఒక భాగంలోనే విరోధం ఉంది. అందుచేత విరోధంలేని భాగంకూడా ఇందులో చేర్చుకొని మొత్తం వాచ్యార్థాన్ని వదలిపెట్టి జహల్లక్షణద్వారా మరో అర్థం చెప్పటం కుదరదు. అలా కాదు గంగాపదం ఏ విధంగానైతే తనకుగల 'ప్రవాహమనే' అర్థాన్ని విడిచిపెట్టి తీరమనే అర్థాన్ని లక్షింపచేసిందో అలాగే తత్పదం కానీ, త్వం పదం కానీ తమయొక్క అర్థాల్ని వదలిపెట్టి తత్ పదం 'త్వం' పదం యొక్క అర్థాన్నిగానీ, త్వంపదం 'త్వత్' పదం యొక్క అర్థాన్ని గానీ లక్షింపచేస్తుంది కదా అని ఆశంక కలుగవచ్చు. కానీ అలా కుదరదు. 'గంగాయాం ఘోషః' అనే వాక్యంలో 'తీర' మనే పదం వినబడటంలేదు. లక్షణద్వారా తీరమనే అర్థం మాత్రమే గ్రహించబడుతుంది. తత్, త్వం పదాలు వినటంతోనే వాటి యొక్క అర్థ ప్రతీతి కూడా కలుగుతూంది. అందుచేత వాటి అర్థం కోసం మరోపదమూ, దానియొక్క అర్థమూ అవసరం లేదు.

వి॥ 'తత్త్వమసి' వాక్యంలో జహల్లక్షణ ఎలా కుదరదో వివరిస్తున్నాడు. వాచ్యార్థంలో అన్వయం పొసగనపుడు లక్షణద్వారా అర్థం గ్రహించాల్సి ఉంటుంది. లక్షణ చెప్పుకోవటానికి ముఖ్యంగా రెండు ఉండాలి. ఒకొటి – ముఖ్యార్థబాధ. వాక్యంలోని పదాలతో అర్థం సరిగా కుదరకపోవటం. రెండు – అలా అర్థం కుదరని పదానికి మరో అర్థంతో సంబంధం ఉండటం.

"ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్"

అని 'లక్షణ' స్వరూపం చెప్పబడింది. పైన ఉదాహరించబడిన 'గంగాయాం ......' వాక్యంలో గంగాపదానికి ప్రవాహమనే అర్థం గ్రహించినపుడు అది పల్లెకు ఆధారంగా ఉండడం కుదరదు. నీటిమీద గ్రామం నిలువదు. అయితే ఆ పదానికి దగ్గరగా ఉండే మరో అర్థం తీరం. అందుచేత ఇక్కడ ముఖ్యార్థం పొసగకపోవటం, ముఖ్యార్థంతో సంబంధంగల మరోక అర్థం చెప్పుకొనే అవకాశం ఉంది. 'తత్త్వమసి' వాక్యంలో తత్ పదానికీ, త్వం పదానికీ అర్థం చెప్పుకోవటంలో అన్వయం లేదు. ఆ రెండూ ఒకటే అని చెప్పాలంటే మాత్రం



వాటికి గల పరోక్షత్వం, అపరోక్షత్వం అనే విశేషణాలకు గల విరోధం అడ్డుగా నిలూస్తుంది.

తత్ అనగా పరోక్షచైతన్యం

త్వం అనగా అపరోక్షచైతన్యం.

ఈ రెంటిలో ఉన్న చైతన్యం ఒక్కటే. వాటి విశేషణాలు వేరు. ఈ వాక్యాల్లో తత్, త్వం అనే పదాలయొక్క అర్థాల్ని వదలిపెట్టి మరో అర్థం గ్రహించాల్సిన అవకాశం లేదు. ఆ రెండింటి అర్థం స్పష్టంగా తెలుస్తూంది. పోనీ విరుద్ధంగా ఉన్న విశేషణాల్ని వదలిపెట్టి అర్థం చెప్పాలన్నా కుదరదు. ఈ విధంగా మొత్తం వాచ్యార్థాన్ని వదిలి మరో అర్థని చెప్పడం కుదరదు కనుక ఇక్కడ జహలక్షణ పొసగదు.

**మూ॥ అత్ర శోణో ధావతీతి వాక్యవదజహల్లక్షణాపి న సమ్భవతి. తత్ర శోణగుణగమనలక్షణస్య వాక్యార్థస్య విరుద్ధత్వాత్తదపరిత్యాగేన తదాశ్రయాశ్వాదిలక్షణయా తద్విరోధపరిహారసమ్భవదజహల్లక్షణా సమ్భవతి. అత్ర తు పరోక్షాపరోక్షత్వాదివిశిష్టచైతన్యైకత్వస్య విరుద్ధత్వాత్తదపరిత్యాగేన తత్సమ్బన్ధినో యస్య కస్యచిదర్థస్య లక్షితత్వేఽపి తద్విరోధపరిహారాసమ్భవాదజహల్లక్షణా స సమ్భవత్యేవ. న చ తత్పదం త్వమ్పదం వా స్వార్థవిరుద్ధాంశపరిత్యాగేనాంశాన్తరసహితం త్వమ్పదార్థం తత్పదార్థం వా లక్షయత్వతః కథం ప్రకారాన్తరేణ భాగలక్షణాఙ్గీకరణమితి వాచ్యమ్. ఏకేన పదేన స్వార్థాంశ పదార్థాన్తరోభయలక్షణాయా అసమ్భవాత్పదాన్తరేణ తదర్థప్రతీతౌ లక్షణయా పునస్తత్ప్రతీత్యపేక్షాభావాచ్చ. 26**

అను.వా॥ అజహల్లక్షణ కూడా ఎలా పొసగదో వివరిస్తున్నాడు. 'శోణో ధావతి' అనే వాక్యానికి చెప్పుకున్నట్లుగా అజహల్లక్షణద్వారా అర్థం చెప్పుకోవటం 'తత్త్వమసి' వాక్యవిషయంలో కుదరదు. 'శోణో ధావతి' (ఎరుపు పరుగెత్తుచున్నది) అనే వాక్యంలో 'శోణ'ము గుణము. గుణం (ఎరుపురంగు) పరుగెత్తడం అనేది సంభవం కాదు కాబట్టి ఆ 'గుణం'

దేనికైతే చెందిందో దాన్ని అనగా అశ్వాన్ని లక్షణద్వారా గ్రహించి 'అశ్వం పరుగెత్తుచున్నది' అనే వాక్యార్థం చెప్పటం అజహల్లక్షణద్వారా సంభవమౌతుంది. 'ఎరుపురంగు'ను పూర్తిగా వదలివేయకుండా 'ఎర్రని అశ్వం పరుగెత్తుతూంది' అనే అర్థం కుదురుతుంది. 'శోణ' అనే పదాన్ని త్యజించకపోవటం చేత ఇది అజహలక్షణ (దీన్నే శాస్త్రాంతరంలో ఉపాదానలక్షణ అని అంటారు). అయితే పై విధంగా అజహలక్షణ చెప్పటం 'తత్త్వమసి' వాక్యం విషయంలో కుదరదు. ఈ తత్త్వమసి వాక్యంలో పరోక్షత్వవిశిష్ట చైతన్యం, అపరోక్షత్వవిశిష్టచైతన్యం రెంటికీ ఐక్యం అనగా రెండూ ఒకటే అని చెప్పడం ప్రధానాంశం. ఈ రెండూ (పరోక్షత్వ, అపరోక్షత్వాదులు) పరస్పరవిరుద్ధాలు. వాటికి ఐక్యం కుదరదు. పోనీ వాటితో కూడిన చైతన్యం ఒక్కటే అని, రెంటిలోనూ ఉంది చేతన్యమే కదా అని ఏదో విధంగా వాటికి సంబంధించిన ఏదో ఒక అర్థాన్ని చెప్పుకున్నప్పటికీ వాటి మధ్యగల విరోధం తొలగిపోదు. "అలా కాదు, తత్పదం లేదా త్వం పదమ్ విరుద్ధాంశమైన పరోక్షత్వ, అపరోక్షత్వాల్ని వదలిపెట్టి ఏదో మరియొక అంశంతో కలిసి తత్ పదము యొక్క అర్థాన్నిగానీ త్వం పదము యొక్క అర్థం కాని చెప్పవచ్చు కదా! మరొక విధంగా భాగలక్షణ అని చెప్పడం ఎందుకు?' అని అంటే అది కుదరదు. ఒకే పదంలో ఆ పదంయొక్క అర్థం (స్వార్థాంశ), మరొయొక పదం యొక్క అర్థం ఉండటానికి వీలులేదు. మరొక పదం చేత ఇక్కడ కావలసిన అర్థాన్ని గ్రహించాలి అంటే అప్పుడు ఆ పదానికి కూడా మళ్ళీ లక్ష్యార్థం చెప్పాల్సివస్తుంది.

వి॥ పరోక్షచైతన్యం, అపరోక్షచైతన్యం రెండూ ఒకటే అని "తత్త్వమసి వాక్యార్థం'' అని ప్రతిపాద్యాంశం. అయితే రెంటితోనూ ఉన్న చైతన్యం పరోక్షత్వము, అపరోక్షత్వము అని విశేషంతో కూడి ఉంది. ఆ విశేషం లేకపోతే రెండూ ఒకటే. ఆ విశేషం ఉంటే మాత్రం రెండూ ఒకటేనని చెప్పడం కుదరదు. అందుచేత మొదట చెప్పిన భాగలక్షణయే "తత్త్వమసి" వాక్యార్థానికి పొసగుతుంది.



**మూ॥ తస్మాద్యథా సోఽయం దేవదత్త ఇతి వాక్యం తదర్థో వా తత్కాలై-తత్కాలవిశిష్టదేవదత్తలక్షణస్య వాక్యార్థస్యాంశే విరోధాద్విరుద్ధ తత్కాలైతత్కాలవిశిష్టత్వాంశం పరిత్యజ్యావిరుద్ధం దేవదత్తాంశమాత్రం లక్షయతి తత్త్వమసీతి వాక్యం తదర్థో వా పరోక్షత్వాపరోక్షత్వాది విశిష్టచైతన్యైకత్వలక్షణస్య వాక్యార్థస్యాంశే విరోధాద్విరుద్ధపరోక్షత్వా పరోక్షత్వాదివిశిష్టత్వాంశం పరిత్యజ్యావిరుద్ధమఖణ్డచైతన్యమాత్రం లక్షయతీతి.**

అను.వా॥ అందుచేత ఏ విధంగానైతే 'సోఽయం దేవదత్తః' అనే వాక్యం లేదా ఆ వాక్యార్థం తత్కాలదేవదత్తుడు, ఏతత్కాలదేవదత్తుడు అని వాక్యార్థంలోని తత్కాల, ఏతత్కాల అంశాలకు విరోధం ఉన్నప్పటికీ, విరోధంలేని దేవదత్తుడనే అంశాన్ని గ్రహించటం జరిగిందో అదే విధంగా "తత్త్వమసి" అనే వాక్యం లేదా ఆ వాక్యార్థం పరోక్షచైతన్యం, అపరోక్షచైతన్యం అనే వాక్యాలకీ ఏకార్థం చెప్పినప్పుడు విరోధం ఉన్న పరోక్ష, అపరోక్ష అనే విశేషణాలను పరిత్యజించి, విరోధం లేని చైతన్యాన్ని మాత్రం గ్రహించి అఖండార్థాన్ని లక్షింపజేస్తుంది.

వి॥ 'సోఽయం దేవదత్తః' అన్నప్పుడు "సః అయం దేవదత్తః' ఆ దేవదత్తుడే ఇతడు అని అర్థం. ఆ దేవదత్తుడు అనగా "తత్కాల" ఆ సమయంలో ఉన్న దేవదత్తుడు అని అర్థం. అలాగే "ఏతత్కాల" అనగా ఈ సమయంలో ఉన్న దేవదత్తుడు. ఈ రెండు వాక్యాల్లో చెప్పబడినది ఒకే దేవదత్తుడిని గురించి. అయితే అతనికి చేర్చబడిన విశేషణాలకు అప్పటి, ఇప్పటి అనే వాటికి విరోధం ఉంది. ఆ విశేషణాల్ని వదిలిపెడితే అర్థం కుదురుతుంది. అందుచేత విరోధం ఉన్న అంశాన్ని వదిలివేసి విరోధం లేని అంశాన్ని తీసుకొని జహదజహల్లక్షణద్వారా రెండు వాక్యాలకీ ఒకే అర్థం చెప్పడం కుదురుతుంది. అదే విధంగా "తత్ త్వం అసి" అనే వాక్యంలో ఉన్న రెండు పదాలు తత్, త్వం. ఒకటి పరోక్షత్వాన్ని, మరొకటి అపరోక్షత్వాన్ని సూచిస్తుంది. ఈ రెంటికీ విరోధం. అయితే రెండింటిలో చెప్పబడిన చైతన్యం అనేది మాత్రం ఒకటే. అందుచేత

"తత్త్వమసి" వాక్యార్థం కూడా పైన చెప్పిప సోఽయం దేవదత్తః వాక్యార్థంలాగా జహదజహల్లక్షనద్వారా అఖండార్థాన్ని లక్షింపజేస్తుంది.

**మూ॥ అథాధునా "అహం బ్రహ్మాస్మి" ఇత్యనుభవవాక్యార్థో వర్ణ్యతే. ఏవమాచార్యేణాధ్యారోపాపవాదపురఃసరం తత్త్వమ్పదార్థౌ శోధయిత్వా వాక్యేనాఖణ్డేఽర్థేవ బోధితేఽధికారిణోఽహం నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావపరమానన్దానన్తాద్వయం బ్రహ్మాస్మీత్యఖణ్డాకారాకారితా చిత్తవృత్తిరుదేతి. సా తు చిత్ప్రతిబింబ సహితా సతీ ప్రత్యగభిన్నమజ్ఞాతం పరంబ్రహ్మ విషయీకృత్య తద్గతాజ్ఞానమేవ బాధతే తదా పటకారణతన్తుదాహే పటదాహవదఖిలకారణేఽజ్ఞానే భాదితే సతి తత్కార్యస్యాఖిలస్య బాధితత్వాత్తదన్తర్భూతాణ్డాకారాకారితా చిత్తవృత్తిరపి బాధితా భవతి. తత్ర ప్రతిబింబితం చైతన్యమపి యథా ప్రభాదిత్యప్రభావభాసనాసమర్థా సతీ తయాభిభూతా భవతి తథా స్వయమ్ప్రకాశమానప్రత్యగభిన్న పరబ్రహ్మావభాసనానర్హతయా తేనావిభూతం సత్స్వోపాధిభూతఖణ్డ చిత్తవృత్తేర్బాధితత్వాత్ దర్పణాభావే ముఖప్రతిబింబస్య ముఖమాత్రత్వవత్ప్రత్యగభిన్నపరబ్రహ్మమాత్రం భవతి. 28**

అను.వా॥ఇంతవరకూ "తత్ త్వం అసి" అని ఆచార్యుడు శిష్యునికి ఏ విధంగా ప్రత్యగాత్మ, పరబ్రహ్మల ఐక్యాన్ని బోధించాడో వివరించి, ఇప్పుడు ఆ భోధనవలన శిష్యునికి "అహం బ్రహ్మాస్మి" అనే అనుభూతి ఎలా కలుగుతుందో వర్ణిస్తున్నాడు.

ఇప్పుడు "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మను అయి ఉన్నాను) అనే అనుభవవాక్యార్థం వర్ణించబడుతుంది. ఇంతవరకూ వివరించినవిదంగా ఆచార్యుడు శిష్యునికి ఆధ్యారోపం, అపవాదం ఈ రెండింటిద్వారా "తత్ త్వం" పదాల అర్థాలను బోధిస్తాడు. అప్పుడు ఆ "తత్త్వమసి" వాక్యం యొక్క అఖండార్థాన్ని అర్థం చేసుకొన్న, జ్ఞానసముపార్జనకు అధికారి అయిన ఆ మనసులో "నిత్యమైన, శుద్ధమైన, జ్ఞానాన్ని పొందిన, బంధాలు లేని,



సత్యస్వరూపం కలిగిన, పరమానందరూపమైన అనంతమైన అద్వితీయమైన బ్రహ్మను నేను" అనే భావం (చిత్వవృత్తి) ఉదయిస్తుంది. అలాంటి చిత్తవృత్తిలో అజ్ఞానం యొక్క ప్రతిబింబం ఉండదు. "చిత్తు" యొక్క అనగా ప్రకాశరూపమైన జ్ఞానంయొక్క, ప్రతిబింబచే ఉంటుంది. అజ్ఞానం బాధితమై (కొట్టుకొని) పోతుంది. అట్టి స్థితిలో ప్రత్యగాత్మతో అభిన్నమైన, అంతవరకు తెలియని పరబ్రహ్మను తెలుసుకోవటం వలన పరబ్రహ్మవిషయమైన అజ్ఞానం తొలగిపోగానే సమస్తకార్యప్రపంచము తొలగిపోతుంది. ఆ చిత్తవృత్తిలో ప్రతిబింబించే చైతన్యం కూడా సూర్యుని ప్రకాశంలో వెలవెలబోయే (వెలుగులుచిమ్మే సామర్థ్యాన్ని కోల్పోయిన) దీపకాంతివలె శుద్ధచైతన్యం చేత కప్పబడిపోతుంది. ఆ విధంగా ఆ చైతన్యం ప్రత్యగాత్మతో అభిన్నమైన పరబ్రహ్మ ప్రకాశంచేత కప్పబడి, తనకు ఉపాధిభూతమైన (ఆవరణగా ఉండిన) అఖండ చిత్తవృత్తిమాత్రమే మిగిలినట్లుగా, ప్రత్యగభిన్నమైన కేవలపరబ్రహ్మగా మిగిలిపోతుంది.

వి॥ 'అథాధునా..................' అని ఇక్కడ వాక్యం ప్రారంభమైంది. "అథ" అనే పదానికి మంగళము, అనంతరము, ప్రారంభము, ప్రశ్న, పూర్ణత్వం అనే అర్థాలున్నాయి. ఇక్కడ 'అథ' అని ప్రారంభించడంలో ఉద్దేశ్యం "తత్త్వమసి" అనే వాక్యమూ, దానియొక్క అర్థమూ శిష్యుడు అవగతం చేసుకొన్న తర్వాత అని. అందుచేత ఇక్కడ "అథ" అనే పదం అనంతర్యార్థంలో ప్రయోగించబడింది. ఇక "నిత్యశుద్ధ" మొదలైన వాటిని వివరిస్తున్నాడు.

నిత్య – అంతరహితమైన, శుద్ధ – అవిద్యాదిదోషశూన్యమైన,

బుద్ధ – స్వప్రకాశస్వరూపమైనట్టి, జడత్వాదులు లేనట్టి,

ముక్త – సర్వవిధముల ఉపాధులనుండి విడివడిన,

సత్య – అవినాశిస్వబావముగల,

పరమానంద– కర్మజన్యమైన, క్షయము తప్పనిలౌకిక ఆనందముల కంటె పరమైన ఆనందము,

అనంత – అంతములేని అనగా అంతటా వ్యాపించిన, దేశతః పరిచ్ఛేదం కాని

అద్వయ – ఏకైక, అఖండమైన

పూర్వోక్తరీతిలో ఆచార్యుడు శుద్ధచైతన్యముయొక్క అసలు స్వరూపమూ, ఆది ఆవరించబడటంవల్ల బయట కనిపించే జగత్తే శుద్ధచైతన్యంగా భావించబడటం శిష్యునికి బోధించాక ఆ శిష్యుని మనస్సు నిర్మలమౌతుంది. శుద్ధచైతన్యస్వరూపం ఎప్పుడైతే అతను తెలుసుకుంటాడో అప్పుడు అతని మనసులో ఎలాంటి చిత్తవృత్తులు ఉండవు. అద్దం ఉంటేనే కదా! అందులో వస్తువు ప్రతిబింబించేది. ప్రతిబింబమే వస్తువుగా భావించేదేను. అద్దం లేకపోతే వస్తువు స్వస్వరూపంలో ఉంటుంది. అదే విధంగా శుద్ధచైతన్యాన్ని జగత్తులో ప్రతిబింబింపజేసే అజ్ఞానం తొలగిపోతే శుద్ధచైతన్యమే మిగులుతుంది. అందుచేత శుద్ధచైతన్యస్వరూపం తెలుసుకొన్న అధికారి వేదవేదాంగవేత్తా. మోక్షేచ్ఛగలవాడూ అయిన శిష్యునికి "తత్త్వమసి" ఆ "చైతన్యం నీవు" అన్నవాక్యం మనసుకు హత్తుకొని, వెనువెంటనే "అహం బ్రహ్మాస్మి" ఆ విశుద్ధచైతన్యమైన బ్రహ్మను నేను. అనే అనుభవం కలుగుతుంది. ఈ అనుభవాన్ని చెప్పే వాక్యం కనుక "అహం బ్రహ్మాస్మి" అనుభవవాక్యం అని చెప్పబడింది.

**మూ॥ ఏవం చ సతి "మనసైవానుద్రష్టవ్యం యన్మనసా న మనుతే" ఇత్యనయోః శ్రుత్యోరవిరోధో వృత్తివ్యాప్యత్వాఙ్గీకారేణ ఫలవ్యాప్యత్వ ప్రతిషేధప్రతిపాదనాత్, తదుక్తమ్.**

**ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నివారితమ్,**
**బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా" ఇతి.**

**''స్వయంప్రకాశమానత్వాన్నాభాస ఉపయుజ్యతే'' ఇతి చ జడపదార్థాకారాకారితచిత్తవృత్తిరజ్ఞాతం ఘటం విషయీకృత్య తద్గతాజ్ఞాననిరససపురఃసరం స్వగతచిదాభాసేన జడం ఘటమపి భాసయతి తదుక్తమ్ –**



**"బుద్ధితత్స్థచిదాభాసౌ ద్వావేతౌ వ్యాప్నుతో ఘటమ్,**
**తత్రాజ్ఞానం ధియా నశ్యేదాభాసేన ఘటః స్ఫురేత్" ఇతి.**

**యథా దీపప్రభామణ్డలమన్ధకారగతం ఘటపటాదికం విషయీకృత్య తద్గతాన్ధకారనిరసనపురఃసరం స్వప్రభయా తదపి భాసయతీతి. 29**

అను.వా॥ఇలా ఉంటూండగా "మనసుతోనే చూడాలి", "దేనినైతే మనసుచేత తెలుసుకోలేడో" అనే రెండు శ్రుతివాక్యాలకు కూడా విరోధం ఉండదు. ఎందుచేతనంటే బ్రహ్మజ్ఞానానికి వృత్తివ్యాప్యత్వం మాత్రం అంగీకరించబడింది. ఫలవ్యాప్యత్వం ప్రతిషేధించబడింది. ఈ విషయం 'పంచదశి'లో ఇలా చెప్పబడింది. "శాస్త్రకారులు ఈ విషయంలో (బ్రహ్మకు సంబందించినంతవరకు) ఫలవ్యాప్యత్వం మాత్రం ఉండదు అని చెప్పారు. బ్రహ్మవిషయంలో గల అజ్ఞానాన్ని పోగొట్టడానికై వృత్తివ్యాప్యత్వం కావలసిందే. (పంచదశి 7–92) అదే సందర్భంలో "బ్రహ్మ స్వయంప్రకాశం గలది కాబట్టి చిదాభాసతో అవసరం లేదు". అని కూడా చెప్పబడింది. బ్రహ్మవిసయంలోని వృత్తికే, జడపదార్థం విషయంలోని వృత్తికీ భేదం ఉంది. అది ఎలాగంటే – 'ఇది ఘటము అని ఘటాకారంగా పరిణమించిన చిత్తవృత్తి అంతవరకు తెలియని ఘటాన్ని (ఘటం యొక్క ఉనికిని) తెలుపుతుంది. ఘటం విషయంలోని అజ్ఞానాన్ని తొలగించిన ఆ చిత్తవృత్తి తనయందలి చిదాభాసం (ప్రకాశం)తో ఘటాన్ని భాసింపజేస్తుంది. ప్రకటింపజేస్తుంది. ఈ విషయం పంచదశిలో విద్యారణ్యులవారు ఇలా చెప్పారు. "బుద్ధి మరియు దానియందలి చిదాభాసము" – ఈ రెండూ ఘటాన్ని వ్యాపిస్తాయి. బుద్ధివలన ఘటవిషయకమైన అజ్ఞానం నశిస్తుంది. ప్రకాశం వల్ల ఘటం కన్పిస్తుంది. ఏ విధంగానైతే దీపంయొక్క కాంతివలయం చీకటిలో ఉన్న ఘట, పటాదుల విషయంలో మొదట వాటినావరించి ఉన్న అంధకారాన్ని తొలగించి తరువాత ఆ ఘట, పటాల్ని కనబడేట్లు చేస్తుందో అదే విధంగా బుద్ధివలన

ఘటవిషయకమైన అజ్ఞానం తొలగిపోవటమూ, తరువాత దానియందలి ప్రకాశము వలన "ఘటం" వ్యక్తమవటమూ జరుగుతుంది.

వి॥ వృత్తి అంటే మనస్సు ఇంద్రియాలద్వారా పదార్థాన్ని చేరి ఆ పదార్థాకారంగా పరిణమించటం. అపుడే ఆ పదార్థంయొక్క జ్ఞానం కలుగుతుంది.

ఏదైనా ఒక విషయం గురించి తెలుసుకొన్నప్పుడు ఆ జ్ఞానంలో రెండు దశలుంటాయి. మొదటిది వృత్తివ్యాప్తి. రెండవది ఫలవ్యాప్తి. వృత్తివ్యాప్తిని గురించి వేదాంత పరిభాషలో గ్రంథకర్త ఇలా వివరించాడు. "ఏ విధంగానైతే తటాకం యొక్క రంధ్రములనుండి వెలువడిన నీరు చిననచిన్న కాలువల ద్వారా కేదారల్లో (పంటపొలాల్లో)కి ప్రవేశించి, అక్కడ ఆ క్షేత్రం ఆకారంలో చతురస్రంగా పరిణమిస్తుందో అదే విధంగా తైజసమైన అంతఃకరణం కూడా కళ్లు మొదలైన ఇంద్రియాలద్వారా ఘటము మొదలైన విషయములను (వస్తువులను) చేరి వాటి ఆకారంలో పరిణమిస్తుంది. ఈ విధంగా అంతఃకరణ చైతన్యం పదార్థాకారంగా పరిణమించటమే "వృత్తి". ఇదే విధంగా అంతఃకరణం అఖండబ్రహ్మను పొంది ఆ బ్రహ్మ ఆకారంలో పరిణమిస్తుంది. ఈ దశనే వృత్తివ్యాప్తత్వము అంటారు. ఘటాదులను విషయంలో దీపంలాగా ఈ అంతః కరణం బ్రహ్మను భాసింపజేస్తే అది 'ఫలవ్యాప్తి' అవుతుంది. అయితే ఈ ఫలవ్యాప్తి బ్రహ్మేతరమైన వాటికే వర్తిస్తుంది కాని బ్రహ్మకు కాదు. స్వప్రకాశము కానట్టి జడపదార్థాలైన ఘటాదులను భాసింపజేయాటానికి చిదాభాసము కావాలి కానీ స్వయంప్రకాశమైన బ్రహ్మను భాసింపజేయటానికి ఏ చిదాభాసం యొక్క ఆపేక్షా లేదు. అందుచేతనే పైన రెండుశ్లోకాల్లోనూ బ్రహ్మవిషయంలో వృత్తివ్యాప్యత్వం తప్ప ఫలవ్యాప్యత్వం కుదరదు అని చెప్పారు.

మూ॥ **ఏవంభూతస్వస్వరూపచైతన్యసాక్షాత్కారపర్యన్తం శ్రవణ మననని దిధ్యాసనసమాధ్యనుష్ఠానస్యాపేక్షితత్వాత్తేఽపి ప్రదర్శ్యన్తే. శ్రవణం నామ షడ్విధలిఙ్గైరశేషవేదాన్తానామద్వితీయే వస్తుని తాత్పర్యావధారణమ్. లిఙ్గాని తూపక్రమోపసంహారాభ్యాసాపూర్వతా**



**ఫలార్థవాదోపపత్త్యాదీని, తత్ర ప్రకరణప్రతిపాద్యస్యార్థస్య తదాద్యన్తయోరుపపాదనముపక్రమోపసంహారౌ. యథా ఛాన్దోగ్యే షష్ఠాధ్యాయే ప్రతిపాద్యస్య వస్తునస్తన్మధ్యే పౌనః పున్యేన ప్రతిపాదనమభ్యాసః యథా తత్రైవాద్వితీయవస్తునః మధ్యే తత్త్వమసీతి నవకృత్వః ప్రతిపాదనమ్. ప్రకరణ ప్రతిపాద్యస్యాద్వితీయవస్తునః ప్రమాణాన్తరావిషయీకరణమపూర్వతా. యథా తత్రైవాద్వితీయవస్తునో మానాన్తరావిషయాకరణమ్. ఫలం తు ప్రకరణప్రతిపాద్యస్యాత్మజ్ఞానస్య తదనుష్ఠానస్య వా తత్ర తత్ర శ్రూయమాణం ప్రయోజనమ్. యథా తత్ర "ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సమ్పత్స్య" ఇత్యద్వితీయవస్తుజ్ఞానస్య తత్ప్రాప్తిః ప్రయోజనం శ్రూయతే. ప్రకరణప్రతిపాద్యస్య తత్ర తత్ర ప్రశంసనమర్థవాదః. యథా తత్రైవ "ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుత్రం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్" ఇత్యద్వితీయవస్తుప్రశంసనమ్. ప్రకరణప్రతిపాద్యార్థసాధనే తత్ర తత్ర శ్రూయమాణా యుక్తిరుపపత్తిః. యథా తత్ర "యథా సౌమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" ఇత్యాదావద్వితీయవస్తుసాధనే వికారస్య వాచారమ్భణమాత్రత్వే యుక్తిః శ్రూయతే,**

అను.వా॥ ఈ విధమైన (పైన చెప్పబడిన) స్వస్వరూప (బ్రహ్మస్వరూప) అనుభవం కలిగే వరకూ శ్రవణ, మనన, నిధిధ్యాసన, సమాధి అనే నాల్గింటినీ ఆచరించాల్సిన అవసరం ఉండటంచేత ఆ శ్రవణమననాదుల్ని గురించి కూడా ఇక్కడ వివరించబడుతూంది. శ్రవణం అనగా ఆరువిధముల లింగములద్వారా సమస్త వేదాంతములయొక్క తాత్పర్యము. అద్వితీయవస్తువునందే అని నిర్ధారించటం. ఆ ఆరులింగాలు క్రమంగా ఉపక్రమోపసంహారాలు, ఆఖ్యానం, అపూర్వత, ఫలం, అర్థవాదం, ఉపపత్తి. వీటిలో ఉపక్రమము అనగా ఆ ప్రకరణంలో ప్రతిపాదించబోవు

విషయాన్ని గురించిన ప్రస్తావన (ప్రారంభం) అదే విధంగా అంతవరకూ ప్రతిపాదించిన విషయాన్ని చివరగా మళ్ళీ ఒక్కసారి సారాంశంగా చెప్పటం ఉపసంహారం. ఉదాహరణకు ఛాందోగ్యోపనిషత్తులో ఆరవఅధ్యాయంలో ఆ ప్రకరణంలో ప్రతిపాదింపబోయే అద్వైతవస్తువును గురించి "ఏకమేవాద్వితీయం" అని చెప్పటం ఉపక్రమం. అదే అధ్యాయం చివరన "ఐతదాత్మ్యమ్ ఇదం సర్వం" అని ప్రతిపాదించటం ఉపసంహారం. ప్రకరణంలో ప్రతిపాదించే వస్తువును గురించి ప్రకరణమధ్యలో మాటిమాటికీ ప్రస్తావించటం అభ్యాసం.

ఉదాహరణకు అదే అధ్యాయంలో అద్వైతవస్తుప్రతిపాదనకై జరిగే చర్చ మధ్యలో 'తత్త్వమసి' అని తొమ్మిదిసార్లు అదే విషయాన్ని మళ్ళీ మళ్లీ చెప్పటం జరిగింది. ప్రకరణాలద్వారా తెలియదని ప్రతిపాదించటం 'అపూర్వత'.

ఉదాహరణకు అదే అధ్యాయంలో అద్వితీయవస్తువును నిరూపించటానికి ఏ ప్రమాణాలు కుదరవని ప్రతిపాదించబడింది. ప్రకరణంలో ప్రతిపాదించే ఆత్మజ్ఞానసముపార్జనవలన కలిగే ప్రయోజనం, ఆ ఆత్మజ్ఞానం కొరకై చేసే అనుష్ఠానంయొక్క ప్రయోజనం ఏదైతే ఉందో అదే ఇక్కడ 'ఫలం' అని చెప్పబడింది. ఉదాహరణకు అదే అధ్యాయంలో "ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సమ్పత్స్య'' అది అద్వితీయవస్తుజ్ఞానాన్ని గురించి, దాన్ని పొందడంవల్ల ఏర్పడే ప్రయోజనం గురించి చెప్పబడింది. ప్రకరణంలో ప్రతిపాదించబోయే విషయాన్ని అక్కడక్కడ ప్రశంసించటం 'అర్థవాదం'.

ఉదాహరణకు అదే అధ్యాయంలో "ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం" మొదలైన వాక్యాలద్వారా అద్వితీయవస్తువును ప్రశంసించటం. ప్రకరణంలో ప్రతిపాదించే అర్థాన్ని సాధించటానికి చూపే ఉదాహరణయుక్తి. దీన్నే ఉపపత్తి అంటారు. ఉదాహరణకు అదే అధ్యాయంలో "యథా సౌమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" మొదలైన



వాక్యాలతో అద్వైతవస్తుసాధనకై 'వికారం' కేవలం మాటల్లోనే (చెప్పేతీరులోనే) ఉంది అని ప్రదర్శించటం యుక్తి.

వి॥ "శ్రుతి" అనగా వేదవాక్యం 'యుక్తి' అనగా మరో విషయాన్ని ఉదాహరణగా చూపి ప్రస్తుతానికి అన్వయించి చెప్పటం. ఈ రెంటివల్ల మనసులో కలిగే భావం అనుభవం. శ్రుతి, యుక్తి, అనుభవం, ఈ మూడింటిద్వారా అధికారికి బ్రహ్మసాక్షాత్కారం కలుగుతుంది. అయితే సమస్త ఉపాధిరహితమూ, ప్రత్యగాత్మకభిన్నమూ, పరమానందస్వరూపమూ అయిన ఈ విశుద్ధచైతన్యం సాక్షాత్కరించేవరకు సాధకునికీ శ్రవణ, మనన, నిదిధ్యాస, సమాధులు ఆచరణీయాలే. శ్రవణం అనగా వేదవాక్యాలన్నింటి తాత్పర్యమూ అద్వితీయబ్రహ్మప్రతిపాదనయందే అని నిశ్చయంగా తెలుసుకోవటం. వేదానికి గల ఆరులింగాలద్వారా ఈ తాత్పర్యనిర్ణయం జరుగుతుంది. అవి ఉపక్రమాదులు. వీటిన్నింటికీ క్రమంగా ఉదాహరణలు ఛాందోగ్యోపనిషత్తుయొక్క ఆరవఅధ్యాయంనుండి ఇవ్వబడినాయి. అవి......

1. ఉపక్రమం – "ఏకమేవాద్వితీయం" – అద్వితీయమైన, రెండవది ఏది లేని ఒకే వస్తువు (సత్) అని ప్రకరణప్రారంభంలో చెప్పటం.

(ఛాం.1-2-1)

2. ఉపసంహారం – 'ఐతదాత్మ్యమిదం సర్వమ్' – ఇది అనియు ఆ సత్ ఆత్మగా కలిగినదే అని అధ్యాయం చివర చెప్పటం.

3. అభ్యాసం – 'తత్త్వమసి' – 'అది నీవు అయి ఉన్నావు' అని పదే పదే చెప్పటం.

4. అపూర్వత – 'ఏ ప్రమాణాలూ ఈ బ్రహ్మజ్ఞానవిషయంలో పొసగవని క్రొత్తగా చెప్పటం.

5. ఫలం – అద్వైత వస్తువును గూర్చి తెలుసుకోవటం, ఆస్థితిని పొందటం ఈ ప్రయోజనం ఫలం.

"ఆచార్యవాన్ పురుషో వేద ........" ఇత్యాది వాక్యాల్లో ఇలా చెప్పబడింది. "బ్రహ్మవేత్త ఐన ఆచార్యుణ్ణి కలిగిన పురుషుడే (శిష్యుడే) ఆత్మను గూర్చి తెలుసుకొంటాడు. అతడు శరీరబంధంనుండి విడిపడటమే ఆలస్యం. బ్రహ్మత్వాన్ని పొందుతాడు". ఇలా చెప్పటం వలన అద్వితీయబ్రహ్మను గూర్చి తెలుసుకోవటం వల్ల పొందే ఫలం మోక్షం అని స్పష్టమౌతుంది.

6. అర్థవాదం – 'ఉత తమాదేశప్రాక్ష్యో.......' ఇత్యాదివాక్యాలు, "ఎవ్వరిని గూర్చి తెలుసుకున్నంతనే అంతవరకూ వినని విని వినబడతాయో, ఆలోచించనివి ఆలోచనలుగా రూపుదిద్దుకుంటాయో, తెలియనిది తెలిసిపోతుందో అలాంటి తత్త్వాన్ని గూర్చి ఉపదేశించమని నీవు అడిగావా" అని పై వాక్యాలకు అర్థం. ఎక్కడ "అశ్రుతం శ్రుతం" ఇత్యాదులు ఆ తత్త్వం యొక్క గొప్పదనాన్ని ప్రశంసిస్తున్నాయి. అందుచేత దీన్ని అర్థవాదానికి ఉదాహరణంగా చెప్పారు.

7. ఉపపత్తి – "యథా సౌమ్యైకేన" – ఇత్యాదివాక్యాలు – "ఓ సౌమ్యుడా!" ఒకే మట్టిముద్దతో ఘటం మొదలైన సకలమృణ్మయవస్తువులు తయారు చేయబడుతాయి. వాటియొక్క 'వికారం' తయారైన రూపం ఘటం, పాత్ర ఇత్యాది మాటల్లో చెప్పబడుతుంది. పేరు మాత్రమే వేరు కానీ అందులో ఉన్నది మట్టియే అన్నది సత్యం". ఈ విధంగా చెప్పబోయే విషయానికి సరిపోయేట్లుగా ఉదాహరణ చూపటం ఉపపత్తి!.

ఆత్మసాక్షాత్కారానికి సాధనాలైన శ్రవణ, మనన, నిదిధ్యాసన, సమాధులను గురించి వేదాంతంలో వర్ణించబడింది. మొదటి మూడింటినీ గూర్చి 'బృహదారణ్యకోపనిషత్తు'లో ఇలా వివరించబడింది. "తస్మాత్ బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యం చ పాణ్డిత్యం చ నిర్విద్యాథముని" (బృ. 3-5-1) అనగా అందుచేత బ్రాహ్మణుడు ఆత్మజ్ఞానమనే పాండిత్యాన్ని సంతరించుకొని జ్ఞానబలమనే బాలభావంతో ఉండాలని కోరుకోవాలి. అటుపైన బాల్యం మరియు పాండిత్యాని ఈ రెంటినీ గూర్చి తెలుసుకొని అతడు ముని అవుతాడు." ఈ వాక్యాల్లో "పాండిత్య" శబ్దం ద్వారా శ్రవణం, 'బాల్య' శబ్దం ద్వారా మననం, మునిశబ్దం ద్వారా 'నిదిధ్యాసనం' ప్రతిపాదించబడినాయి.



ఉపక్రమ, ఉపసంహారాదులు కూడా బృహదారణ్యకం, తైత్తిరీయం మొదలైన ఉపనిషత్తుల్లో చెప్పబడినాయి. బృహదారణ్యకోపనిషత్తులో "ఆత్మేత్యేవోపాసీతాత్ర హ్యేతే సర్వే ఏకం భవన్తి" అని ఉపక్రమం. "పూర్ణమదః" అని ఉపసంహారం. "స ఏవ నేతి నేత్యాత్మా" అని అభ్యాసం "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అని అపూర్వత. "అభయం వై జనక ప్రాప్తోஉసి", 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' ఇత్యాదులు ఫలాన్ని సూచిస్తాయి. 'తద్యో యో దేవానాం' – ఇత్యాదులు అర్థవాదాలు. "స యథా దున్దుభేః" ఇత్యాదికం ఉపపత్తి.

తైత్తిరియోపనిషత్తులో – "బ్రహ్మవిదాప్నోతి పరం" అని ఉపక్రమం. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని ఉపసంహారము. "స యశ్చాయం" అని అభ్యాసం. "యో వేద నిహితం గుహాయమ్" అని అపూర్వతా ప్రతిపాదనం. "అభయం ప్రతిష్ఠాం విన్దతే అథ సోஉభయం గతో భవతి" అనే వాక్యం ఫలసూచకం. "సోஉకామయత" ఇత్యాది వాక్యాలు అర్థవాదాలు. "అసన్నేవ స భవతి అసద్ బ్రహ్మేతి వేదచేత్. అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదుః" అని "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాద్యదేష ఆకాశ ఆనందో న స్యాత్" అనీ ఉపపత్తివాక్యాలు.

**మూ॥ మననం తు శ్రుతస్యాద్వితీయవస్తునో వేదాంతానుగుణయుక్తిభి రనవరతమనుచిన్తనమ్. విజాతీయదేహాదిప్రత్యయసహితాద్వితీయ వస్తుసజాతీయప్రత్యయప్రవాహో నిదిధ్యాసనమ్. సమాధిర్ద్వివిధః సవికల్పకో నిర్వికల్పకశ్చేతి. తత్ర సవికల్పకో నామ జ్ఞాతృజ్ఞానాది వికల్పలయానపేక్షయా ద్వితీయవస్తుని తదాకారాకారితాయాశ్చిత్త వృత్తేరవస్థానమ్. తదా మృన్మయగజాదిభానేஉపి మృద్భావవద్ ద్వైతభానే உప్యద్వైతం వస్తు భాసతే. తదుక్తమ్ –**

**దృశిస్వరూపం గగనోపమం పరం**
**సకృద్విభాతం త్వజమేకమక్షరమ్**
**అలేపకం సర్వగతం యదద్వయం**
**తదేవ చాహం సతతం విముక్తమోమ్"** ఇతి

అను.వా॥అద్వితీయవస్తువును గురించి వినిన దానిని వేదాంతానికి అనుకూలమైన ఉపపత్తులతో అన్వయించుకొని వాటిని గురించి ఆలోచించటమే మననము.

విజాతీయమైన శరీరాదులను గురించి పట్టించుకొనక అద్వితీయ వస్తువును గురించిన, వాటికి సంబంధించిన (సజాతీయ) వాటివైపే మనసును మళ్ళించటం నిదిధ్యాసనం. సవికల్పమూ నిర్వికల్పమూ, అని సమాధి రెండువిధములు. సవికల్పక సమాధి అనగా జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనే విభాగాలు పోకుండగానే (ఉంటుండగానే) అద్వితీయవస్తువుపై ఆ అద్వితీయాకారంగా పరిణమించిన చిత్తవృత్తి నిలవటం. ఆ స్థితిలో మట్టితో చేయబడిన ఏనుగు మొదలైనవి కన్పిస్తూన్నట్లు ఉన్నప్పటికీ వాటిలో మట్టియే భాసించినట్లుగా, ద్వైతం బాసిస్తూండగానే అద్వైతవస్తువుకూడా భాసించటం – దీన్ని గూర్చి ఇలా చెప్పబడింది–

"పరమూ, గగనోపమమూ, జన్మరహితమైనదీ ఒక్కమాటుగా ప్రకాశించేది, నిర్లిప్తమైనదీ, సర్వవ్యాప్తమైనదీ, సతతమూ విముక్తమైనది అయిన అద్వైతచైతన్యస్వరూపం, ఏకాక్షరమైన ఓంకారం ఏదైతే ఉందో ఆ ఓంకారమే నేను".

వి॥ మననం అంటే ఏమిటే తెలియజేస్తున్నాడు 'వేదాంతానుగుణ'..... అని ఆరులింగాలద్వారా వేదాంతవాక్యాలకు బ్రహ్మయందే తాత్పర్యమని అవగతం చేసుకొన్న సాధకుడు ఆ విషయాన్ని కుతర్కంతో గాక, వేదాంతానికి అనుగుణంగా ఉండే వాక్యాలతో అన్వయించుకొని నిరంతరం వాటిని గూర్చే ఆలోచించాలి, ఎందుచేతనంటే ధర్మస్వరూపం తెల్సుకోవటానికి ఋషి ప్రోక్తమూ, వేదానికి అవిరోధి అయిన తర్కాన్ని అనుసంధానం చేసుకోవాలి. అందుచేతనే ఇలా చెప్పారు –

**ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రవిరోధినా,**
**యస్తర్కేణానుసన్ధత్తే సధర్మం వేదనేతరః.** – మనుస్మృతిః 12–106



ఇక్కడ 'ధర్మ' శబ్దం ఉపలక్షణంచేత 'బ్రహ్మ'కు వర్తిస్తుంది. శ్రీ శంకరభగవత్పాదులు కూడా 'బ్రహ్మ' జ్ఞాన విషయంలో తర్కం ఎంతవరకు ఉపయోగిస్తూందో ఇలా వివరించారు –

'యదపి శ్రవణవ్యతిరేకేణ మననం విదధచ్ఛబ్ద ఏవ తర్కమప్యాదర్తవ్యం దర్శయతీత్యుక్తమ్. నానేన మిషేణ శుష్కతర్కస్యాత్మలాభః సమ్భవతి, శ్రుత్యనుగృహీత ఏవ హ్యత్ర తర్కోఽనుభవాఙ్గత్వేనాశ్రీయతే'.

–బ్రహ్మసూత్రం శాం.భా. 2–1–6

"ఏ శబ్దమయితే శ్రవణంకంటె అతిరిక్తమైన మననాన్ని ఆత్మజ్ఞానానికి సాధనంగా చెప్తూందో అదే తర్కాన్ని కూడా ఆదరించమని చెప్తూంది. అంతమాత్రం చేత శాస్త్రవిరోధమైన శుష్కతర్కాన్ని ఆదరించమని కాదు. వేదానికి అనుకూలంగా ఉండే తర్కాన్నే బ్రహ్మజ్ఞానానికి అంగంగా అంగీకరిస్తారు." శ్రుతివాక్యాలద్వారా తత్త్వార్థనిర్ణయం జరిగాక అసంభవాదిదోషాలను పరిహరించటానికి ప్రయుక్తమయ్యే తర్కమే వేదాంతానికి అనుగుణమైనది. ఈ విషయంలో విద్యారణ్యులు పంచదశిలో ఇలా వివరించారు – (పంచదశి 1–53), 'యుక్తి' అనగా ఉపపత్తిని చూసి తత్త్వంతో అనుసంధానించటమే మననం.

ఆత్మకంటే భిన్నమైనవన్నీ కూడా జడపదార్థాలే. బుద్ధికూడా స్వయంప్రకాశకం కాదు కాబట్టి జడమే. అందుచేత ఇలాంటి జడపదార్థాలకు సంబంధించిన ప్రతీతులు (జ్ఞానం) విజాతీయాలు. పరబ్రహ్మ సాక్షాత్కారానికై సహాయపడేవి మాత్రమే సజాతీయాలు. ఈ సజాతీయపదార్థాల విషయంలో మనసును కేంద్రీకరించటం 'నిదిధ్యాసనం'.

'పంచదశి'లో నిదిధ్యాసనం గూర్చి ఇలా చెప్పబడింది –

**తాభ్యాం నిర్విచికిత్సేఽర్థే చేతనః స్థాపితస్య యత్,**
**ఏకతానత్వమేతద్ధి నిదిధ్యాసనముచ్యతే 1–54**

శ్రవణమననాలద్వారా ఆత్మస్వరూపాన్ని నిర్ధారించుకొని, ఆ ఆత్మస్వరూపంనందే చిత్తాన్ని నిలిపి, అదే రూపాన్ని అవిచ్ఛిన్నంగా ఆ చిత్తంలో ఉండేటట్లు చేయటం నిదిధ్యాసనం. చిత్తం యొక్క ఏకాగ్రత, (ఒకేదానిపైన చిత్తం స్థిరంగా నిలవటం) సమాధి. ఈ సమాధిలోని రెండుభేదాల్లో మొదటిదైన సవికల్పకసమాధిలో ముముక్షువుజ్ఞానం, తెల్సుకోదగిన బ్రహ్మతత్త్వం మూడూ భాసిస్తాయి. అనగా ఆ మూడూ ఏకాకారంలో అద్వితీయరూపంలో కాక, విడిగా భాసిస్తున్నప్పటికీ అద్వితీయవస్తువైన బ్రహ్మకూడా భాసిస్తుంది. అది ఎలాగంటే మట్టితో ఏనుగు బొమ్మను చేసేవానికి ఏనుగు ఆకారం స్ఫురించటంతోబాటు అందులోని 'మట్టితత్త్వం కూడా తెలుస్తుంది. ఇంతకు మునుపు ఉదాహరించబడిన 'దృశిస్వరూపం అనే శ్లోకంలోని ఒక్కొక్కపదానికీ శ్రుతిప్రామాణ్యం చూపుతున్నాడు. దృశిస్వరూపం అనగా చైతన్యఘనం, దీన్ని 'విజ్ఞానఘన ఏవ' ('విజ్ఞానఘనమే') అన్న శ్రుతివాక్యం చెపుతోంది. 'గగనోపమం' (ఆకాశంవలె) అనే విషయాన్ని 'ఆకాశవత్సర్వగతశ్చ' అనే శ్రుతివాక్యం చెపుతూంది. పరం అనగా మాయాతీతమైనది. దీన్ని గూర్చి 'అక్షరాత్పరతః పరః' – (అక్షరంకంటే పరమైనట్టి) అనే శ్రుతివాక్యం, 'సకృత్ విభాతం' (ఒక్కసారి ప్రకాశించేది) అనేదాన్ని "సకృద్విభాతోహ్యేవైష బ్రహ్మలోకః" (ఒక్కసారి దీనికి పగలు అవుతుంది) అనే శ్రుతివాక్యం, 'అజం' (జన్మలేనిది) అనేదాన్ని 'న జాయతే మ్రియతే వా విపశ్చిత్' (పండితునికి జననం లేదు మరణమూ లేదు) అనే శ్రుతివాక్యం, 'ఏకం' అనేదాన్ని 'ఏకం సన్తం బహుధా కల్పయన్తి' (ఒకటిగా ఉన్నదాన్ని నానావిధాలుగా కల్పిస్తారు) అనే శ్రుతివాక్యం, 'అక్షరం' అనేదాన్ని "యేనాక్షరం పురుషం వేద సత్యం" (దానిచేత సత్యమైన అక్షరమైన (నాశంలేని) పురుషుణ్ణి తెలుసుకున్నాడో) అనే శ్రుతివాక్యం, 'అలేపకం' అనేదాన్ని "నిరవద్యం నిరంజనం" (ఏ లోపం లేని నిర్లిప్తమైన) అనే శ్రుతివాక్యం, 'సర్వగతం' అనేదాన్ని 'యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం" (దేనియందు ఆకాశం, భూమీ, అంతరిక్షం అల్లుకొని ఉన్నాయో) అనే శ్రుతివాక్యం, అ 'ద్వయం' అనేదాన్ని "అశబ్దమస్పర్శమరూపం" (శబ్ద, స్పర్శ, రూపాలు లేని) అనే శ్రుతివాక్యం,



'అహం' అనేదాన్ని "అహం బ్రహ్మాస్మి" (నేనే బ్రహ్మను అయి ఉన్నాను) అనే శ్రుతివాక్యం తెలుపుతున్నాయి.

సవికల్పకసమాధిస్థితియందున్న సాధకునికి "నిర్లిప్తమైన (ఏమీ అంటని), అవిద్యాదిదోషవర్జితమైన సర్వవ్యాప్తమైన, అద్వితీయమైన ఓంకారమే నేను" అని భాసిస్తుంది. ఈ భావనను గూర్చి శ్రీమద్భాగవతంలో ఇలా వర్ణించబడింది.

**బద్ధో ముక్త ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః**
**గుణస్య మాయామూలత్వాన్న మే మోక్షో న బన్ధనమ్.** *(11-11-1)*

"సత్త్వ, రజస్తమోగుణాలహెచ్చుదగ్గులవల్లనే నేను బద్ధుడను, నేను ముక్తుడను అని అనటం. అంతేకాని వస్తుస్వరూపాన్ని బట్టికాదు. ఈ సత్త్వాదిగుణాలకు మూలం మాయ. అందుచేత (మాయలేని స్థితిలో) నాకు మోక్షమూ లేదు. బంధము లేదు. ఇంతవరకూ సవికల్పక సమాధిస్థితిని వర్ణించి, ఇప్పుడు నిర్వికల్పకసమాధిస్థితిని వివరిస్తున్నాడు.

**మూ॥ నిర్వికల్పకస్తు జ్ఞాతృజ్ఞానాదివికల్పలయాపేక్షయా ద్వితీయవస్తుని తదాకారాకారితాయాశ్చిత్తవృత్తేరతితరామేకీభావే నావస్థానమ్. తదా తు జాలాకారాకారితలవణావభాసేన జలమాత్రావభాసవద ద్వితీయవస్త్వాకారాకారిచిత్తవృత్త్యనవభాసేనాద్వితీయవస్తుమాత్రమవ-భాసతే. తతశ్చాస్య సుషుప్తేశ్చాభేదశఙ్కా న భవతి. ఉభయత్ర వృత్త్యభావే సమానేఽపి తత్సద్భావాసద్భావమాత్రేణానయోర్భేదోపపత్తేః.**

అను.వా॥ నిర్వికల్పకసమాధిదశయందు జ్ఞాత, జ్ఞానం, జ్ఞేయము అనే వికల్పాలు సమసిపోయి అద్వైతాకారమైన చిత్తవృత్తి అత్యంత ఏకీభావంతో (ఒకే ఒక్కరూపంతో) అద్వైతవస్తువునందు నిలిచిపోతుంది. ఆ స్థితిలో నీటిలో కరిగిన ఉప్పు, ఉప్పులాగా కాకుండా నీటివలె భాసించినట్లుగా అద్వైతాకారంగా ఏర్పడిన చిత్తవృత్తి, చిత్తవృత్తిగా భాసించకుండా కేవలం అద్వైతవస్తువు మాత్రమే భాసిస్తుంది. అయితే ఈ నిర్వికల్పకసమాధి, సుషుప్తీ ఒక్కటే కదా అన్న శంక కలుగవచ్చు. ఈ రెండూ ఒక్కటే

కాదు. ఈ రెంటికీ ఒక్క భేదం ఉంది. రెండింటిలోనూ 'వృత్తి' భాసించక పోవటంవరకూ సమమే, అయితే సుషుప్తిలో 'వృత్తి' ఉండదు, నిర్వికల్పకసమాధిలో అది ఉంటుంది.

వి॥ జ్ఞాత – సాధకుడు, జ్ఞానం – బ్రహ్మజ్ఞానం, జ్ఞేయం – బ్రహ్మతత్త్వం. ఈ మూడు ఒక త్రిపుటి. సవికల్పకదశలో వాటివాటి ప్రత్యేకరూపాలు భాసించవు. అన్నీ కలిపి ఒక్కటిగానే భాసిస్తాయి. ఈ మూడు ఉంటుండగానే, ఆ మూడు ఒక్కటిగా భాసిస్తాయి. ఉదాహరణకు కులాలుడు, మట్టిబొమ్మ, మట్టి, కులాలుడు – మట్టితో బొమ్మను చేస్తూన్నప్పుడు మట్టి వేరు. బొమ్మ వేరు అనే భావం ఉండదు. బొమ్మ కన్పడుతుంది. అది మట్టిది అనే తెలుస్తుంది. నిర్వికల్పకసమాధిదశలో ఈ మూడు భాసించకుండా కేవలం అద్వైతవస్తువు (పరబ్రహ్మ) భాసిస్తుంది. ఉప్పు నీటిలో వేసినప్పుడు అది కలిగిపోయి నీరుగా మారిపోతూంది. అలాంటప్పుడు నీటిలో నీరే కనబడుతుంది. కాని ఉప్పు కనబడదు. అందులో లయమైపోయింది కనుక. అలాగే అద్వితీయవస్తువునందు చిత్తవృత్తి నిలిచిపోయినప్పుడు ఏ చిత్తవృత్తి భాసించదు. కేవలం అద్వితీయవస్తువే భాసిస్తుంది. ఈ నిర్వికల్పకసమాధిని యోగదర్శనంలోని ధర్మమేఘసమాధితో పోలుస్తూ విద్యారణ్యులవారు తమ పంచదశిలో ఇలా వర్ణించారు --

**అనాదావిహ సంసారే సఞ్చితాః కర్మకోటయః**
**అనేన విలయం యాన్తి శుద్ధో ధర్మో వివర్ధతే,**
**ధర్మమేఘమిమం ప్రాహుః సమాధిం యోగవిత్తమాః,**
**వర్షత్యేష యతో ధర్మామృతధారాః సహస్రశః.** *(పంచదశి 1-59-60)*

అనాదియైన ఈ సంసారంలో సంచితమైన కోట్లకొలది కర్మలు ఈ నిర్వికల్పకసమాధిచేత నశింపచేయబడతాయి. శుద్ధమైన ధర్మం వృద్ధినొందుతుంది. ఈ ధర్మంవలన అజ్ఞానావరణం తొలగిపోయి, తత్త్వ సాక్షాత్కారం సిద్ధిస్తుంది. ఈ ధర్మంనుండి సహస్ర అమృతధారలు కురుస్తాయి కాబట్టి దీనిని యోగిపుంగవులు 'ధర్మమేఘం' అని అన్నారు.

ఇప్పుడు సమాధియొక్క అంగాలను గూర్చి వివరిస్తున్నాడు.



**మూ॥ అస్యాఙ్గాని యమనియమాసనప్రాణాయామప్రత్యాహార ధారణధ్యానసమాధయః, తత్ర అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యా పరిగ్రహా నియమాః. కరచరణాదిసంస్థానవిశేషలక్షణాని పద్మస్వస్తికాదీన్యాసనాని. రేచకపూరకకుమ్భకలక్షణాః ప్రాణనిగ్రహోపాయాః ప్రాణయామాః ఇన్ద్రియాణాం స్వ స్వ విషయేభ్యః ప్రత్యాహరణం ప్రత్యాహారః, అద్వితీయవస్తున్యన్తరిన్ద్రియధారణం ధారణా, తత్రాద్వితీయవస్తుని విచ్ఛిద్య విచ్ఛిద్యాన్తరిన్ద్రియవృత్తిప్రవాహో ధ్యానమ్. సమాధిస్తూక్తః సవికల్పక ఏవ.**

అను.వా॥ యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధి అనునవి ఎనిమిది, ఈ నిర్వికల్పకసమాధికి అంగములు. వీటిలో అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం (ధనం కూడబెట్టకపోవడం) అను ఐదు యమాలు, శౌచ (నిర్మలాంతరంగం), సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం నియమాలు, కరచరణాదులు ఒక విశిష్టపద్ధతిలో ఉంచి పద్మాసనం, స్వస్తికాసనం మొదలైనస్థితిలో శరీరాన్ని నిలపటం ఆసనం, రేచకం, పూరకం, కుంభకం మొదలైన ప్రాణవాయువు నిగ్రహం ప్రాణాయామం, ఇంద్రియాలను వాటికి సంబంధించిన విషయాలవైపు వెళ్లకుండా వెనక్కి తీసుకోవటం – ప్రత్యాహారం, అద్వితీయవస్తువునందు అంతఃకరణాన్ని నిలిపి ఉంచటం ధారణం అద్వితీయవస్తువునందు అంతఃకరణవృత్తులు ఆగి, ఆగి ప్రవహించటం ధ్యానం. సమాధి అనగా ఇంతకుమునుపు చెప్పిన సవికల్పకసమాధియే.

వి॥ పైన పేర్కొనబడిన సమాధియొక్క అంగాలే పతంజలి యోగసూత్రంలో కూడా 'యోగానికి' చెప్పబడినాయి. ''యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధారణాధ్యానసమాధయోష్టావఙ్గాని' అని యోగసూత్రం – (పతం.యో.సూ. 2-26). దీనిబట్టి చూస్తే యోగదర్శనంలోనూ అద్వైతవేదాంతంలోనూ సాధనాప్రక్రియ ఒకటేనని స్పష్టమౌతుంది. యమాదుల్ని గూర్చిన వివరణ ఇలా వుంది.

వివిధ బ్రహ్మాండాల్ని (సమస్తాన్నీ) ఒకే ఒక్కబ్రహ్మగా భావించి ఇంద్రియాల్ని వశంలో ఉంచుకోవటం యమం. 'యమం'లోని అవాంతరభాగాలైన అహింసాదుల్ని గూర్చి ఇలా చెప్పబడింది.

అహింస : మనసా, వాచా, కర్మణా ఎవరినీ నొప్పించకుండా ఉండటం అహింస. "వాఙ్మనః కాయైః పరపీడావర్జనమహింసా" అని చెప్పారు. ఎట్టి పరిస్థితిలోనైనా, ఎల్లవేళలా సకలప్రాణులపట్లా ద్రోహచింతన లేకపోవడమే అహింస అని వ్యాసభాష్యం. ''అహింసా సర్వథా సర్వదా సర్వభూతానామనభిద్రోహః' (వ్యా.భా. 2–30).

సత్యం : "సత్యం యథార్థే వాఙ్మనసే, యథాదృష్టం, యథానుమితం యథా శ్రుతం తథా వాఙ్మనశ్చేతి. పరత్ర స్వబోధసంక్రాన్తయే వాగుక్తా. సా యది న వఞ్చితా భ్రాన్తా వా ప్రతిపత్తి వన్ధ్యా వా భవేదితి. ఏషా సర్వభూతోపకారార్థం ప్రవృత్తా, న భూతోపఘాతాయ. యది చైవమప్యభిధీయమానా భూతోపఘాతపరైవ స్యాన్న సత్యం భవేత్, పాపమేవ భవేత్. తేన పుణ్యాభాసేన పుణ్యప్రతిరూపకేణ కష్టతమం ప్రాప్నుయాత్. తస్మాత్పరీక్ష్య సర్వభూతహితం బ్రూయాత్" (వ్యాసభాష్యం – 2 –30). ప్రత్యక్షంగా తెలుసుకున్నదాన్నిగానీ, అనుమానప్రమాణంద్వారా తెలుసుకున్నదాన్నిగానీ, ఆగమప్రమాణంవల్ల తెలుసుకున్నదాన్నిగానీ యథాతథంగా మనసా గ్రహించటం. వాచా వెలువరించటం 'సత్యం' అనబడుతుంది. తనకు ప్రమాణపూర్వకంగా తెల్సినదానిని ఇతరులకు అందజేయడంలో భ్రాంతిని కల్గించేదిగాగానీ, వంచించేదిగానీ, లేదా అందిచాల్సింది అందించడంలో విఫలమవటంగానీ ఉన్నట్లయితే ఆ వాక్కు సత్యం కాజాలదు. అంతేగాక సత్యమన్నది ప్రాణికోటి ఉపకారానికై ప్రవర్తించాలేగానీ ఎన్నడూ అపకారానికై ప్రవర్తించకూడదు. సత్యం మాట్లాడటం వలన ఎవరికైనా అపకారం జరిగే పక్షంలో అది 'పుణ్యం' అనిపించే పాపానికే దారితీస్తుంది. అందుచేత చక్కగా పరిక్షించి సర్వభూతహితమైన సత్యాన్నే పలకాలి. ఇదే విషయాన్ని ఇలా వివరించారు.

**సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియమ్,**
**ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః.**



అస్తేయం : 'అస్తేయమదత్తాదానరూపపరస్వహరణరాహిత్యమ్' – తాను ఇతరులకు ఇవ్వకపోవటం, ఇతరులనుండి గ్రహించటం అస్తేయ మనబడుతుంది. వ్యాసభాష్యంలో – 'స్తేయమశాస్త్రపూర్వకం ద్రవ్యాణాం పరతః స్వీకరణం, తత్ప్రతిషేధః పునరస్పృహారూపమస్తేయం' – అని చెప్పబడింది. అనగా శాస్త్రవిరుద్ధంగా ఇతరుల ద్రవ్యాన్ని స్వీకరించటం స్తేయం. ఇతరుల ధనంపై ఆసక్తిలేకపోవటం, శాస్త్రవిరుద్ధంగా వారి సొమ్మును స్వీకరించకపోవటం అస్తేయం. దీన్నిబట్టి లోకవ్యవహారంలో చెప్పబడే స్తేయం (దొంగతనం) వల్ల కలిగే దుష్ఫలితం ఈ పరధనాన్ని స్వీకరించటంవల్ల కూడా కలుగుతుంది అని స్పష్టమౌతుంది. మనసా, కర్మణా ఇతరుల ధనాన్ని హరించకుండటం అస్తేయమనీ అది సాధకునికి అత్యంతావశ్యకమనీ సుస్పష్టం.

బ్రహ్మచర్యం : 'బ్రహ్మచర్యమష్టాంగమైథునవర్జనమ్' – ఎనిమిదివిధాలైన మైథునాన్ని వర్జించటం బ్రహ్మచర్యం.

ఆ ఎనిమిది విధాలుగా చెప్పబడిన మైథునం ఈ క్రింద –

**స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణమ్,**
**సఙ్కల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవ చ.**
**ఏతన్మైథునమష్టాఙ్గం ప్రవదన్తి మనీషిణః.**

'విపరీతం బ్రహ్మచర్యమేతదేవాష్టలక్షణమ్' (దక్షసంహిత అ. 7) కేవలం శారీరకసంగమమే మైథునం కాదు. స్మరణం (తల్చుకోవటం), వారిని (ప్రియతముల) గూర్చి పదే పదే మాట్లాడటం, కేళి, రహస్యసంభాషణం, మనసులో ప్రియతములతోడి సంగమాన్ని సంకల్పించటం, ఆ రకమైన అనుభూతిని పొందటం, మైథునక్రియ. ఈ ఎనిమిదీ మైథునంకే వర్తిస్తాయి. ఈ విధంగా చేయకుండా అన్నివిధాలా మనోవాక్కాయకర్మలద్వారా మైథునాన్ని వర్జించటమే బ్రహ్మచర్యం.

**అపరిగ్రహం :** 'సమాధ్యనుష్ఠానానుపయుక్తస్య వస్తుమాత్రస్యాసఙ్గ్రహః'. 'సమాధి అనుష్ఠానానికి ఉపయోగించని వస్తువులను తీసుకొనకపోవటం.

అనుష్ఠానానికి ఉపయోగించేవి తప్ప తద్భిన్నమైన విషయభోగాలకై వస్తువులను స్వీకరించటం పరిగ్రహం, యోగభాష్యంలో 'విషయాణామర్జనరక్షణక్షయ సఙ్గహింసాదోషదర్శనాదస్వీకరణమపరిగ్రహః' – అని చెప్పారు. విషయ సుఖాలుదోషభూయిష్ఠాలు. వాటిని ఆర్జించటం, రక్షించటం రెండూ కష్టమే. ఏ క్షణంలో అయినా అవి తరిగిపోతాయి. వాటిపట్ల ఆసక్తి పెంచుకొన్న కొలదీ పెరుగుతుంది. తద్వారా మనోవ్యాకులత్వం ఏర్పడుతుంది. విషయ సుఖాలపై ఆసక్తి ఉన్నవాడు ఇతరులని నొప్పించకుండా ఉండడు. అది హింసాదోషం. ఈ విధంగా విషయభోగాలలోని దోషాలని తెలుసుకొని వాటిని గ్రహించకుండా ఉండటం అపరిగ్రహం.

శౌచాదినియమాలను గూర్చి ఇలా చెబుతున్నాడు.

**శౌచం :** 'శౌచం బాహ్యాభ్యన్తరలక్షణమ్'. శౌచం అనగా అంతరంగంలోనూ, బహిరంగంలోనూ శుచిగా ఉండటం.

**శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్యామాభ్యన్తరం తథా,**
**మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధిస్తథాన్తరమ్.**

బాహ్యమూ, అభ్యన్తరమూ అని శౌచం రెండు విధాలు. మృత్ (మట్టి) మరియు జలంచేత శరీరశుద్ధి బాహ్యశౌచం. భావనైర్మల్యం అన్తరంగిక శౌచం, మట్టిమొదలైన వాటిచేత కూడా శరీరశుద్ధి చెప్పబడింది. ఈర్ష్యాసూయలు లేకపోవటమే భావనిర్మలత్వం.

**సంతోషం :** 'సన్తోషో యదృచ్ఛాలాభసన్తుష్టిరలాభే చావిషాదః' దొరికినదాంతో తృప్తిగా ఉండడమే సంతోషం. తనకు ఇష్టమైనదైనా, కాకపోయినా ఏది లభిస్తే దాన్ని గ్రహించటం, దేనిపట్లా రాగద్వేషాలు లేకపోవటం దీన్నే 'యాదృచ్ఛాలాభసంతుష్టి' అంటారు.

**తపస్సు :** 'తపః కామానశనం' తనకు నచ్చినది తినకపోవటమే తపస్సు. "మనసశ్చేన్ద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః" మనస్సూ, ఇంద్రియాల యొక్క ఏకాగ్రతే తపస్సు అని కూడా కొందరు చెప్పారు. సమాధికి అంగంగా



చెప్పబడిన ఈ తపస్సుకు అర్థం చాంద్రాయణాదివ్రతాలు ఎంతమాత్రమూ కావు. సమాధికై సాధించే సాధకునికి వ్రతాలని ఆచరించటం కుదరదు.

**స్వాధ్యాయం :** 'ప్రణవ' జపము, ఉపనిషత్గ్రంథాల అధ్యయనం స్వాధ్యాయం. 'ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం'. "ఉపనిషదమావర్తయేత్" అని శ్రుతివాక్యాలు స్వాధ్యాయం గూర్చి చెబుతున్నవి. 'ఓం' కారాన్ని జపిస్తూ ఆత్మను గూర్చి ధ్యానం చేయటం, ఉపనిషద్వాక్యాలను అధ్యయనం చేయటం స్వాధ్యాయం. యోగభాష్యం కూడా "ప్రణవపరిత్రాణాం జపః మోక్షశాస్త్రాధ్యయం వా" అని ఈ విషయాన్నే చెప్తుంది. స్వాధ్యాయం మనస్సు యొక్క ఏకాగ్రతకు ఎంత అవసరమో యోగభాష్యంలో ఇలా వర్ణించబడింది.

**స్వాధ్యాయాత్ యోగమాసీత యోగాత్ స్వాధ్యాయమామనేత్,**
**స్వాధ్యాయయోగసమ్పత్త్యా పరమాత్మా ప్రకాశతే**

*–యోగభాష్యం 1–28*

స్వాధ్యాయం ద్వారా యోగాన్ని (చిత్తవృత్తినిరోధం) పొందాలి. యోగం ద్వారా స్వాధ్యాయాన్ని మననం చేయాలి. ఈ విధంగా ఈ రెంటినీ పొందినవానికి పరమాత్మ ప్రకాశిస్తాడు. (సాక్షాత్కరిస్తాడు).

ఈశ్వరప్రణిధానం : 'ఈశ్వరప్రణిధానం తస్య మానసైరుపచారైరభ్యర్చనం' ఈశ్వరుణ్ణి మనసా ధ్యానించటం ఈశ్వరప్రణిధానం.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,**
**తం హి దేవమాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే**

*– శ్వేతాశ్వతర 6–18*

"సృష్ట్యాదియందు బ్రహ్మను సృష్టించినట్టీ, ఆ బ్రహ్మకు వేదాలను అందించినట్టీ, మా బుద్ధిని ప్రకాశింపజేయునట్టీ ఆ దేవుని (సర్వశక్తిమంతుని) మోక్షమును కోరే నేను శరణు కోరుచున్నాను." అని ఈశ్వరుణ్ణి ధ్యానించటం అన్నీ అతనికే సమర్పించటం ఈశ్వరప్రణిధానం. ఇలాంటి ఈశ్వరప్రణిధానం ద్వారా సమాధిస్థితి చేకూరుతుంది.

'సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్" అని యోగసూత్రంలో చెప్పబడింది. (యోగసూత్రం 2-45).

ఆసనం : 'ఆస్యతేఽనేన'. 'అస్యతేఽత్ర వ్యాపనమ్' అని కరచరణాది అవయవాలను స్థిరంగా ఒక పద్ధతిలో ఉంచటం ఆసనం. శ్రీ శంకరభగవత్పాదులు తమ అపరోక్షానుభూతిలో ఆసనాన్ని గూర్చి యిలా చెప్పారు.

**సుఖేనైవ భవేద్ యస్మిన్నజస్రం బ్రహ్మచిన్తనమ్,**
**ఆసనం తద్విజానీయాన్నేతరత్సుఖనాశనమ్.** *-అపరోక్షానుభూతి 11*

'ఏ విధంగా కూర్చుంటే బ్రహ్మను గూర్చిన నిరంతరచింతనం సుఖంగా సాగిపోతుందో అదే ఆసనం. అంతేకాని బ్రహ్మధ్యానానికి బాధ కలిగించేది ఆసనం కాజాలదు.'

'స్థిరసుఖమాసనమ్' - శరీరాన్ని నిశ్చలంగా బాధారహితంగా ఉంచేది ఆసనం అని యోగసూత్రంలో చెప్పబడింది. (యో.సూ. 2-47). ఆసనంవల్ల సాధకునికి శీతోష్ణాదిద్వంద్వాలను సహించే శక్తి కలుగుతుంది. "తతో ద్వన్ద్వానభిఘాతః" అని యోగసూత్రం (2-48). ఈ ఆసనాలు స్వస్తికం, పద్మాసనం, భద్రాసనం, వీరాసనం మొదలైనవి.

**ప్రాణాయామం :** ప్రాణవాయువును తన అధీనంలో ఉంచుకొని బయటకు పంపించటం, నిరోధించటం ఇత్యాది ప్రాణాయామం అనబడుతుంది. ఇది రేచకం, పూరకం, కుమ్భకం అని మూడు విధాలు. నాసికయొక్క ఎడమపుటంనుండిగానీ, కుడిపుటంనుండి కానీ ఒకదానితో వాయువును లోపలికి పీల్చి మరొకదానితో ద్వారా మెల్లిగా బయటకు వదలడాన్ని రేచకం అంటారు. ఇదే విధంగా వాయువును లోపలికి పీల్చటాన్ని పూరకం అంటారు. నాసికాపుటంలోని వాయువును కొంతసేపు లోపలే నిరోధించటం కుంభకం అంటారు. మొత్తంపైన మెల్లిగా వాయువును లోపలికి పీల్చటం, మెల్లిగా వదలటం, లోపలే కొంతసేపు నిరోధించటం ఈ మూడూ సరిగా చేయటమే ప్రాణాయామం. ఈ ప్రాణాయామాన్నే ఈ క్రింది శ్లోకాల్లో చక్కగా వివరించారు.



**నిష్క్రమ్య నాసావివరాదశేషం ప్రాణం బహిః శూన్యమివానిలేన,**
**నిరుధ్య సన్తిష్ఠతి రుద్ధవాయుః స రేచకో నామ మహానిరోధః**

శరీరంలోని వాయువును అంతటినీ ముక్కురంధ్రం ద్వారా బయటికి పంపించేసి లోపల వాయువు ఏమాత్రం లేకుండా ఉండేట్లుగా బయటనే వాయువును నిరోధించటం 'రేచకం'.

**బాహ్యే స్థితం ఘ్రాణపుటేన వాయుమాకృష్య తేనైవ శనైః సమన్తాత్,**
**నాడీశ్చ సర్వాః పరిపూరయేద్ యః స పూరకో నామ మహానిరోధః.**

బయట ఉన్న వాయువును నాసికాపుటంతో మెల్లగా లోపలికి పీల్చుకొని లోపల ఉన్న నాడులన్నింటిలోకీ ప్రసరింపజేయటాన్ని 'పూరకం' అంటారు.

**స రేచకో నైవ చ పూరకోఽత్ర సానాపుటే సంస్థితమేవ వాయుమ్,**
**సునిశ్చలం ధారయతి క్రమేణ కుమ్భాఖ్యమేతత్ప్రవదన్తి తజ్జ్ఞాః.**

బయటకి వదలక, లోపలికి పీల్చక, నాసాపుటంలో ఉన్న వాయువును నిశ్చలంగా అలాగే ఉంచటాన్ని యోగప్రక్రియ తెలిసినవారు 'కుంభకం' అని అంటారు. (భాస్వతి 2-50)

ప్రత్యాహారం : 'స్వవిషయసమ్ప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః' (యోగసూత్రం 2-54)

'ధ్యానసమయంలో తమ తమ విషయాలతో సంబంధించని ఇంద్రియాలు అంతఃకరణంయొక్క స్వరూపాన్ని అనుసరించినట్లుగా ఉండటం ప్రత్యాహారం'.

సాధకుడు ధ్యానంలో ఉన్న సమయంలో చిత్తం ధ్యేయాన్నే నిలుపుకోవటంవల్ల 'శబ్దాదివిషయాలను వదిలివేస్తుంది.' చక్షురాది ఇంద్రియాలు విషయాలయొక్క దర్శనాదుల్ని అందజేయాలంటే మనస్సు యొక్క సహకారం కావలసిందే. అందుచేత చిత్తం ఏకాగ్రతలో ఉన్నప్పుడు ఇంద్రియాలు తమ విషయాలవైపు వెళ్లవు. అలాగని చిత్తంలాగా ధ్యేయమైన బ్రహ్మ ఆకారంలోకి పరిణమించవు. అవి వాటి విషయాలనుండి మరలి ఉండటంచేత చిత్త

స్వరూపాన్నే అనుకరిస్తూన్నట్లుగా ఉంటుంది. ఈ స్థితినే ప్రత్యాహారం అంటారు. అందుచేత సాంసారికవిషయాలకు ఇంద్రియాలు విముఖంగా ఉండటమే ప్రత్యాహారం.

**ధారణ : యత్ర యత్ర మనో యాతి బ్రహ్మణస్తత్ర దర్శనాత్,**
**మనసో ధారణం చైవ ధారణా సా పరా మతా.**

*–అపరోక్షానుభూతి 122*

'మనస్సు ఎక్కడెక్కడికి వెళ్తుందో అక్కడంతా బ్రహ్మనే దర్శించి (బ్రహ్మమయంగా భావించి), అట్టి భావననే మనసులో నిలుపుకోవటం ధారణ.

సర్వేషాం బుద్ధిసాక్షితయా విద్యమానేఽద్వితీయవస్తుని చిత్తనిక్షేపణం ధారణా" అందరి బుద్ధులకు సాక్షిగా ఉన్న సాక్ష్యం కనుక అద్వితీయ వస్తువునందే చిత్తాన్ని నిలపటం ధారణ.

యోగసూత్రంలో "దేశబంధశ్చిత్తస్య ధారణా" 'ఒకానొక నిర్దిష్టమైన పరిధిలో చిత్తాన్ని నియంత్రించటం ధారణ' అని చెప్పబడింది. (యో.సూ.3-1)

ధ్యానం : "తత్ర ప్రత్యైకతానతా ధ్యానమ్" – ఒకే ప్రవాహంగా చిత్తవృత్తి ఉండటం ధ్యానం (యో.సూ. 3-2).

**బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలమ్బతయా స్థితిః,**
**ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానన్దదాయినీ.**

*–అపరోక్షానుభూతి 12-3*

"నేను బ్రహ్మను అనే చిత్తవృత్తి ఏర్పడడం. బ్రహ్మతప్ప మిగతా విషయాలేవి చిత్తవృత్తికి ఆలంబనలుగా లేకపోవటం అనే ఆనందదాయకమైన స్థితియే ధ్యానమ్."

**సమాధి :** యమాదిఅంగాలు కలదే సమాధి. ఇది సవికల్పకసమాధి. (ఇది మొదటే స్పష్టం చేయబడింది). ఇప్పుడు నిర్వికల్పకసమాధినిగూర్చి వివరిస్తున్నాడు.



**మూ॥ ఏవమస్యాఙ్గినో నిర్వికల్పస్య లయవిక్షేపకషాయరసాస్వాద లక్షణాశ్చత్వారో విఘ్నాః సమ్భవన్తి. లయస్తావదఖణ్డవస్త్వవస్తాలమ్బనేన చిత్తవృత్తేర్నిద్రా. అఖణ్డవస్త్వనవలమ్బనేన చిత్తవృత్తేరన్యావలమ్బనం విక్షేపః లయవిక్షేపాభావేఽపి చిత్తవృత్తే రాగాది వాసనయా స్తబ్ధీభావాదఖణ్డవస్త్వనవలమ్బనం కషాయః. అఖణ్డవస్త్వనవలమ్బనేనాపి చిత్తవృతేః సవికల్పకానన్దాస్వాదనం రసాస్వాదః సమాధ్యారమ్భసమయే సవికల్పకానన్దాస్వాదనం వా. 32**

అను.వా॥ ఈ విధంగా ఇంతకు మునుపు చెప్పిన అంగాలను కలిగిన నిర్వికల్పక సమాధికి నాలుగు విఘ్నాలున్నాయి. అవి లయం, విక్షేపం, కషాయం, రసాస్వాదం అనునవి. అఖండవస్తువును అవలంబనంగా గ్రహించకుండా చిత్తవృత్తి నిద్రాగ్రస్తంకావటం 'లయం' అఖండవస్తువును కాకుండా చిత్తం మరొక వస్తువును అవలంబనంగా చేసుకోవటం 'విక్షేపం'. లయవిక్షేపాలు ఈ రెండూ లేని స్థితిలో కూడా 'రాగం' మొదలైన 'వాసనల' చేత స్తంభించిపోయిన చిత్తవృత్తి అఖండవస్తువును అవలంబనంగా గ్రహించకపోవటం 'కషాయం'. అఖండవస్తువును అవలంబనంగా గ్రహించకుండా సవికల్పక సమాధియందే ఆనందాన్ని ఆస్వాదించటం 'రసాస్వాదం', లేదా సమాధి యొక్క ఆరంభదశలోనే సవికల్పకంయొక్క ఆనందాన్ని అనుభవించటం రసాస్వాదం.

వి॥ సవికల్పకం, నిర్వికల్పకం అని సమాధి రెండు విధాలు అని ఇంతకు పూర్వం చెప్పబడింది. సవికల్పకసమాధిదశయందు అఖండవస్తువు భాసించటంతో బాటు ఇతరమైనవి కూడా భాసించటం జరుగుతుంది. నిర్వికల్పకసమాధిదశయందు ఇలాంటి వికల్పాలు (ఇతరమైనవి భాసించటం) ఏమీ ఉండవు. అందుచేత నిర్వికల్పకసమాధి 'అంగి' అవుతుంది. యమ, నియమాదులతో పాటు సవికల్పకసమాధి దానికి అంగం అవుతుంది. ఎందుచేతనంటే యమ, నియమాలు సాధకునకు నిర్వికల్పకసమాధికై ఎలా

తోడ్పడతాయో సవికల్పకసమాధి కూడా అలాగే తోడ్పడుతుంది. యమ, నియమాదులు ఎంతచక్కగా అవలంబించినా అప్పుడప్పుడు నిర్వికల్పకస్థితికి విఘ్నాలు ఏర్పడుతుంటాయి. అవి అయం, విక్షేపం, కషాయం, రసాస్వాదం. 'లయం' అనగా చిత్తవృత్తి లీనమవటం, యమనియమాది అష్టాంగసాధనద్వారా సాధకుడు నిర్వికల్పసమాధిదశను చేరుకోగల్గుతాడు. అయితే ఈ ప్రయత్నంలో మొదటగా చిత్తవృత్తిని బయటకు అనగా బాహ్యవస్తువులనుండి వల్లించబడిన చిత్తవృత్తి వెంటనే అఖండవస్తువునందు (బ్రహ్మపదార్థంనందు) లీనమవటం అందరి విషయంలోనూ జరగదు. ఆ విధంగా లీనంగాక పోవడానికి సాధకునిలోని ఆలసత్వం కారణం. ఇలాంటిదశలో అఖండబ్రహ్మయందు లీనమవకుండానూ, బాహ్యపదార్థంవైపు వెళ్లకుండానూ ఉన్న చిత్తవృత్తి స్తబ్ధంగా ఉంటుంది, ఇదే 'నిద్ర'. అలా కాకుండా చిత్తవృత్తి అఖండవస్తువునందు లీనమైతే తప్తలోహంపైన పడే జలబిందువులాగా అది పూర్తిగా లీనమైపోతుంది.

సాధకుని నిర్వికల్పసమాధిదశను చేరుకునే ప్రయత్నంలో ఎదురయ్యే ద్వితీయ విఘ్నం, 'విశేషం'. బాహ్యపదార్థాలనుండి మరల్చబడిన చిత్తవృత్తి అఖండవస్తువును ఆలంబనంగా చేసుకోకుండా మరో వస్తువును ఆలంబనంగా చేసుకోవటం విశేషం. సాధకుడు యమనియమాదులచేత చిత్తవృత్తిని అంతర్ముఖం చేస్తారు. బాహ్యపదార్థాలవైపు మరలకుండా దాన్ని నిరోధిస్తాడు. ఆ చిత్తవృత్తిని ఒక్కొక్క విషయంనుండి మరల్చి బ్రహ్మవైపు మళ్ళించే యత్నంలో ఉండగానే ఆ చిత్తవృత్తి మరో పదార్థంవైపు పరుగెడుతుంది. ఈ విధంగా అన్యపదార్థాన్ని అవలంబనంగా చేసుకోవటం 'విక్షేపం'.

నిర్వికల్పకసమాధికి ఏర్పడే ఆటంకాలలో మూడవది 'కషాయం' లయ, విక్షేపాదులు తొలిగిపోయిన తర్వాత కూడా చిత్తవృత్తి బ్రహ్మపదార్థాన్నే అవలంబనంగా చేసికోవడంలో అంతరాయాలు ఏర్పడతాయి. సాధకుడు శాస్త్రంలో చెప్పబడిన శ్రవణమననాదులద్వారా చిత్తాన్ని అంతర్ముఖం చేస్తున్నప్పటికి జన్మాంతరంలోని రాగాది వాసనలు చిత్తవృత్తిని అఖండవస్తువు వైపు వెళ్ళకుండా చేస్తాయి. విషయాలనుండి విముఖమైన చిత్తవృత్తి,



బ్రహ్మపదార్థంవైపు వెళ్ళటానికి ఆటంకం ఏర్పడటంతో ఎటూవెళ్లలేక స్తబ్ధంగా ఉండిపోతుంది. అలా అవటానికి కారణం రాగాదివాసన, అదే కషాయం.

ఇక నిర్వికల్పకసమాధికి ఏర్పడే అంతరాయాల్లో నాల్గవది రసాస్వాదం. 'సాధకుడు' 'చిత్తవృత్తిని' బాహ్యవస్తువుల పైనుండి మరల్చి అఖండవస్తువు వైపు మళ్ళించేంతలో ఆ చిత్తవృత్తి అఖండవస్తువు వైపు మరలకుండా సవికల్పక సమాధిదశలోనే ఉండి రసాస్వాదం (ఆనందానుభవం) చేస్తుంటుంది. ఒక మనుష్యుడు అతి గుప్తంగా దించబడిన నిధికై ప్రయత్నించి, ఆ నిధిని స్వంతం చేసుకోబోయేలోగా ఆ నిధి రక్షకుడు అడ్డుపడినట్లయితే అంతవరకు నిధికోసం తాపత్రయపడినవాడు దాన్ని వదలి తనను తాను రక్షించుకునేందుకు ప్రయత్నించినట్లుగా ఉంటుంది పైన చెప్పబడిన సాధకుని పరిస్థితి. సంసారంలోని విషయాల పట్ల వైముఖ్యం కలగడంతో ఏర్పడిన శాంతిలోనే సాధకునికి ఆనందం లభించటంతో అఖండబ్రహ్మను పొందకుండా ఉండిపోతాడు, ఈ విధంగా అవాస్తవమైన రసానుభూతియే 'రసాస్వాదమనబడే' విఘ్నము.

**మూ॥ అనేన విఘ్నచతుష్టయేన విరహితం చిత్తం నిర్వాతదీపవదనలం సదఖణ్డచైతన్యమాత్రమవతిష్ఠతే యదా తదా నిర్వికల్పకః సమాధిరిత్యుచ్యతే. తదుక్తమ్ –**

**లయే సమ్బోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః,**
**స కషాయం విజానీయాచ్ఛమప్రాప్తం న చాలయేత్.**
**నాస్వాదయేద్రసం తత్ర నిఃసఙ్గః ప్రజ్ఞయా భవేత్' ఇతి**
**యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా' ఇతి చ. 33**

అను.వా॥ ఈ నాలుగువిధాలైన విఘ్నాలు లేకుండా ఉన్న చిత్తం గాలిలేనిచోట ఉంచబడిన దీపం వలె స్థిరంగా ఉంటుంది. ఎప్పుడైతే ఈ విధంగా అచలస్థితిలో ఉన్న చిత్తం అఖండచైతన్యాన్ని మాత్రం అవలంబించి ఉంటుందో అప్పుడే ఆ స్థితి నిర్వికల్పకసమాధి అనబడుతుంది. ఈ విఘ్నాల్నీ నివారించటం ఎలాగో ఈ క్రింద చెప్పబడింది.

లయస్థితిలో ఉన్న చిత్తాన్ని మేల్కొల్పాలి. నిక్షిప్తంగా ఉన్న చిత్తాన్ని శమింపజేయాలి. చిత్తంలో ఉన్న కషాయాన్ని గుర్తించాలి. శమప్రాప్తించిన తర్వాత చిత్తానికి చాపల్యం (చంచలత్త్వం) రాకుండా చూడాలి. సవికల్పకసమాధిదశలోనే ఉండి రసాస్వాదం చేస్తూ ఉండి పోగూడదు. సాధకుడు నిస్సంగుడై ప్రజ్ఞాయుతుడు కావాలి. ఈ స్థితిని గాలిలేనిచోట ఉండే దీపంతో పోలుస్తారు. గాలిలేనిచోట దీపం ఏ విధంగా నిశ్చలంగా ఉంటుందో చిత్తం కూడా అలాగే నిశ్చలమై ఉంటుంది.

వి॥ ఇంతకుమునుపు విఘ్నస్వరూపాలను మంత్రం వివరించి ఇప్పుడు వాటి నివారణోపాయాలను చెబుతున్నాడు. చిత్తంలో 'లయ' అనే విఘ్నం ఏర్పడి ఆలసత్యం చేత అది అఖండ బ్రహ్మవైపు వెళ్ళినప్పుడు మనస్సును ఉద్బుద్ధం చేయాలి. స్తబ్ధంగా ఉన్నదాన్ని చైతన్యవంతం చేయాలి. 'విక్షేపం' అనే విఘ్నం ఏర్పడినప్పుడు చిత్తం బ్రహ్మేతర పదార్థాలవైపు వెళ్లకుండా ఆపుచేయాలి. ఇతర పదార్థాల యందలి దోషాల్ని పరిగణించి చిత్తాన్ని అంతర్ముఖం చేయాలి. చిత్తంలో వాసన (సంస్కారం) వలన ఏర్పడిన రాగం అఖండబ్రహ్మను చేరటంలో ఆటంకం ఏర్పరుస్తుంది. అలాంటి రోగాన్ని చిత్తం లోంచి తొలిగించటానికి ప్రయత్నించాలి. తద్వారా 'కషాయం' అనే విఘ్నం తొలగిపోతుంది. అఖండ బ్రహ్మవైపు మరలకుండానే విషయవైముఖ్యం వలన కలిగిన వైరాగ్యంవలన తృప్తిచెందిన చిత్తం నిర్వికల్పక దశను చేరకుండానే 'ఆనందాన్ని' అనుభవిస్తుంది. ఈ 'ఆనందం' సచ్చిదానందం కాదని వివేచనద్వారా తెలుసుకొని నిస్సంగుడై అఖండబ్రహ్మపైనే చిత్తం నిలపాలి. ఈ విధంగా చేయటంతో రసాస్వాదం అనే విఘ్నం తొలగిపోతుంది.

**మూ॥ అథ జీవన్ముక్తలక్షణముచ్యతే, జీవన్ముక్తో నామ స్వస్వరూపాఖణ్డబ్రహ్మజ్ఞానేన తదజ్ఞానబోధనద్వారా స్వస్వరూపాఖణ్డబ్రహ్మణి సాక్షాత్కృతే ఽజ్ఞాన తత్కార్యసఞ్చితకర్మసంశయవిపర్యాయాదీనామపి బాధితత్వాదఖిలబన్ధరహితో బ్రహ్మనిష్ఠః**



**"ఛిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరాపరే". ఇత్యాది శ్రుతేః. 34**

అను.వా॥ ఇప్పుడు జీవన్ముక్తలక్షణం చెబుతున్నాము. జీవన్ముక్తుడనగా జీవించి ఉండియే భవబంధాలనుండి విడివడినవాడు. అనగా తన స్వరూపమైన అఖండబ్రహ్మ స్వరూపాన్ని గూర్చి తెలుసుకొని, తద్వారా తనకు బ్రహ్మవిషయంలో గల అజ్ఞానంతొలగిపోగా సత్యమైన అఖండబ్రహ్మసాక్షాత్కరించగా, అంతవరకూ ఉన్న అజ్ఞానం, ఆ అజ్ఞానం వలన ఏర్పడిన సమస్తకార్య ప్రపంచమూ, సంచిత కర్మలూ, సంశయ, విపర్యయాదులు అన్నీ బాధితమైపోయి (తొలగిపోయి) సకలబంధాలూ తొలగిపోయి బ్రహ్మగా బ్రహ్మస్వరూపంలోనే నిలిచి ఉన్న సాధకుడు జీవన్ముక్తుడు.

ఈ జీవన్ముక్తుని స్థితి ఎట్టిదంటే – 'ఆ పరావరుని దర్శనం కలుగగనే హృదయగ్రంధి (హృదయంలోనిముడులు) విచ్ఛిన్నమైపోతాయి (తెగిపోతాయి). సర్వసంశయాలు పటాపంచలైపోతాయి. కర్మలన్నీ (కర్మఫలాలు) నశిస్తాయి" అని శ్రుతి చెప్తూంది.

వి॥ ఈ విధంగా నిర్వికల్పక సమాధిదశను పొందిన సాధకుడు బ్రతికి ఉండియే మోక్షాన్ని పొందుతాడు. బంధాలనుండి విడిపోవడమై ముక్తి. తాను అఖండ బ్రహ్మపదార్థం నుండి వేరుకాదనీ, ఆ అఖండబ్రహ్మస్వరూపం తానేననీ 'తత్త్వమసి' మొదలైన వాక్యాల ద్వారా తెలుసుకొని 'అహం బ్రహ్మాఽస్మి' అనే అనుభవాన్ని పొందిన సాధకునికి అజ్ఞానమూ, తద్వారా కలిగే స్థూలసూక్ష్మ ప్రపంచాలూ ఉండవు. అంతవరకూ సంచితమైన కర్మ, దాని ఫలితాలూ అతణ్ణి బ్రహ్మ విషయంలో సంశయమూ విపర్యమూ ఉండవు. అనగా ఆత్మ కన్న భిన్నమైన 'అఖండబ్రహ్మ' పదార్థం ఉందా లేదా అనే సంశయంగానీ, దేహమే ఆత్మ అనే విరుద్ధ భావనగానీ ఉండవు. ఇవన్నీ కూడా సాధకునికి అఖండబ్రహ్మసాక్షాత్కరించటంతోనే తొలగిపోతాయి. ఆ

సాక్షాత్కారించుకొనబడినవాడు పరావరుడు. అనగా పరుడైన హిరణ్యగర్భుడు కూడా ఎవరికంటే తక్కువో అతడు. అనగా సర్వాత్మ అయిన అఖండబ్రహ్మయే.

ఈ స్థితిని గూర్చి "యస్తు సర్వాణి భూతాని", "యస్మిన్ సర్వాణి భూతాని" అని ఈశావాస్యంలోని రెండు వాక్యాలు చెపుతున్నాయి. 'ప్రజహాతి యదా కామాన్' ఇత్యాది స్మృతి (భగవద్గీత) వాక్యాలు కూడా ఈ స్థితినే వర్ణిస్తున్నాయి.

**మూ॥ అయం తు వ్యుత్థానసమయే మాంసశోణితమూత్రపురీషాదిభాజనేన శరీరేణాన్ధ్యమాన్ద్యపటుత్వాదిభాజనేనేన్ద్రియగ్రామేణాశనాయాపిపాసాశోకమోహాదిభాజనేనాంతఃకరణేన చ పూర్వపూర్వవాసనయా క్రియమాణాని కర్మాణి భుజ్యమానాని జ్ఞానావిరుద్ధారబ్ధఫలాని చ పశ్యన్నపి బాధితత్వాత్పరమార్థతో న పశ్యతి. యథేన్ద్రజాలమితి జ్ఞానవాంస్తదిన్ద్రజాలం పశ్యన్నపి పరమార్థమిదమితి న పశ్యతి. "స చక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ" ఇత్యాదిశ్రుతేః. ఉక్తం చ–**

**"సుషుప్తవజ్జాగ్రతి యో న పశ్యతి**
**ద్వయం చ పశ్యన్నపి చాద్వయత్వతః**
**తథా చ కుర్వన్నపి నిష్క్రియాశ్చ యః**
**స ఆత్మవిన్నాన్య ఇతీహ నిశ్చయః." ఇతి 35**

అను.వా॥ అయితే జీవన్ముక్తుడు దేహేంద్రియాదులతో లోకవ్యవహారాన్ని ఆచరిస్తాడా? లేదా అని ఆశంక. ఒకవేళ మామూలుగానే దేహేంద్రియవ్యవహారం జరుగుతూంది అన్నట్లయితే జీవన్ముక్తికి విలక్షణత ఏమిటి? దేహేంద్రియాలతో వ్యవహరించటం లేదు. అన్నట్లయితే అనుపయుక్తమైన దేహేంద్రియాలు నశిస్తాయి కదా (శ్వాసాదులు కూడా పీల్చకపోవటం, ఆహారాదులు గ్రహించక పోవటం ఇత్యాదులు). అందుచేత జీవన్ముక్తిని లక్షణాల్ని చెపుతున్నాడు. 'అయం తు' ......... అని, ఈ జీవన్ముక్తుడు వ్యుత్థానసమయంలో (నిర్వకల్పకసమాధినుండి బైటకు వచ్చిన సమయంలో) రక్తమాంసాలకూ మూత్రపురీషాదులకూ ఆశ్రయమైన ఇంద్రియసమూహంతో,



క్షుత్పిపాసమోహాదులకు ఆశ్రయమైన అంతః కరణంతో పూర్వకాలపు (గతంలోని) వాసనలనుసరించి కర్మచేస్తూ ఉంటాడు. అకర్మఫలాన్ని అనుభవిస్తూంటాడు. ఇలా అన్నింటినీ అనుభవిస్తూన్నప్పటికీ కూడా అవి బాధితములైపోవటంచేత వాటిని అవే సత్యమనే దృష్టితో చూడుడు. "ఇంద్రజాలప్రదర్శనాన్ని చూస్తున్నవ్యక్తికి అది ఇంద్రజాలం అని తెలిసి ఉండటంచేత అక్కడ జరుగుతున్నదేదీ ఇది నిజమే అని అనిపించదు. దాన్ని చూస్తూంటాడేగానీ అక్కడ కన్పించేది పరమార్థంగా అనిపించదు. జీవన్ముక్తుని పరిస్థితీ అలాంటిదే. అనుభవిస్తున్నదేదీ సత్యం కాదు అని తెలిసీ జరిగేదాన్ని చూస్తూ ఉంటాడు. అందుచేత అతడు "కళ్లుండీ గ్రుడ్డి" వానివలె, "చెవులుండీ చెవిటివానివలె" ఉంటాడు అని శ్రుతివాక్యం చెప్తూంది. ఈ విషయాన్నే ఇలా చెప్పారు. –

"సుషుప్తి దశలో వలే జగ్రదవస్థయందు కూడా ద్వైతాన్ని చూడదు. ఒకవేళ చూచిన ఆ ద్వైతాన్ని కూడా అద్వైతంగానే చూస్తాడు. కర్మ చేస్తూనే నిష్క్రియుడుగా ఉంటాడు. ఇలాంటివాడే ఆత్మవేత్త. అన్యుడు కాదని వేదాంతం చెబుతుంది."

వి॥ సమాధిదశలో ఉన్న జీవన్ముక్తునికి 'బ్రహ్మపదార్థనితప్ప ఇతరవస్తువేదీ భాసించదు. ఆ దశలో అతడు ఏ కర్మా చేయడు. ఏ కర్మఫలాన్నీ అనుభవించదు. అయితే అతడు సమాధినుండి ఉత్థితుడై (వెలువడి)న సమయంలో సాధారణమైన అజ్ఞాని వ్యవహరించినట్లే రక్తమాంసోపేతమైన శరీరంతో, అంధత్వ, మాంద్యత్వ అపటుత్వాది దోషములతో కూడిన ఇంద్రియములతో లోకంలో వ్యవహరిస్తాడు. అయితే వీటన్నింటి పట్లా అతనికి ఆసక్తి ఉండదు. తన చుట్టూ ఉన్నదే సత్యం, పరమార్థం అనుకోడు. ఒకవ్యక్తి ఇంద్రజాలన్ని చూస్తూ ఇది సత్యం కాదు అని ఎలా అనుకుంటాడో అలాగే ఇదంతా సత్యం కాదు అనుకుంటాడు. అందుచేత అతడు కళ్లుండీ అంధునిలా, చెవులుండీ చెవిటివానిలా బాహ్యజ్ఞానం లేకుండా ఉంటాడు. జాగ్రదవస్థలో ఉండి కూడా సుషుప్తి అవస్థలో ఉన్నట్లుగా ద్వైతాన్ని చూడదు. ద్వైతం అతని ముందున్నా దాన్నితడు అద్వైతంగానే చూస్తాడు. 'వసిష్ఠ'డు చెప్పనట్లుగా "సుషుప్తవచ్చరతి స ముక్త ఇతి కథ్యతే" సుషుప్తియందున్న దానివలె ప్రవర్తించేవాడు ముక్తుడు అనబడతాడు.

**మూ॥ అస్య జ్ఞానాత్పూర్వం విద్యమానానామేవాహారవిహారాదీనామనువృత్తి వచ్ఛుభవాసనానామేవానువృత్తిర్భవతి శుభాశుభయోరౌదాసీన్యం వా తదుక్తమ్ –**

**“బుద్ధాద్వైత స తత్త్వస్య యథేష్టాచరణం యది,**
**శునాం తత్త్వదృశాం చైవ కో భేదో శుచిభక్షణే” – ఇతి.**
**బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞానచేతరః. – ఇతి. 36**

అను.వా॥‘ఇతడు జీవన్ముక్తుడు’ అని జీవన్ముక్తుని గూర్చి ఇతరులకు ఎలా తెలుసుంది. అనగా జీవన్ముక్తుని లక్షణాలేమిటి? అనే సందేహానికి సమాధానం పైన చెప్పబడింది.

జీవ, బ్రహ్మైక్యజ్ఞానం ఉదయించిన తరువాత జీవన్ముక్తుడు అంతకు ముందు వ్యవహరించినట్లుగానే ఆహారవిహారాదులవిషయంలో వ్యవహరిస్తాడు. అయితే ఈ దశలో అతనికి కేవలం శుభవాసనల (మంచి సంస్కారాలు) యందే మనసు ప్రవర్తిస్తుంది. లేదా శుభాశుభాలు రెంటినీ పరిగణించని ఉదాసీనమైన నిర్లిప్తమైన దశ చేకూరతుంది. కేవలం శాస్త్రవిహితమైన శుభాన్నే ఆచరించినట్లయితే అతనికీ ఇంకా జ్ఞానోదయం కాని దశలో ఉన్న సాధకునికీ భేదం ఏమిటి? అందుచేత ఔదాసీన్యం ఉంటుంది.

“హింసానుగ్రహయోరనారమ్భో ఔదాసీన్యముపేక్షా” అని గౌతమస్మృతిలో చెప్పబడింది. ఒకరిని ప్రత్యేకించి బాధించటంగానీ, అనుగ్రహించటంగానీ చేయకపోవడమే ఉదాసీనత. అదీగాక అద్వైతతత్త్వానినీజి (జీవబ్రహ్మల ఐక్యాన్ని) తెలుసుకొన్న జ్ఞాని కూడా ఇష్టం వచ్చినట్లుగా ఆచరిస్తే (రాగ, ద్వేషాలతో) ఇక అశుచిభక్షణంలో శునకానికీ, తత్త్వవేత్తకూ భేదం ఏముంది? విచక్షణ లేని శునకం ఎంతో అతడూ అంతే.

బ్రహ్మజ్ఞాని అనగా వ్యాసభాష్యం ప్రకారం –

**నిరాశిషమనారమ్భం నిర్నమస్కారమస్తుతిమ్,**
**అక్షీణం క్షీణకర్మాణం తం దేవా బ్రాహ్మణం విదుః.**



ఏ కోరకలు లేనివాడు, ఇది కావాలని ప్రయత్నం చేయనివాడు, ఎవరినుండీ నమస్కారాలుగానీ, స్తోత్రాలుగానీ ఆశించనివాడు, ఎవరికీ నమస్కరించనివాడు, ఎవరినీ స్తుతించినవాడు క్షీణించనివాడు, కర్మలు క్షీణించినవాడు జ్ఞాని అని దేవతలు చెపుతారు.

‘అమౌనం మౌనం చ నిర్విద్యాథ బ్రహ్మణ’ అని బృహదారణ్య కోపనిషత్తులో చెప్పబడింది. అందుచేత ఔదాసీన్యమే జీవన్ముక్తులక్షణం. అంతేగాని విహితాన్ని తప్పక ఆచరించటంగానీ, నిషేధాన్ని అతిక్రమించటం గానీ కాదు. అందుచేత బుద్ధుడైనవాడు నిష్కామకర్మనే చేస్తాడు. మోక్షాన్ని కోరే సాధకుడే తాను కోరినదానికై ప్రయత్నించినపుడు ఇక బ్రహ్మవేత్త అయిన వ్యక్తిని గూర్చి వేరే చెప్పాలా?

యో హి యత్ర విరక్తః స్యాన్నాసౌ తస్మిన్ప్రవర్తతే,
లోకత్రయాద్విరక్తత్వాన్ముముక్షుః కిమితీహతే,
క్షుధయా పీడ్యమానోఽపి న విషం హ్యత్తుమిచ్ఛతి,
మిష్టాన్నధ్వస్తతృజ్ జానన్నామూఢస్తజ్జిఘత్సతి,
రాగో అజ్ఞమబోధస్య చిత్తవ్యాయామభూమిషు,

కుతః శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః. అని చెప్పారు. అనగా

“ఒకనికి ఏ విషయం పట్ల విరక్తి ఉందో అతడు ఆ విషయం వైపు మనసు మళ్లించడు. ముముక్షువుకు ముల్లోకాల పట్లా విరక్తియే అలాంటప్పుడు అతడు కోరుకునేది ఏముంది. స్వర్గసుఖంకూడా అతనికి అవసరం లేదు. మూర్ఖుడుకాని వాడేవడైనా ఒకసారి అమృతమయమైన మృష్టాన్నం ద్వారా తృప్తిపొందినవాడు (రుచి తెలిసినవాడు) ఆకలితో బాధపడుతున్నా విషాన్ని తినాలనుకోడు. అలాగే బ్రహ్మసాక్షాత్కారంవలన కలిగిన ఆనందాన్ని అనుభవించినవాడు దుఃఖమయమైన సాంసారికవిషయాలవైపు చిత్తాన్ని మరల్చడు. మనసు ఏయే పదార్థాలవైపు మళ్ళుతుందో వాటివల్ల రాగం ఆసక్తి కలిగి ఉండటం అజ్ఞాని లక్షణం. ఏ చెట్టు తొర్రల్లో, కోటరంలో అగ్ని దాగి ఉందో ఆ చెట్టునకు పచ్చదనం ఎక్కడిది? అలాగే రాగయుతుడైన వాని మనసులో

ప్రశాంతత ఎక్కడిది? రాగమనే అగ్ని మనసును పీడిస్తుండే వానికి శాంతి ఉండదు.

**మూ॥ తదానీమమానిత్వాదీని జ్ఞానసాధనాన్యద్వేష్టత్వాదయః సద్గుణాశ్చాలఙ్కారవదనువర్తన్తే. తదుక్తమ్ –**

**ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః,**
**అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః" ఇతి 37**

అను.వా॥జీవన్ముక్తస్థితియందున్నవానికి అమానిత్వం అనగా మానము (గర్వం) లేకపోవటం, అహింస, దంభము లేకపోవటం మొదలైన జ్ఞానసాధనాలు, అద్వేషము, అనసూయఇత్యాది గుణాలు వాటంతటవే అలంకారాలుగా అమరిపోతాయి. ఏ ప్రయత్నం లేకుండానే అతనితో ఈ లక్షణాలు ఉత్పన్నమౌతాయి. ఈ విషయాన్నే ఇలా చెప్పారు. "ఆత్మజ్ఞానం కలిగిన వానికి అద్వేషం, మొదలైన సద్గుణాలు అప్రయత్నంగా చేకూరుతాయి. అవి సాధనరూపాలు కావు."

వి॥ జీవన్ముక్తికి శుభాశుభాలపట్ల ఔదాసీన్యం ఉంటుంది గదా. అలాంటప్పుడు గర్వం, హింస, దంభం మొదలైన వాటి పట్ల నివృత్తి కలుగుతుంది. సరే అలాగే అద్వేషాదులనే గుణాల పట్ల ప్రవృత్తి కూడా కలుగుతుంది కదా అనే ఆశంక కలుగవచ్చు. ఇక్కడ ఒక విషయం స్పష్టంగా తెలుసుకోవాలి. జ్ఞానసాధనాలుగా చెప్పబడేవాటిని అలవరుచుకుంటే చాలు. అటుపైన ఏ ప్రయత్నం లేకుండానే అద్వేషాదులు కలుగుతాయి. ఎందుచేతనంటే అవి అజ్ఞానాన్ని వెన్నంటే ఉంటాయి కనుక. అవిజ్ఞానం యొక్క సహజసిద్ధమైన గుణాలు. అందుచేత అవి జ్ఞానానికి శోభనుగూర్చే అలంకారాలుగా అమరిపోతాయి – అని శ్లోకం తెలియజేస్తుంది.

**మూ॥ క్రిం బహునాయం దేహమాత్రార్థమిచ్ఛానిచ్ఛాపరేచ్ఛాప్రాపితాని సుఖదుఃఖలక్షణాన్యారబ్ధఫలాన్యనుభవన్తంతః కరణాభాసాదీనామవభాసకః సంస్తదవసానే ప్రత్యగానన్దపరబ్రహ్మణి ప్రాణే లీనే సత్యజ్ఞానతత్కార్య**



**సంస్కారాణామపి వినాశాత్పరమకైవల్యమానన్దై కరసమఖిలభేద ప్రతిభాసరహితమఖణ్డ బ్రహ్మావతిష్ఠతే. "నత్యస్య ప్రాణ ఉత్క్రామన్తి". అత్రైవ సమలీయన్తే. "విముక్తశ్చ విముచ్యత" ఇత్యాది శ్రుతేః.**

అను.వా॥ఇంతవరకు జీవన్ముక్తుని గూర్చి వివరించి ఇప్పుడు 'పరమముక్తిని' (విదేహముక్తిని) గూర్చి చెపుతున్నాడు.

ఇంతకంటే ఎక్కువగా ఇంకా ఎంతని చెప్పడం? ఈ జీవన్ముక్తుడు కేవలం దేహయాత్రకై (శరీరం ఉన్నంతవరకు) మాత్రమే కోరినవీ, ఇతరులు కోరినవీ అయిన సుఖమూ, దుఃఖమూ లక్షణాలుగా కలిగిన ప్రారబ్ధ ఫలాల్ని అనుభవిస్తూ, అంతఃకరణం యొక్క ఆభాసను భాసింపచేస్తూ, ప్రారబ్ధకర్మముగిసినంతనే, ప్రత్యగానంద పరబ్రహ్మలో లీనమై, అజ్ఞానమూ, ఆ అజ్ఞానం కారణంగా గల ప్రపంచమూ, తద్వారా ఏర్పడిన సంస్కారాలు (మనోవాసనలు) అన్నీ నశించిపోగా సమస్తభేదాలూ తొలగి ఆనందకరసమూ, కేవలము లేదా కైవల్యరూపమూ అయిన అఖండబ్రహ్మగా నిలిచిపోతాడు. జీవన్ముక్తుని ప్రాణాలు శరీరం నుండి బయటకుపోవు. అతనికి శరీరం ఉండగానే ప్రాణాలు బ్రహ్మయందు లీనమైపోతాయి, విముక్తుడైన అతడు సమస్తబంధాల నుండి విముక్తుడౌతాడు.

వి॥ వేదాంతసారరూపమైన ఈ గ్రంథంలో ఇంకా ఇంతకంటే అధికంగా చెప్పేది ఏమిటి? జీవన్ముక్తుడు శుభాశుభాలపట్ల విరక్తుడు అని ఇది వరకే చెప్పబడింది. కాబట్టి జ్ఞానం కలగటానికి పూర్వం చేసిన కర్మల ఫలం ప్రారంభమై ఉండే (ప్రారబ్ధకర్మ) దాన్ని అనుభవించాలి. అది సుఖరూపమైన కావచ్చు, దుఃఖరూపమైనా కావచ్చు. తాను కోరినది (ఇదివరకు) కావచ్చు. కోరనిది కావచ్చు. ఇతరులు కోరినది కావచ్చు. ఏది ఏమైన జీవన్ముక్తుడు ఆ కర్మఫలాల్ని ఉదాసీనుడుగానే అనుభవిస్తాడు. శరీరం ఉన్నంతవరకూ అవసరమైనంతవరకే నిష్కామ కర్మ (ఫలాపేక్షలేనిపని) చేస్తాడు. అలా ఉన్నప్పటికీ అతని అంతఃకరణంలో అఖండవస్తువైన బ్రహ్మయే భాసిస్తుంది. ప్రారబ్ధ కర్మఫలాలు

నశించగానే ఆత్మానందమైన పరబ్రహ్మలో అతని ప్రాణాలు లీనమౌతాయి. అజ్ఞానం తొలగిపోవటంచేత దానివలన ఏర్పడిన కార్యప్రపంచము అతనికి ఉండదు. అట్టి స్థితిలో పరమానందరసైకరూపమైన కేవల అఖండబ్రహ్మగా నిలిచిపోతాడు. బ్రహ్మ, ఆత్మ (తాను) ఒకటేనని అనుభవం కలిగి బ్రహ్మగా ఉండిపోతాడు. అట్టివానికి శరీరం నుండి ప్రాణం బయటకు వెడలకుండా బ్రహ్మలోనే లీనమౌతుంది. అజ్ఞానం నుండి ముక్తుడైన అతడు అజ్ఞానం చేత ఏర్పడిన అన్నిబంధాలనుండీ విముక్తుడౌతాడు.

శుద్ధబుద్ధముక్తసత్యపరమానన్దాద్వయబ్రహ్మరూపం నేనే అని సాక్షాత్కారం కలుగగానే విలయం (నాశం) లేకుండానే ముక్తడౌతాడు. వస్తుతః (నిజానికి) బంధమూ లేదు మోక్షము లేదు.

శ్రుతి ఇలా చెప్తూంది –

**న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధనః,**
**న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా.**

పరమార్థం చూస్తే నిరోధము లేదు, ఉత్పత్తి లేదు. బద్ధుడూ లేదు. సాధకుడూ లేదు. ముముక్షువూ లేదు. ముక్తుడూ లేదు.

అనగా ఈ ప్రపంచమే భ్రాంతిమూలకమయినప్పుడు ఈ సాధకుడూ, సాధన అంతాకూడ కల్పితమే కదా. లోకవ్యవహారం తెలియజేయటం కోసం, మానవుణ్ణి దుఃఖంనుండి దూరం చేయటం కోసం అజ్ఞానం తొలగించటం కోసమే ఈ శాస్త్రం. జ్ఞాని అయిన తర్వాత ఇదంతా లేనట్లే.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యులైన సదానందులవారు రచించిన
వేదాంతసారము ఇంతటితో సమాప్తము.

శ్రీఃశ్రీఃశ్రీః